# చతుర






ఫిబ్రవరి 2008
రూ.10/-

రెండు సరికొత్త
శీర్షికలు మీకోసం..



కన్సొలేషన్
బహుమతి పొందిన
కాకాని చక్రపాణి
నవల
**శీలపరీక్ష**




## బెరడా..? బల్లా..?

ఈ బెరడును జాగ్రత్తగా పరిశీలిస్తే దానిపైన ఆకులాంటి తోక ఉన్న గెక్కో అనే బల్లి కనిపిస్తుంది. ఇది తూర్పు ఆస్ట్రేలియాలో నివసిస్తుంది. దీని రంగు బెరడు రంగులో ఎంతగా మమేకమయిందంటే ఎంతో దగ్గరినుంచి తీక్షణంగా చూస్తే తప్ప ఇది కనిపించదు. ప్రకృతిలో దాగిన ఇలాంటి వింతలు మన పరిసరాల్లోనూ ఉంటాయి కదూ?!

# విపుల ఆహ్వానము

## అనువాద కథలకు



సుతిమెత్తని సంవేదనలు
అనురాగభరిత ఆత్మ నివేదనలు
ఉత్కంఠభరిత కథన వేగాలు
ఉత్తేజపూరిత చైతన్య ప్రవాహాలు

### ప్రపంచ సాహిత్యంలో కోకొల్లలు

సమకాలీనమై మీ మనసును మురిపించి, మైమరపించిన అన్య భాషల కథలను తెలుగు పాఠకులకు అందించండి,

**అనువాదం సరళంగా, ఆకట్టుకునేలా ఉంటే విపుల మీకు వారధిగా నిలుస్తుంది.**

---

అనువాద రచనల పూర్తి వివరాలతోపాటు, మూలభాషా రచయితల నుంచి పొందిన అనుమతి పత్రం, స్టాంపులంటించిన సొంత చిరునామా గల కవరు జతచేయండి. మూల రచయితల నుంచి అనువాదకులు తగిన అనుమతి పొందలేని సందర్భాలలో మేమే అనుమతి పొందగలం. మీ కథ మాత్రం ఎనిమిది పేజీలకు మించకుండా ఉండాలి.

---

రచనలు పంపవలసిన చిరునామా

సంపాదకుడు
విపుల, ఈనాడు కాంప్లెక్స్,
సోమాజిగూడ, హైదరాబాద్- 500 082.



# చతుర

సంపుటి -31
సంచిక - 1
ఫిబ్రవరి 2008
361వ సంచిక



ముఖచిత్రం : **శ్రేయస్**

చివరి పేజీ : యానాం బాలయోగి బ్రిడ్జి దగ్గరి
దృశ్యం, ఫొటో: మధు

ముఖపత్రాలంకరణ : రాజుయాట

అతడిని ప్రేమించిందామె.
అతనూ తనను
ప్రేమిస్తున్నాడని
మురిసిపోయింది.
కానీ అత డు స్నేహితులతో
కలిసి తన అందాన్ని విందు
చేసుకోవాలని అనుకున్నట్లు
తెలియగానే ఆమె మనసు
విరిగిపోయింది.
ఆ తర్వాత ఏం జరిగింది... ?

**కాకాని చక్రపాణి**
నవల
## శీలపరీక్ష
14 వ పేజీలో
బొమ్మలు: శివాజీ



110 సం॥ల భూత,భవిష్యద్వర్తమాన శతాబ్ది పంచాంగ రచయిత

# పండిత శ్రీ బుట్టే వీరభద్ర దైవజ్ఞ

శ్రీ శ్రీశైల దేవస్థాన ఆస్థాన సిద్ధాంతి గారి

**శ్రీ సర్వధారినామ సంవత్సర 2008-2009**

# గంటల పంచాంగము

**త్వరలో విడుదల అన్ని బుక్ షాపులందు లభించును**

## గ్రహశాంతి యంత్రములు మంత్రకవచములు

అనేక కష్టనష్టముల నుండి తొలగించి రక్షించును
ఇవి శరీరంనందు ధరించు తావీదు యంత్రములు

1. నవగ్రహ శాంతి యంత్రం
2. సర్వజన వశీకరణ యంత్రం
3. జయవశీకరణ యంత్రం
4. సరస్వతి యంత్రం
5. మహాలక్ష్మి యంత్రం
6. వివాహ యంత్రం
7. సంతాన యంత్రం
8. భార్యాభర్తల మైత్రికి
9. సుఖ ప్రసూతి యంత్రం
10. ఉద్యోగ ప్రాప్తియంత్రం
11. వ్యాపారాభివృద్ధి యంత్రం
12. మహాశూలిని యంత్రం
13. రోగనివారణ యంత్రం
14. శనిదోష యంత్రం
15. నరఘోష యంత్రం

పై స్పెషల్ వెండి యంత్రములు ఒక్కొక్కటి పంపుటకు రూ.200/-లు అగును. సొమ్ము ముందుగా ఈక్రింది అడ్రస్‌కు M.O.ద్వారా గాని D.D.ద్వారా గాని పంపండి.
మీ పేరు గోత్రం వివరంగా వ్రాయండి మీ పైకం అందిన 25 రోజులలో పంపగలము

## మీ యింట యంత్రస్థాపనచేయండి! సకల సిరులు పొందండి!

1. శ్రీ మహాలక్ష్మి యంత్రం
2. శ్రీచక్రరాజ యంత్రం
3. శ్రీ మత్స్య యంత్రం
4. శ్రీ నరఘోష యంత్రం
5. శ్రీ ధనాకర్షణ యంత్రం
6. శ్రీ కుభేర యంత్రం
7. శ్రీ ఆంజనేయ యంత్రం
8. శ్రీ లక్ష్మీగణపతి యంత్రం

ఈ యంత్రం ఒక్కొక్కటి 5X5 అం॥లు సైజు రాగి రేకుపైచేసిపూజించిపంపుటకు రూ.350-/లు అగును. సొమ్ముముందుగా ఈక్రింది అడ్రస్‌కు M.O.ద్వారా గాని D.D.ద్వారా గాని పంపండి.
మీ పేరు గోత్రం వివరంగా వ్రాయండి మీ పైకం అందిన 25 రోజులలో పంపగలము.


## బుట్టే వీరభద్ర దైవజ్ఞ

తిలక్ రోడ్, రాజమండ్రి - 3, ఫోన్ (0883) 2469631
E-mail : bvb_divagna@rediffmail.com

అపార్ట్‌మెంటాలజీ

పరికొత్త శీర్షిక

# రాంభరోసా అపార్ట్‌మెంట్స్



యర్రంశెట్టి సాయి

**మా అపార్ట్‌మెంట్స్‌కి రామ్‌భరోసా అపార్ట్‌మెంట్స్ అనే పేరెలా వచ్చెను?**

మా అపార్ట్‌మెంట్స్ చాలా పాతవి. 1980లో కట్టినవి. అప్పట్లో సిటీకి బయట-అంటే ఊరి చివర ఏరియా అనుకుని మా లాంటి మిడిల్ క్లాస్ వాళ్ళకోసం కట్టాడు రామేశ్వర్‌యాదవ్ అనే దాదా! తీరా అందరం లోన్లు తీసుకుని అపార్ట్‌మెంట్స్‌కి డబ్బు కట్టాక గానీ మాకు తెలీలేదు.

వాటికి ఉన్న అనుమతులన్నీ చార్మినార్ ఏరియాలో చాంద్ పైల్వాన్ అనే అతను తను కబ్జా చేసిన ప్లాట్లో ఓ రేకుల షెడ్ వేసి అందులో ఒక ప్రింటింగ్ మిషన్ పెట్టి- ఆ మిషన్లో ప్రింట్ చేసి ఇచ్చాడని!- ఈ సంగతెల్లి కొత్తగా వచ్చిన మునిసిపల్ కమిషనర్ అన్నీ పడగొట్టేస్తాం అంటూ గడ్డపారలూ, హతోడీలూ వేసుకుని కూలీలతో రావటం, మా అపార్ట్‌మెంట్స్ వాళ్ళందరం తలో వందో, రెండొందలో వేసుకుని వాళ్ళకి లంచాలిచ్చి వెనక్కు పంపటం మామూలైపోయింది మాకు. ఇలా ఎంత కాలం కడతాం? కట్టలేం కదా! అందుకని- మేము రెండొందలమంది అపార్ట్‌మెంట్స్ వాళ్ళందరం కలసి మమ్మల్ని మోసగించిన రామేశ్వర్ యాదవ్ ఇంటిముందు ధర్నా చేశాం. పొద్దున్నే హాంగోవర్ పోడానికని ఫ్రెష్‌గా విస్కీ తాగుతున్న రామేశ్వర్ మా అరుపులూ, కేకలూ విని బాల్కనీలోకి గ్లాసుతో సహా వచ్చాడు.

"ఏందిరా భయ్ మీ లొల్లి?" అనడిగాడు చిరాగ్గా.

"నువ్ మమ్మల్నందర్నీ మోసం చేసినావ్- ఫోర్జరీ పర్మిషన్ లెటర్స్‌తో అపార్ట్‌మెంట్స్ కట్టావ్-" అంటూ అరచాడు మా అపార్ట్‌మెంట్స్ అసోసియేషన్ ప్రెసిడెంట్ హమీద్‌మియా!

"అవ్! డాక్యుమెంట్లు ఫోర్జరీవి కాకుంటే ఒరిజినల్ ఏడకెళ్ళొస్తయ్‌రా? హైద్రాబాద్‌ల... ఎవళ్ళయిన ఒరిజినల్ డాక్యుమెంట్స్‌తో బిల్డింగులు కడతారుబే? అరే పాగల్! నేను మంచోడ్ని కాబట్టి ఒక్కొక్క అపార్ట్‌మెంట్ ఒక్కొక్కడికే అమ్మినా! మిగతా జగాల్ల ఒక్కొక్క అపార్ట్‌మెంట్‌కి నాలుగయిదు మందికి రిజిష్టర్ జేసిన్రు! ఎరుకనా?"

ఆ క్వొశ్చన్‌తో మా వాళ్ళంతా కొంచెం

భయపడ్డారు.

వాడికా అయిడియా ఉందంటే- ఏదొక రోజు మళ్ళీ మా అపార్ట్‌మెంట్స్ ఇంకో నలుగురయిదుగురికి అమ్మాడంటే కొంపలు మునిగిపోతయ్.

"మరి ఆ ఆరోబ్లాకులో ఫ్లాట్ నెంబర్ త్రీత్రీత్రీని నువ్ కూడా ముగ్గురికమ్మినావ్ కదా? " అంటూ అరచాడు అపార్ట్‌మెంట్స్ సెక్రటరీ మొహిందర్ సింగ్!

"అవ్- గప్పుడు పైసలు తక్కువబడి అమ్మినా! అయినాగానీ ఆళ్ళు ముగ్గుర్నీ ఆ అపార్ట్‌మెంట్‌లోనే అడ్జస్ట్ జేసినాగదా! ఒకో డికీ ఒకో రూమిచ్చినా.. ఇంకేంగావాల? "

అతన్తో ఇంకా మాట్లాడాలంటేనే మాకు భయంగా ఉంది.

ఇంకేం మాట్లాడితే ఇంకేం కాంప్లికేషన్స్ సృష్టిస్తాడోనని-

"ఇగో- మొహిందర్ సింగ్! వాడితో ఎక్కువ తక్కువ మాట్లాడకు. వాడికి కొత్త కొత్త అయిడియాలొచ్చాయంటే మనం లోపటయిపోతాం!" అన్నాడు క్రిస్టోఫర్.

దాంతో మొహిందర్‌సింగ్ సడెన్‌గా రిట్రీట్ మొదలెట్టాడు.

"గిప్పుడు మేమేం జేయాలో జెప్పు మళ్ళా! ఆ మున్సిపల్ కార్పొరేషనోళ్ళకి నెలనెలా పైసలేడకెళ్ళివ్వాలి? " అన్నాడు రాజీధోరణిలో.

"దాన్దేముంది? ఆళ్ళతో నేను మాట్లాడ తాన్లే! ఇంకోసారి ఆ మున్సిపలోళ్ళు మీ తానకు రాకుండా నేను జేస్తా-"

సిబ్లాక్‌లో ఉంటున్న కాల్ సెంటర్ ఉద్యో గిని షైనీ అందర్నీ తోసుకుంటూ ముందు కొచ్చింది.

"ఈ అపార్ట్‌మెంట్స్ కట్టిన స్థలమంతా గవర్నమెంట్ లాండనీ? అందుకని అందర్నీ బయటగ్గెంటి ఇది కూల్చిపారేసే హక్కు మాకుందని ఆ కలెక్టర్ లెటర్ రాశాడు కదా! దాని సంగతేంటి? " అడి గింది షైనీ.




ఈ ప్రశ్నతో రామేశ్వర్ యాదవ్‌కి కోపం వచ్చింది.

"నీకేం దమాక్ గిట్ల ఖరాబయిందా? గవర్నమెంట్ లాండ్ కబ్జా చేయకుంటే ప్రైవేట్ లాండ్ జేస్తరా? సిటిలో మూడొం తుల భూమి కబ్జా లాండే- అంతా గవర్న మెంట్‌దే! పైసలు పడేస్తాం- రెగ్యులరైజే షన్ చేసుకుంటాం. ఇదేమయినా కొంపలు మునిగే మేటరా? థూ- నీయవ్వ- నా ఇజ్జత్ దీస్తున్ను! మీ కేపాసిటీ ఏంది? నా లెవలేంది? ఇగో- ఒక్కమాట చెప్తున్న. ఇప్పటికైనా గాని పోయిందేమీ లేదు. ఆ అపార్ట్‌మెంట్‌కి మీరు గట్టిన పైసలన్నీ మిత్తితోని వాపస్ జేస్తా! ఈ కిరికిరిలు లేని లాండ్ ఏడున్నదో జూస్కోని ఆడే అపార్ట్ మెంట్ కొనుక్కోండ్రి! సమజైందా? "

ఆ డైలాగ్‌తో మొత్తం మావాళ్ళంతా సైలెంటయిపోయారు. ఎందుకంటే- ఒక ప్పుడు ఊరి బయట ప్రాంతమయినా,

ప్రస్తుతం సిటీ పెరిగిపోయి మంచి గిరాకీ ఉన్న సెంటరయిపోయింది.

అది అమ్ముకుపోతే మాకే లాస్! రామేశ్వర్ యాదవ్ మళ్ళీ లక్షలు ప్రాఫిట్ కొడతాడు.

అతనికి తెలీకుండా మేమూ అపార్ట్‌మెంట్స్ అమ్ముకోడానికి కూడా వీల్లేదు. ఎందుకంటే మా బ్లాక్స్ మెయింటెనెన్స్ అతనిదే కాబట్టి అతని శిష్యులు మా అపార్ట్‌మెంట్స్ ఆఫీస్‌లోనే ఉండి- మా వ్యవహారాలన్నీ అబ్జర్వ్ చేస్తుంటారు.

"ఇగో- మీకేం ప్రాబ్లెమొచ్చినా నాకు ఫోన్ కొట్టండి- నేను జూస్కుంటానని భరోసా ఇచ్చినాక ఇంక బుగులు పడతా

**ఏంటి? ఇంకా తెల్వదా! రాత్రి మన ఆపోజిట్ స్ట్రీట్‌లో ఉన్న సినిమా హాల్లో బాంబ్ బ్లాస్టయింది! పధ్నాలుగురు పోయారు- నూటడెబ్బయ్ మంది పోడానికి సిద్ధంగా ఉన్నారు.**

రేందిరా భాయ్- ఫోంద్రి ఇంక"

ఆ విధంగా అతను భరోసా ఇచ్చాడు. కాబట్టి ఆ రోజునుంచి మా అపార్ట్‌మెంట్స్‌కి 'రామ్ భరోసా' అపార్ట్‌మెంట్స్ అన్న పేరొచ్చింది.

**మా అపార్ట్‌మెంట్స్‌కి మెంటల్ అపార్ట్‌మెంట్స్ అని మరో పేరు కూడా ఉంది. అదెలా వచ్చిందంటే-** మా అపార్ట్‌మెంట్స్‌లోని ఆరో బ్లాక్‌లో ఒక మెంటల్ డాక్టరున్నాడు. (డాక్టర్ మెంటల్ కాదు! మెంటల్ కేసుల్ని చూసే డాక్టర్)

ఆయన వ్యాపారం ఈ రెండు మూడేళ్ళల్లోనే మూడు ఫ్లాట్లు, ఆరు ఫ్లాట్లుగా పెరిగిపోయింది.

ఎందుకంటే మన దేశాన్ని ఎలాంటి బఫూన్లు పరిపాలిస్తున్నారో మనందరికీ తెలుసు. అసలే మనదేశంలో ఉన్నది ప్రపంచంలో ఎక్కడా కనిపించని నికృష్టమయిన డెమోక్రసీ- దానికితోడు బఫూన్ల రాజ్యం-

ప్రజలకు మెంటల్ రాకేమవుతుంది?

అలాగే మెంటల్ డాక్టర్ పేషెంట్లు వేల కొద్దీ పెరిగిపోతున్నారు. అందుకని వాళ్ళంతా మా అపార్ట్‌మెంట్‌ని మెంటల్ అపార్ట్‌మెంట్స్ అని పిలుస్తుంటారు.

సిటిలో మా ఏరియా అడ్రస్ చెప్పాల్సివచ్చినప్పుడు ఎవరయినా సరే ఫలానా ఏరియాకెళ్ళి మెంటల్ అపార్ట్‌మెంట్స్ అని అడగండి! చూపిస్తారు. వాటికెదురుగ్గా సందులోనే మా ఇల్లు అని చెప్తూండటం మేము చాలాసార్లు విని కోపంతో, పౌరుషంతో ఉడికిపోయాంగానీ చేసేదేమీ లేక ఊరుకున్నాం. ఇదీ టూకీగా మా రామ్ భరోసా అపార్ట్‌మెంట్స్ మేటర్.

★ ★ ★

ఆ రోజు మేము పొద్దున్న నిద్రలేవకముందునుంచే మా అపార్ట్‌మెంట్స్‌లో హడావుడిగా అందరూ పరుగులు, అరుపులతో గొడవ గొడవగా ఉంటే నేనూ, రెడ్డీ, హమీద్‌మియా కిందకు దిగాం.

గేటు దగ్గర మా వాళ్ళంతా లేడీస్‌తో సహా గుమికూడి ఉన్నారు. 'ఏంటి సంగతీ' అంటూ అడిగాం అవధానిని.

'ఏంటి? ఇంకా తెల్వదా! రాత్రి మన ఆపోజిట్ స్ట్రీట్‌లో ఉన్న సినిమా హాల్లో బాంబ్ బ్లాస్టయింది! పధ్నాలుగురు పోయారు- నూటడెబ్బయ్ మంది పోడానికి సిద్ధంగా ఉన్నారు. వందమంది ఫస్ట్‌ఎయిడ్ కేసులు' అంటూ టీవీ జర్నలిస్ట్ ఫోజులో గడగడ చదివేశాడు.

అన్నట్లు మీకు తెలీదనుకుంటా అవధాని ఒక న్యూస్ ఛానెల్‌కి టీవీ జర్నలిస్ట్. అందుకని ఎప్పుడూ ఓ చిన్న కెమేరా మైకు మెడలో వేసుకుని తిరుగుతుంటాడు.

అందరం స్టన్నయ్యాం.

ఎప్పుడూ సిటీలో బాంబ్ బ్లాస్ట్స్ జరిగినట్లు టీవీలో చూడటమేగానీ మరి మాకింత దగ్గారగా జరిగిందనేసరికి కొంచెం భయం వేసింది. కాసేపు పెరిగిపోతున్న టెర్రరిజం గురించి మాట్లాడుకున్నాక ఎవరి దారిన వాళ్ళు ఇళ్ళల్లో కొచ్చేశాం.

లేడీస్ మాత్రం ఇంకా సెంటిమెంట్ కి సంబంధించిన బాంబ్ బ్లాస్ట్ వార్తలు విశ్లేషించుకుంటున్నారు.

"పాపం! బ్లాస్ట్ లో తల్లి పోయిందంట! పిల్లకు మూడేళ్ళు- అమ్మా, అమ్మా అంటూ ఒకటే ఏడుపు" అంటూ ఒకావిడ వర్ణిస్తోంటే అంతా కన్నీళ్ళు తుడుచుకున్నారు.

"పాపం ఆ పిల్లకు తండ్రి ఇదివరకే చనిపోయాడంట- ఇప్పుడు ఆ పిల్ల అనాథ అయిపోయిందని పోలీసులు చెప్తున్నారు"

ఆ మాట వినేసరికి ఒకరిద్దరు లేడీస్ కన్నీళ్ళ స్టేజ్ దాటేసి భోరున ఏడ్చేశారు. వాళ్ళను చూస్తున్న మా అసోసియేషన్ ప్రెసిడెంట్ నెమ్మదిగా వాళ్ళ దగ్గరకొచ్చి ఓ సలహా ఇచ్చాడు.

"ఆ పాపను మీలో ఎవరయినా జాలి పడి పెంచుకోడానికి ఒప్పుకుంటే ఎంతో సాయం చేసిన వారవుతారు"

ఆ మాట ఇంక పూర్తయినా కాలేదు. లేడీస్ అంతా క్షణాల్లో మాయమయిపోయారు.

ఆ రోజంతా ప్రధానమంత్రి, లోకల్ మంత్రులూ టీవీలో కనబడుతూనే ఉన్నారు.

"ఇది పిరికిపందల చర్య" అంటూ గల్లీ లీడర్ నుంచి ఢిల్లీ లీడర్ వరకూ బ్లాస్ట్ లు జరిగినప్పుడల్లా ఇచ్చే చౌకబారు స్టేట్ మెంట్ ని వాళ్ళు కూడా రొటీన్ గా ఇచ్చేశారు.

మా రెడ్డికి కోపం వచ్చింది.

"ఈళ్ళకేమయినా దమాకుందా? టెర్రరిస్టులు ధైర్యంగా పోలీస్ స్టేషన్లు, ఆర్మీ పోస్ట్ లమీదే ఎటాక్ చేసి ధైర్యంగా బాంబ్ బ్లాస్ట్ లు చేస్తూంటే పిరికిపందలంటాడేంది? "

అది ఎప్పటి నుంచో అందరం ఫీలవు




తుందే కాబట్టి ఎవ్వరం రియాక్టవలేదు. ఆ విషయమే డిస్కస్ చేసుకుంటూ అందరం మా సొసైటీ సెంటర్లో కూర్చుని టీవీ చూస్తున్నాం!

మరి కాసేపట్లో పోలీస్ కమీషనర్ ఫోన్- ఇన్ ప్రోగ్రామ్ స్టార్టయింది టీవీలో "నగర ప్రజలందరూ ఈ విషమ పరిస్థితుల్లో భయంలేకుండా ధైర్యంగా ఉండాలని కోరుతున్నాను. ఉగ్రవాదులు, ఇతర బాంబ్ వాదులు- వారెంత ప్రమాదకరమయిన వారయినా, ప్రపంచంలో ఏ మూల ఉన్నా పట్టుకుని శిక్షించటం జరుగుతుంది"

ఆ స్టేట్ మెంట్ వినగానే మా సొసైటీ ప్రెసిడెంట్ ఫోన్ డయల్ చేశాడు.

"సార్- నేను మెంటల్ అపార్ట్ మెంట్స్ ప్రెసిడెంట్ ని మాట్లాడుతున్నాను"

"మీ పేరేంటి మెంటల్ గారూ? "

"హమీద్ మియా"

"చెప్పండి హమీద్ గారూ? ఏమిటి మీరు చెప్పదల్చుకుంది? "

"సార్ ఎప్పుడు ఏ బాంబ్ బ్లాస్ట్ జరిగినా మీరిలాగే నేరస్తులను ఒదిలి పెట్టే

ప్రసక్తేలేదంటూంటారు"

"అవును హమీద్‌గారూ! వాళ్ళని జీవితాంతం జైల్లోనే మగ్గేలా చర్యలు తీసుకుంటాం! వాళ్ళని వదిలే ప్రసక్తే లేదు"

"అసలు ముందు వాళ్ళను పట్టుకుంటే కద్సార్- వదిలిపెట్టే విషయం గురించి మాట్లాడాలి!"

కమిషనర్ కొంచెం గాభరాపడ్డాడు.

వెంటనే అతని పక్కనే కూర్చున్న హోమ్ మినిస్టర్ కలుగజేసుకున్నాడు.

"నేరస్తులెవరయినా - ఎక్కడున్నా వాళ్ళని మన పోలీసులు పట్టుకుని శిక్షిస్తూనే ఉన్నారు హమీద్‌గారూ! అలా పట్టుకున్న వాళ్ళ లిస్ట్ చాలాపెద్దది ఉంది మా దగ్గర!" అంటూ కమిషనర్‌ని సపోర్ట్ చేశాడు.

**"సరే సార్ అది కూడా వదిలేద్దాం! మన రాష్ట్రంలో ఒక ఎస్.పి.ని కాల్చి చంపిన టెర్రరిస్ట్‌ని ఇప్పుడున్న మీ ప్రభుత్వం వదిలేసింది కదా- దాని సంగతేంటి?"**

"కానీ మీరు ఇంతవరకూ పట్టుకోలేకపోయిన క్రిమినల్స్ లిస్ట్- మీ లిస్ట్ కంటే ఇంకా చాలా పెద్దది మాదగ్గరుంది సార్" అన్నాడు మొహిందర్‌సింగ్ కలుగజేసుకుంటూ.

ఇప్పుడు హోమ్‌మినిష్టర్ కంగారుపడ్డాడు.

అందుకని కమిషనర్ కలుగజేసుకున్నాడు.

"మీ అభిప్రాయం కరెక్ట్ కాదండీ హమీద్‌గారూ - మీ లిస్ట్‌లో ఒక్క పేరు చెప్పండి చూద్దాం!"

"దావూద్ ఇబ్రహీమ్"

మినిష్టర్ ఇంకా డౌనయిపోయాడు.

"అదీ... అది కాదండీ హమీద్‌గారూ- అది ఇంటర్నేషనల్ హెడేక్ - అదొదిలేసెయండి"

"సరేసార్ అది వదిలేద్దాం- వాజ్‌పేయ్ టైమ్‌లో మన విమానాన్ని ఆఫ్ఘనిస్తాన్‌లో హైజాక్ చేసిన వాళ్ళను మనం పట్టుకోలేదు సరికదా వాళ్ళు వదిలేయమని అడిగిన మిగతా టెర్రరిస్ట్‌లను కూడా జైలు నుంచి విడిపించి, తీసుకెళ్ళి వాళ్ళకు అప్పజెప్పారు-"

"అలాంటివి కొన్ని సందర్భాల్లో తప్పదు" ముఖానికి పట్టిన చెమటని కర్చీఫ్‌తో తుడుచుకుంటూ అన్నాడు.

"సరే సార్ అది కూడా వదిలేద్దాం! మన రాష్ట్రంలో ఒక ఎస్.పి.ని కాల్చి చంపిన టెర్రరిస్ట్‌ని ఇప్పుడున్న మీ ప్రభుత్వం వదిలేసింది కదా- దాని సంగతేంటి? "

హోమ్‌మినిష్టర్ లేచి నిలబడ్డాడు.

"నాకు అర్జంటు మీటింగుంది - అందుకని వెళ్ళిపోతున్నాను. మీ కమిషనర్‌గారు సందేహాలు తీరుస్తారు-"

"చూడండి, హమీద్‌గారూ! కేవలం మీ ఒక్కరితోనే మాట్లాడుతూంటే ఇంకెంతో మంది ఫోన్స్‌లో వెయిట్ చేస్తుంటారు-" అంటూ డిస్కనెక్ట్ చేశాడు కమిషనర్.

"కనుక ప్రజలందరినీ నేను కోరేదేంటంటే- మాకు ఢిల్లీనుంచి ఖచ్చితమయిన ఇన్‌ఫర్మేషన్ వచ్చింది... అదేంటంటే - టెర్రరిస్ట్‌లు హైదరాబాద్ నగరంలో కొత్త పంథాల్లో బాంబ్ బ్లాస్ట్‌లు చేయడానికి నిర్ణయించుకున్నారు. ముఖ్యంగా ఎక్కువ మంది జనం ఉంటున్న అపార్ట్‌మెంట్స్‌నే టార్గెట్ చేయాలని వాళ్ళు ప్లాన్ చేశారు- ఆ విధంగా ఎక్కువ జననష్టం కలిగించవచ్చని వాళ్ళ ప్లాన్! కనుక అపార్ట్‌మెంట్స్‌లో ఉంటున్న వాళ్ళు- ముఖ్యంగా ఎక్కువ ఫ్యామిలీస్ ఉండే మెగా అపార్ట్‌మెంట్స్‌కి ప్రమాదం పొంచి ఉంది. మీరు ప్రతి వస్తువునీ అనుమానించండి- ప్రతి వ్యక్తినీ అనుమానించండి! టెర్రరిస్ట్‌ల తాలూకు స్లీపర్

సెల్స్ ఎక్కడో లేవు! మన అపార్ట్‌మెంట్స్‌లో మన మధ్యే ఉన్నాయ్" ప్రకటించాడు కమిషనర్.

ఆ మాటతో మా అందరి గుండెలు ఝల్లుమన్నయ్. ఒకరి మొఖాలొకరం చూసుకున్నాం.

ఎందుకంటే మా అపార్ట్‌మెంట్స్‌లో ఆరు బ్లాకులున్నయ్. ఒక్కొక్క బ్లాకులో సుమారు వంద ఫ్యామిలీస్-

కనుక ఆ టెర్రరిస్ట్‌ల దృష్టిలో ఎక్స్‌పెరిమెంట్ చేయడానికి మాదే నెంబర్‌వన్ అపార్ట్‌మెంట్స్ అయితీర్తుంది.

"ఈ లెక్కలో మనమంతా చాలా కేర్‌ఫుల్‌గా ఉండాలి!" అన్నాడు హమీద్ భయంగా.

"అవును! కమిషనర్ చెప్పినట్లు మనలో ఎవరయినా ఆ స్లీపింగ్ సెల్స్ ఉన్నారేమో అబ్జర్వ్ చేయాలి-" అన్నాడు మొహిందర్ సింగ్.

"అంతేకాదు. ఎవడయినా అనుమానాస్పదంగా బాగ్స్‌తో తిరుగుతూ ఉంటే కనిపెట్టి ఉండాలి!" అన్నాడు క్రిస్టోఫర్.

వెంటనే ఆ విషయాలన్నీ ఓ పేపర్‌మీద రాసి, జిరాక్స్ తీసి అపార్ట్‌మెంట్స్‌లో వాళ్ళందరికీ పంచిపెట్టాం-

ఎవరికీ అనుమానం కలిగినా వెంటనే సొసైటీ కమిటీకి గానీ లేదా పోలీస్‌కి గానీ తెలియజేయాలని అందులో రాశాడు రెడ్డి.

★ ★ ★

ఆ రోజు సాయంత్రం నేను ఆఫీస్ నుంచి ఇంటికొచ్చేసరికి కొంచెం లేటయింది.

మామూలుగానే మా అపార్ట్‌మెంట్స్ తాలూకూ లోపలి రోడ్స్‌మీద స్ట్రీట్‌లైట్స్ సగమే వెలుగుతున్నాయ్.

నేను లిఫ్ట్ దగ్గరకెళ్తుంటే చేతిలో ఒక పెద్ద ప్లాస్టిక్ బ్యాగ్‌తో అవధాని మెట్లెక్కుతూ కనిపించాడు.

అతనుండేది నాలుగో ఫ్లోర్‌లో అని నాకు తెలుసు. అలాంటప్పుడు లిఫ్ట్‌లో




కాకుండా స్టెప్స్ ఎక్కుతూ వెళ్ళటం కొంచెం అనుమానం కలిగించింది. దానికితోడు అతని చేతిలో చాలా పెద్ద ప్లాస్టిక్‌బ్యాగ్.

వెంటనే మొహిందర్‌కి సెల్ కొట్టి విషయమంతా చెప్పాను- మొహిందర్ మరో నలుగుర్ని వేసుకుని వచ్చాడు హడావుడిగా. అందరం కలసి మరోసారి డిస్కస్ చేసుకున్నాక అవధానిని క్రాస్ ఎగ్జామిన్ చేయాలని డిసైడ్ చేశాం.

ఇంటికి వెళ్ళి డోర్ బెల్ మోగించేసరికి- ఒక్కసారిగా ఇంట్లో హడావుడిగా అటూ, ఇటూ పరుగెడుతున్న శబ్దాలూ, ఏవో వస్తువులు కిందపడిన శబ్దాలూ వినిపించేసరికి మా అనుమానం పెరిగిపోయింది.

మళ్ళీ డోర్‌బెల్ మోగిస్తూ బిగ్గరగా "అవధానీ! అర్జంటుగా తలుపు తియ్" అంటూ అరిచాడు మొహిందర్ సింగ్.

మరో నిముషం తర్వాత డోర్ తెరిచాడు అవధాని.

అతని భార్య, ఇద్దరు పిల్లలూ భయంగా డోర్‌కి అడ్డంగా నిలబడి మా వంక చూస్తున్నారు. అందర్నీ తోసుకుంటూ లోపలి



కెళ్ళాం-

"ఏంటి? తలుపు తీయడానికింతసేపు పట్టింది? " అడిగాడు రెడ్డి.

"భోజనం చేయబోతున్నాం- ఇంతలో మీరొచ్చారు. సంగతేమిటి? ఎక్కడికయినా ధర్నాకెళ్లాలా? " అడిగాడు కుతూహలంగా.

అతనికి ధర్నాల్లో పార్టిసిపేట్ చేయట మంటే చాలా ఇష్టం! ధర్నాలు జరిపేట ప్పుడు అవసరమయిన నినాదాలు తయా రుచేయటంలో అతను ఎక్స్‌పర్ట్.

"ధర్నా లేదు, ఏమీలేదు గానీ- నువ్ ఇందాక సీక్రెట్‌గా ఒక ప్లాస్టిక్ బ్యాగ్ మోసుకుంటూ లిఫ్ట్ ఎక్కకుండా, మెట్లెక్కి మీ ఇంటి కెళ్లావేంటి కథ? ఆ బ్యాగ్‌లో ఏముంది? " అడిగాడు హమీద్‌మియా.

ఆ కొశ్చెన్‌తో అవధాని షాకయ్యాడు-

**"అందర్నీ అనుమానించాలి. నిన్నొక్క డినే కాదు, ఇంతకీ ఆ ప్లాస్టిక్ బ్యాగ్ ఏంటో ఒకసారి చూపిస్తే నీ సొమ్మేం పోదుకదా?"**

"అహహ అది... అది... ఆc డాక్టర్ నా హెల్త్ బాగుండాలంటే రోజుకి నాలుగు సార్లు మన అపార్ట్‌మెంట్ మెట్లెక్కి దిగ మని చెప్పాడు.

"ప్లాస్టిక్‌బ్యాగ్‌తో ఎక్కమన్నాడా? "

"అహహ... అది నా చేతిలో ఉన్నప్పుడు తప్పదుగదా! ఇంతకూ ఎందుకిదంతా అడు గుతున్నారు? "

"ఎందుకేంటి? మన అపార్ట్‌మెంట్స్‌ని ఏ క్షణాన్నయినా కూల్చెయ్యడానికి బిన్‌లా డెన్ ఆర్డర్స్ ఇచ్చాడంట. అందుకని మన అపార్టుమెంట్స్‌లో ఉన్నవాళ్లందరినీ మనమే అబ్జర్వ్ చేయాలి. ఎందుకంటే మనలోనే బిన్‌లాడెన్ మనుషులున్నారని హోమ్ మినిష్టర్, పోలీస్ కమిషనర్ అందరూ చెప్తున్నారు"

అవధానికి కోపం ముంచుకొచ్చింది.

"అంటే నేను టెర్రరిస్ట్ అని మీరను మానిస్తున్నారా? "

"అందర్నీ అనుమానించాలి. నిన్నొక్క డినే కాదు, ఇంతకీ ఆ ప్లాస్టిక్ బ్యాగ్ ఏంటో ఒకసారి చూపిస్తే నీ సొమ్మేం పోదుకదా? "

"అవధాని భార్యాపిల్లల వేపు చూశాడు. వాళ్లు వద్దన్నట్లు తలూపారు."

"నేను చూపించకపోతే ఏం చేస్తారు? "

"బలవంతంగా చెక్ చేసేందుకు మాకు అధికారం ఉంది!" అన్నాడు మొహిందర్ అనుమానంగా.

"ఏదీ ఆ అధికారం మీకున్నట్లు గవర్న మెంట్ లెటరేమయినా ఇచ్చిందా? "

మాకేం చెప్పాలో తెలీలేదు.

"లెటరేం లేదు" అన్నాడు రెడ్డి. "ఫోన్‌లో ఓరల్‌గా అధికారం ఇచ్చారు"

"నువ్ కోపరేట్ చేయలేదనుకో పోలీస్‌ని పిలవాల్సివస్తుంది." అన్నాడు హమీద్ సెల్‌ఫోన్ తీస్తూ.

అవధాని 'పోలీస్' అన్నమాట వింటూనే కొంచెం తగ్గాడు. పోలీసులతో వ్యవహారం ఎలాఉంటుందో అతనికి బాగా తెలుసు.

ఒకసారి మా అపార్టుమెంట్స్ లోపల రోడ్‌మీద చైన్ స్నాచింగ్స్ విషయంలో మా ఏరియా పోలీస్‌స్టేషన్ ముందు ధర్నా చేసినప్పుడు అవధానిని ప్రత్యేకంగా లోప లికి తీసుకెళ్లి నాలుగు ఉతికి బయటకు పంపించారు.

అదేఛాన్సుని మేము ఇల్లంతా ఆ ప్లాస్టిక్ బ్యాగ్‌కోసం వెతుకుతుంటే చివరికది డైనింగ్‌టేబుల్ మీద కనిపించింది.

ఓపెన్ చేసేసరికి-

అందరూ ఒక్కసారిగా షాకయ్యారు.

*(బ్యాగ్‌మిస్టరీ తెలుసుకోవాలంటే వచ్చేనెల దాకా ఆగక తప్పదు)*

# శీలపరీక్ష

-కాకాని చక్రపాణి



ఆమె అనసూయ. పేరుకే కాదు.. వ్యక్తిత్వంలోనూ సార్థక నామధేయురాలే. పెళ్లయింది.. కానీ పెనిమిటి జీవితంలోకి ప్రవేశించలేదు. జీవితాంతం కన్యగానే మిగిలిపోయిన ఆమె.. కుటుంబసభ్యులు కాదంటున్నా, పరిస్థితులు అనుకూలించకున్నా సమాజ సేవకు తీర్మానించుకుంది. వ్యక్తిగత కష్టాలు, కడగండ్లను పక్కనపెట్టి సామాజిక సేవాకార్యక్రమాలకు శ్రీకారం చుట్టింది. ఈ క్రమంలో ఆమెకు ఎలాంటి ఆటంకాలు ఎదురయ్యాయి? ఎలాంటి ధర్మసంకటాలు కలవరపెట్టాయి? వాటిని ఆమె ఏ విధంగా అధిగమించింది? నవలల పోటీలో ప్రోత్సాహక బహుమతి పొందిన కాకాని చక్రపాణి రచన శీలపరీక్ష ఈ నెల చతుర కానుక!

"సుభద్ర రాత్రి సుఖనిద్ర పోయీ-
వో వదినె ఈ రాత్రి కలగంటి
నేను।

ఏమి కలగంటివే యిందీవరాక్షి।
నాతోనూ చెప్పవే నాతీ యీవేళ..."
పాట ఆపింది రేణుక.

"ఏమే ఆపావు! పూర్తిగా పాట రాదా?" అడిగింది అనసూయమ్మ.

"వచ్చు, సుభద్ర అంటే కిష్టయ్య చెల్లెలు గందా! ఆమె కలగన్నది, వదిన ఎవరు?"

"ఇంకెవరు? రుక్మిణి! ఆమె సుభద్ర కన్న కలకు అర్థం వివరిస్తుంది, పాడు"

ఆమె పాడింది కానీ, ఆమె ధ్యాస అక్కడ లేదని గమనించింది అనసూయమ్మ.

"వాడు కన్పించాడా మళ్ళా?"

రేణుక తల ఊపింది, సిగ్గుతో.

"ఇలా ఎక్కువకాలం సాగటానికి వీలు లేదు. నేను మీ నాయనతో మాట్లాడతానులే, పాడు"

అనసూయమ్మది ఖమ్మం జిల్లాలోని గంధసిరి గ్రామం. ఆ ఊరి దేశ్‌ముఖ్ ఆమె తండ్రి విజయరామారావు. అనసూయమ్మను కనగానే ఆయన భార్య చనిపోయింది. ఆ తరువాత ఆయన మళ్ళా పెళ్లి చేసుకున్నాడు. రెండో భార్య సంతానం ఆమె తమ్ముడు హరినారాయణరావు. ఇద్దరికీ సుమారు ఐదారేళ్ళు తేడా ఉంది. పుట్టి బుద్ధి ఎరిగాక ఆమె గ్రామం విడిచివెళ్లిన సందర్భాలు బహుకొద్ది. ఆ కాలంలో వెలమదొరల కుటుంబాల్లో ఘోషా పద్ధతి ఉండేది. స్త్రీలు దేవిడీ విడిచి బయటకు రావటం విజయరామారావుకు ఇష్టముండేది కాదు.

విజయరామారావు వందల ఎకరాల ఆసామి. ఈ ఊళ్ళోనే కాదు. చుట్టుపక్కల గ్రామాల్లోనూ ఆయనకు పొలాలున్నాయి. సర్కారు వారి నుండి ఆయనకు లభించిన జమీ కొద్దిదే. కండబలంతో, బుద్ధిబలంతో చాలా ఎకరాలు సంపాదించాడు. ఆనాటి ఫ్యూడల్ సమాజంలో దొరల భూమిదాహాన్ని ఎదిరించిన జనంపై అత్యాచారాలకు అంతు ఉండేది కాదు. ఆయనకున్న భూమిలో ఎక్కువ భాగం సేద్యానికి పనికి వచ్చే భూమి కాదు. అయినా భూమి భూమే. ఆ చిన్న రాజ్యంలో ఆయన సామంతరాజు. ప్రజల చావు బతుకులపై ఆయనకు సర్వాధికారాలూ ఉండేవి. ఎక్కడో సుదూరంగా హైదరాబాద్ ఉంది. 'ఆలా హజరత్' నవాబ్ మీర్ అలీఖాన్ రాజ్యం చేస్తున్నాడు. ఆ సర్కారువారి చిహ్నాలు ఇక్కడ అల్పంగా ద్యోతకమయ్యేవి. ఎప్పుడో గిర్దావర్, నాయసాబ్ వచ్చేవారు. అరుదుగా తప్ప తాసీల్దారూ వచ్చేవాడు కాదు.

ఫ్యూడల్ సమాజపు పాలక వర్గంలో మధ్యస్థాయికి చెందినవాడు విజయరామారావు. పైస్థాయిలో జాగీరుదార్లు ఉండేవారు. లక్షల ఎకరాలు వాళ్ళ అధీనంలో ఉండేవి. కొద్ది ఎకరాల భూములున్న ఈనాందార్లు లెక్కకు మించిన వాళ్ళెందరో ఉన్నారు. ఎవరి భూముల్లో వాళ్ళు రాజులే. ఎప్పుడో తప్ప ప్రభుత్వం కల్పించుకునేది కాదు. కనుక వారిదే ఇష్టారాజ్యం.

ఇలాంటి చిల్లరదేవుళ్ళకూ భయాలున్నాయి. గర్వంతో చెప్పుకునే విషయాలున్నాయి. విజయరామారావు కూడా అందుకు మినహాయింపు కాదు. ఇత్తెహాద్ కార్యదర్శికి ఏడాదికోసారి చందా పంపాలి. పంపకపోతే అతనితో తంటా. ఏమో ఎటు వచ్చి ఎటు పోతుందో! అధికారగణంలోని మనిషి, ఖమ్మంలో గాంధీ ఆశ్రమం నడిపే వెంకట్రావుకు తృణమో పణమో ముట్టచెప్పుంటాడు. గాంధీజీ అంగ్రేజీ వాళ్ళతో స్వాతంత్ర సమరం సాగిస్తున్నాడు. స్వాతంత్ర్యం సిద్ధించటం కలలోని మాటే!

# భలే ఉపాధి




మేరీలాండ్‌లోని రాబర్ట్‌వైట్ అనే అతను దివంగత అమెరికన్ ప్రెసిడెంట్ జాన్ ఎఫ్. కెన్నడీకి బాగా అభిమాని. కెన్నడీకి సంబంధించిన అనేక వస్తువులని ఇతను సేకరించాడు. వాటిలో 1960లలో క్యూబా క్రైసిస్‌కి చెందిన 'బ్లాక్‌డే' అని కెన్నడీ గీసిన స్కెచ్ ఒకటి. లక్షన్నర ఇతర ఐటమ్స్‌లో మరొకటి లీహార్వే ఆస్వాల్డ్‌ని చంపిన జాక్‌రూబ్ జైలుగదినించి రాసిన రహస్య ఉత్తరం. చెత్తవేసే సంచీలని కొని, అందులోని విలువైన వస్తువులని విడదీసి వ్యాపారం చేస్తుండగా, వైట్‌హౌస్‌నించి కొన్న చెత్త సంచీలనించి రాబర్ట్ ఈ వస్తువులని సేకరించాడు. కోట్ల డాలర్ల ఖరీదు చేసే ఈ వస్తువులని చికాగో నగరంలో ఓ పెద్ద ప్రదర్శనశాలలో చూడచ్చు. దాని ప్రవేశ రుసుము ద్వారా వచ్చే ఆదాయంతోనే ఇతనిప్పుడు జీవిస్తున్నాడు.




# డబ్బుని పసికట్టే కుక్క

డ్రగ్స్‌ని వాసన చూసి కనుక్కునే విధంగా కుక్కలకి శిక్షణ ఇవ్వడం మనకి తెలిసిందే. కాని అమెరికాలోని చికాగోకి 28 మైళ్ల దూరంలో ఉన్న లేన్సింగ్ అనే ఊళ్లోని డన్‌స్టాన్లీ అనే పోలీస్ ఆఫీసర్ తన పోలీస్‌డాగ్‌కి డబ్బుని వాసన చూసే శిక్షణనిచ్చాడు. కనీసం లక్ష డాలర్ల డబ్బు ఓచోట ఉంటేనే అది మొరిగేలా కూడా శిక్షణ ఇచ్చాడు. అమెరికాలో ఎవరూ అంత డబ్బుని దగ్గర ఉంచుకోరు. కేవలం డ్రగ్స్‌ని అమ్మే లావాదేవీల్లోనే డబ్బు నగదు రూపంలో అధిక మొత్తంలో చేతులు మారుతుంటుంది. సాధారణంగా అలాంటి పరిస్థితుల్లోనే అంతడబ్బు ఓ చోట ఉంటుంది.



డ్రగ్స్ చికాగో మీదుగానే వెళ్తుంటాయి. చికాగోనించి తిరిగి వచ్చే అనుమానాస్పద కార్లని ఆపి డబ్బు కోసం ఈ కుక్కని ప్రయోగించడం ద్వారా అనేకమంది డ్రగ్ డీలర్స్ పట్టుబడ్డారు.

## కొత్తగాలి...

**చంటాడు ఆనందంతో**
**కేరింతలు కొడ్తున్నాడు**
**తాతమీసాలు**
**ఆటవస్తువు మరి**

–'సుందరి', పోలాకి, శ్రీకాకుళం

కానీ కాంగ్రెసు వాళ్ళకు పదవులు రావచ్చు. నిజాం రాష్ట్రంలోనూ ప్రాబల్యం సంపాదించవచ్చు. పైకి ఎదిగే రాజకీయ శక్తులతో స్నేహం పాటించడం బుద్ధి ఉన్న వాడు చేసే పని.

తన వంశం, కులాల ప్రాగల్భ్యాన్ని తల్చుకుని మురిసిపోయేవాడు విజయరామారావు.

తండ్రి చెప్పే మాటలు అనసూయమ్మకు గుర్తుకు వచ్చాయి. "మనం పద్మనాయ కులం. మన మూల పురుషుడు రేచెర్ల ప్రసాదిత్యనాయకుడు. కాకతీయ గణపతి దేవ చక్రవర్తి కాలంనుండి ప్రసాదిత్య నాయకుడి పూర్వీకులు సేనానులుగా ఉండేవారు. తరువాత రుద్రమదేవి రాజ్యానికి వచ్చినప్పుడు ఆడది గద్దె నెక్కటం సహించలేని సామంతులూ, సేనానులూ తిరగబడినప్పుడు ప్రసాదిత్యనాయకుడు ఆమె పక్షం వహించి పోరాడాడు. అందుకే ఆయనకు 'కాకతీయ రాజ్య స్థాపనాచార్య' అన్న బిరుదు లభించింది. ఆయన మనమడు దాచానేడు ప్రతాపరుద్రుని వద్ద సేనానిగా ఉండేవాడు. ఆయన కొడుకు సింగనాయకుడు కూడా ఆ కొలువులోనే ఉండేవాడు. తన అమ్మమ్మను గద్దె నిలిపిన వెలమవీరులంటే ప్రతాపరుద్రుడికి ఎంతో ఇష్టం. అందుకే ఆయన వాళ్లకు ఉన్నత పదవులు కట్టబెట్టాడు"

రేచెర్ల ఇంటి పేరు అయిన విజయరామారావుకు ఇంత ఊహనిచ్చిందని అనసూయమ్మ భావించేది. మరి ఇంత ప్రతాపవంతులయిన వెలమనాయకుల అండదండలు ఉండీ మహ్మదీయుల చేతిలో ప్రతారుద్రుడు ఓడిపోక తప్పలేదు. తండ్రి మాటల్లోని డొల్లతనం వయసు పెరుగుతున్నకొద్దీ ఆమెకు అవగాహనకొచ్చింది. ఆడపిల్లను స్కూళ్ళకు పంపి చదివించే ఆచారం ఆనాడు లేదు. అయితే ఆమె చదువు విషయంలో విజయరామారావు అశ్రద్ధ వహించలేదు. పండితులను నియమించి రామాయణ, భారత, భాగవతాలు, సంస్కృత పంచకావ్యాలు మొదలయినవన్నీ చెప్పించాడు. ఆమె పెళ్లి అయ్యాక కూడా ఆయన కూతురి చదువు ఆపలేదు. కుమార్తె అంటే ఆయనకు ఎంతో వాత్సల్యం, ప్రేమ. సవతి తల్లి తన సరదాలు చూసుకోవటం తప్ప ఏం పట్టించుకునేది కాదు. దేవిడీలో ఆధిపత్యమంతా అనసూయమ్మదే. ఆశ్రితులు ఆమె దయాదాక్షిణ్యాలకు, వదాన్యానికీ వెంపర్లాడేవారు. తండ్రి బతికున్నంత కాలం ఆమె మాటకు తిరుగుండేది కాదు.

ఆమెపట్ల అంత ప్రేమ, వాత్సల్యం ఉన్న తండ్రీ ఆమెకు అసంకల్పితంగానే తీరని ద్రోహం చేశాడు. ఆమె పదేళ్ళ పిల్లగా ఉండగా, 1930లో ఆమె వివాహం ఎర్రమనాయుడితో జరిగింది. ఎర్రమనాయుడు తెలంగాణాకు చెందినవాడు కాదు. అంతకు రెండు మూడేళ్ళ క్రితం గోదావరి పుష్కరాలకు రాజమండ్రి కుటుంబ సమేతంగా వెళ్ళినప్పుడు అక్కడ విజయరామారావుకు బంగారునాయుడుతో పరిచయమైంది. వారిది తూర్పుగోదావరి జిల్లా సర్పవరం. బీరకాయపీచు బంధుత్వాన్ని వెలికితీసి ఎన్నో తరాల క్రితం తమ కుటుంబాలకు బంధుత్వం ఉందని స్థిరపరచుకున్నారు కాబోయే వియ్యంకులిద్దరూ.

## మోడాస్తే అరుపులే అరుపులు

ఈ కప్పలు పక్షుల
మాదిరిగా చెట్లమీద
కూడా నివసిస్తాయి.
హైలా అనే ఈ చెట్టుకప్పలకు
మరో విచిత్రగుణం
కూడా ఉంది.
ఆడకప్పతో జతకట్టాలని
అనుకున్నప్పుడల్లా తమ
నోటికింది తిత్తిని బెలూన్‌లా
ఉబ్బిస్తాయి.
అంతేకాదండోయ్!
ఆ సమయంలో
మామూలు కప్ప
అరుపుకు భిన్నంగా
పదిరెట్ల దూరానికి
వినిపించేలా చేస్తాయట.








అయితే విజయరామారావు ఆ కుటుంబం పట్ల ఆకర్షితుడయింది తమ బీరకాయ పీచు బంధుత్వంవల్ల కాదు, పిల్లవాడి తెలివితేటలు, స్ఫురద్రూపం, చదువు వంటి కారణాలవల్ల కాదు; అతను 'ముసునూరి' వారి కుటుంబానికి చెందినవాడు కావటమే ముఖ్యకారణం. క్రీ.శ. 1323లో ఓరుగల్లు కోట తురుష్కులకు వశమయ్యాక, ముసునూరి ప్రోలయనాయకుడి ఆధిపత్యం కింద యుద్ధం చేసిన వెలమ వీరులు క్రీ.శ. 1336లో ఓరుగల్లుకు విముక్తి కలిగించారు. "ఆంధ్రదేశాధీశ్వర", "ఆంధ్రసురత్రాణ" బిరుదులతో ముసునూరి కాపయ నాయకుడు తెలుగుదేశానికి అధిపతి అయ్యాడు. స్వాతంత్ర్యం, విజయాలు లభించేదాకా తెలుగునాయకులలో ఉండే సంఘీభావం, ఐక్యమత్యం తరువాత లోపించాయి. దేవరకొండ, రాచకొండ ముఖ్య పట్నాలుగా రాజ్యాలేలినా, తమ ప్రాభవాన్ని ఎక్కువ కాలం నిలుపుకోలేక పోయారు పద్మనాయకులు. ముందుగా బహ్మనీలవశమైన దేశం, ఆ తర్వాత గోల్కొండ నవాబుగా నియుక్తుడయిన కులీకుతుబ్‌షా వశమైంది. తరవాతి చరిత్ర ఆమె తండ్రికి కనవసరం. ఆ ముసునూరి నాయకుల వంశానికి చెందినవాడే తన కాబోయే అల్లుడని మురిసిపోయాడు. నిజానికి తాము ముసునూరి ప్రోలయ, కాపయ నాయకుల వంశస్థులమని వాళ్ళు చెప్పుకునే వాళ్ళుకాదు. ఎన్నో తరాలు గడిచాయి. ఈ ఇరవయ్యో శతాబ్దంలో, పద్నాలుగో శతాబ్దం నుండి వంశవృక్షపు శాఖోపశాఖలను నమోదు చేసిన వాళ్ళెవరూ లేరు. వాళ్ళు ఆ వంశస్థులు అయి ఉండవచ్చు కాకపోవచ్చు కానీ విజయరామారావు గట్టి నమ్మకం మాత్రం వాళ్ళు ఆ వంశస్థులేనని.

ఆ ముసునూరి వంశస్థులకు పెద్దగా ఆస్తిపాస్తులు లేవు. అనసూయమ్మతో ఎర్రమనాయుడి వివాహమయ్యే సమయానికి అతను స్కూలు ఫైనల్ చదువుతున్నాడు. బాల్య వివాహమే. తెలంగాణలో అందుకు వ్యతిరేక చట్టాలు లేవు కనుక నిర్విఘ్నంగా వారి పెళ్లయింది. అప్పటికే ఎర్రమనాయుడు స్వాతంత్రోద్యమభావాలతో ప్రభావితుడయ్యాడు. పెళ్ళయిన రెండేళ్ళకు ఎఫ్.ఎ. చదువు పూర్తి చేశాడు. 1930 మార్చి 12న గాంధీజీ ఉప్పుపై ఉన్న ప్రభుత్వ నిబంధనలకు వ్యతిరేకంగా దండియాత్ర ప్రారంభించాడు. ఏప్రిల్ 9ని శాసనోల్లంఘన దినంగా పాటిస్తూ ఉప్పు నిబంధనలను కాదని ఉప్పు తయారు చెయ్యాలని పిలుపునిచ్చాడు. ఆ ఉద్యమంలో ఎర్రమనాయుడు కూడా పాలుపంచుకున్నాడు. ఉద్యమకారులపై ప్రభుత్వం దమననీతిని ప్రయోగించింది. ఎంతో మందిని నిర్బంధంలోకి తీసుకున్నారు. ఎర్రమనాయుడు కూడా అరెస్టయ్యాడు. కాని, కోర్టు పిల్లవాడని దయతలచి, హెచ్చరిక చేసి విడిచిపెట్టింది.

విజయరామారావుకు అల్లుడి చర్యలు నచ్చలేదు. ప్రభ్వీణిని గద్దెనిలిపిన ప్రసాదిత్యానాయకుడి రేచెర్ల వంశస్థుడాయన. తాము నిజాం సర్కారుకు ఎట్లా విధేయుడో, అలాగే తన అల్లుడూ బ్రిటీషు ప్రభుత్వానికి విధేయంగా ఉంటూ పెద్ద పెద్ద పదవులు అధిష్టించాలన్న కోరిక విజయరామారావుది. అందుకే అల్లుడి చర్యలను గర్హిస్తూ గట్టిగా ఉత్తరం రాశాడు. "పిల్లకాయ ఏదో ఉత్సాహపడుతున్నాడు. పెళ్ళాం కాపురానికి వచ్చాక వాడే బుద్ధి తెచ్చుకుంటాడు" అని వియ్యంకుడు బంగారునాయుడు జవాబిచ్చాడు. ఆ సందర్భంగా పిల్లలకు పునస్సమాగం నిర్వర్తించాలని వియ్యంకులు భావించారు. కానీ అది నెరవేరే అవకాశం లేదు. అప్పటికే ఎర్రమ

నాయుడు సామ్యవాదభావాల పట్ల ఆకర్షితుడయ్యాడు. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలో చేరాడు. ఆంధ్రదేశంలో కమ్యూనిస్టు సాహిత్యం వెల్లువలా ప్రవేశించింది. ఆ సాహిత్య ప్రభావం ఎర్రమనాయుడి లాంటి యువకులపై చెరగని ముద్రవేసింది. మార్క్స్ సిద్ధాంతాలు ప్రతిచోట చర్చనీయాంశాలయ్యాయి. ఎర్రమనాయుడు చదువు వదలిపెట్టి పూర్తిగా ఉద్యమంలో చేరిపోయాడు. ఇల్లు వదలిపెట్టి వెళ్లిన కొడుకెక్కడ ఉంటున్నాడో తెలియక బంగారునాయుడు ఆదుర్దా పడిపోయాడు. అంతలో కొడుకు ఇంటికి రావటం చూసి, ఇంక కొడుకు జీవితాన్ని స్థిరపర్చాలని నిర్ణయించుకున్న బంగారునాయుడు యువ దంపతుల పునస్సమాగమం తేదీని నిర్ణయించటానికి తమ ఊరు రావాల్సిందని విజయరామారావుకు కబురు పంపాడు.

తనలాంటి వందల ఎకరాల యజమాని అయిన దొరను రమ్మని పిలవనంపటం విని మండిపోయాడు విజయరామారావు. కానీ కూతురి కాపురం చక్కదిద్దాల్సిన బాధ్యత తనపై ఉంది కనుక, ఆయన సర్వవరం వచ్చాడు. సంభాషణలు సామరస్యంగా జరగలేదు.

"మీలాంటి కమ్యూనిస్టులతో సంబంధం పెట్టుకోవటం నాదే బుద్ధి తక్కువ! ముసునూరి వారి వంశస్థులు కదా అని మోసపోయాను. మీకు పెద్దగా ఆస్తి పాస్తులు లేకపోయినా సర్దుకుపోయినాను" అన్నాడాయన నిష్ఠూరంగా.

ఆస్తిపాస్తులనేటప్పటికి బంగారునాయుడికీ పొడుచుకువచ్చింది.

"మీ అంత ఆస్తిపాస్తులు లేకపోయినా మేమూ గౌరవంగానే బతుకుతున్నాం. తమ సంబంధం కలుపుకోవాలని మేమేం తపించలేదు. నిజాం నవాబుకు గులాంగిరి చేసే మీకు స్వాతంత్రేచ్ఛ అంటే ఏమి తెల్సు! ఆడపిల్ల తండ్రికి అంత అహంకారం పనికిరాదు" అన్నాడు బంగారునాయుడు.

"ఆడపిల్ల తండ్రినని మీకు విధేయంగా ఉండాల్సిన గతి నాకు పట్టలేదు. మీతో సంబంధం తెగతెంపులు చేసుకుంటున్నాను. మా నిజాం నవాబు ఘనకీర్తి నీకేం తెలుసు, చెప్పొచ్చావు" అంటూ ఏకవచన ప్రయోగంలోకి దిగిపోయాడు విజయరామారావు.

అంతటితో వారి సంబంధ బాంధవ్యాలు వీడిపోయేవే. కానీ, చుట్టూ ఉన్న పెద్దలు కల్పించుకుని వియ్యంకులకు సర్దిచెప్పారు. అయితే ఎర్రమనాయుడు పునస్సంధానికి ఒప్పుకోలేదు.

"ఇప్పుడు దేశం ఉన్న పరిస్థితుల్లో నా మనస్సు అందుకు ఇచ్ఛగించటం లేదు. దేశంలో విప్లవం విజయవంతమవుతుంది. అంతదాక నాకు తీరుబాటులేదు" అన్నాడు ఎర్రమనాయుడు ఆవేశంగా.

కోపం వచ్చినా తమాయించుకుని అల్లుడికి సౌమ్యంగా నచ్చచెప్పే ప్రయత్నం చేశాడు విజయరామారావు.

"మనం దొరలం. మనకెందుకయ్యా పోరాటాలు! నీకున్న ఆస్తి చాలకపోతే నేను వంద ఎకరాలు రాసిస్తాను, రా. విప్లవం, పోరాటమంటూ మాట్లాడకు" అన్నాడు.

"ఎక్కడి నుంచి వచ్చాయి మీకు ఆ వంద ఎకరాలు? ఎంతమంది కడుపు కొట్టి సంపాదించుకున్నదో అది. మీకున్న భూమంతా పేద రైతులకు పంచిపెట్టండి. నేనలాగే మీ అమ్మాయిని కాపురానికి తెచ్చుకుంటాను"

"నీ మాటకర్థముందా? కొలువులో విశ్వసనీయంగా పనిచేసినందుకే నిజాం నవాబు మెచ్చి ఇచ్చిన దొరతనమది. నీకక్కర్లేదని నేను జమీని వదులుకోలేను"





"మీరు వదులుకోనే రోజు వస్తుంది. ఎక్కువ కాలం లేదు"

అలా చెప్పి వెళ్లిపోబోతుంటే, "ఖచ్చిత మైన మాటేదో చెప్పి వెళ్ళు. పెళ్ళి చేసుకున్నాక భార్య వద్దంటే కుదర్దు" అన్నాడు విజయరామారావు ఎర్రమనాయుడిని ఆపి.

"నేను వద్దనలేదు. ఇప్పుడు నా దృష్టి సంసారంమీద లేదు. జనసామాన్యం ఆకలికి మాడుతుంటే, దేశం విదేశీ పదఘట్టనల కింద నలిగిపోతూంటే, నేను నా వైయక్తిక సుఖాన్ని చూసుకోలేను. అది మీ దొరతనానికి అర్థం కాదు"

తన జమీలో తన మాటకు ఎదురుండదు. అలాంటిది ఈ కుర్రకుంక తనపై ఏమాత్రం గౌరవం లేకుండా మాట్లాడటం సహించలేకపోయాడు విజయరామారావు.

"ఇంక నాకూ మీకూ పడదు. మీలాంటి ప్రభుద్రోహుల ఇంటికి నా కూతుర్ని పంపనే పంపను. రేచెర్లవారి పట్టింపు సంగతేందో మీకు తెలుస్తుంది" అని పెద్దలు సర్ది చెప్పే మాటలు వినకుండా, విసవిసా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు విజయరామారావు.

గంధసిరికి వచ్చాక, "ఆ నికృష్టులతో నేను సంబంధం తెగతెంపులు చేసుకువచ్చాను. ఆ కుర్రాడికి మదం, పిచ్చి. ఆ పిచ్చోడితో నా కూతురు కాపురం చేయటం కల్ల" అని ప్రకటించారు.

రెండో భార్య లలితమ్మ ఏదో సర్ది చెప్పబోతే, "నోర్మూయ్! నాకే చెప్పేంతదానివయ్యావా!" అని కసురుకున్నాడు.

అయితే బంగారునాయుడు ఊర్కోలేదు. గంధసిరికి రాయబారం పంపాడు, "నేను నా కొడుక్కు నచ్చచెప్పుకుంటాను. మా వాడన్న మాటలు మీరు పట్టించుకోవద్దు.



వచ్చే పదవతేదీ ముహూర్తం బావుంది. పిల్లల పునస్సంధానానికి ఏర్పాటు చేయండి" అని.

వచ్చిన పెద్ద మనుషులపై మండిపడ్డాడు విజయరామారావు.

"ఆ కోన్‌కిస్కాగాడింటికి నా కూతుర్ని కాపురానికి పంపను. నేనింటికి వస్తే అంత అవమానం చేసి పంపుతారా! నా జమీలో మనుషులయితే ప్రాణం తీసివుండేవాడిని... ఈ విషయంలో నేను పెద్దగా చెప్పేదేం లేదు. వాడు నా ఇంటికి వచ్చి ఇల్లరికం ఉండటానికి ఇష్టపడ్తే సరే! పైసల్లేవుగానీ ప్రగల్భాలు పోయే మనుషుల ఇంటికి నా కూతుర్ని పంపే ప్రసక్తేలేదు. వాళ్ళనే ఆలోచించుకోమను" అని చెప్పి పంపేశాడు.

ఆ తరువాత బంగారునాయుడు దగ్గర నుండి జవాబేం రాలేదు విజయరామారావుకు. ఆయన తన పంతం వీడలేదు.

విజయరామారావు ఊరిలోనే కాదు,



## కొత్తగాలి...

**తేనె ముద్దలా**
**కొండ నునుకొమ్మన**
**చంద్ర చూచుకం**

–రామతీర్థ, నక్కవానిపాలెం, విశాఖ

ఇంట్లోనూ నియంతగానే వ్యవహరించే వాడు. ఎంత నియంత అయినా కూతురి జీవితం పుష్పించి, ఫలించకుండా వ్యర్థంగా గడిచిపోతుంటే ఆయన చూస్తూ ఊర్కోలే కపోయాడు. పునర్వివాహం చేయాలనే ఆలోచనే వచ్చే కాలం కాదది. అయితే ఏం చెయ్యాలో తోచని పరిస్థితులలో నిస్సహా యంగా ఉండిపోయాడు. మళ్ళీ వియ్యంకు డికి కబురు చెయ్యాలంటే ఆయనకు అహం అడ్డు వచ్చింది.

అయితే 1940ల కల్లా కమ్యూనిస్టుల ఆగడాలు ఆయనకు అవగతమవటం మొదలెట్టాక తనేం తప్పు చేయలేదన్న స్వాంతన ఆయనకు లభించసాగింది. కమ్యూనిస్టులు వెట్టిచాకిరికి వ్యతిరేకంగా ఉద్యమం చేపట్టారు. దిగుబడికి మించిన శిస్తు విధానం నిషేధించాలన్నారు. రైతుల పట్టా హక్కుల కోసం ఆందోళన చేశారు. నక్కీ-మలికానా పన్ను తొలగించాలనీ, జాగీర్దారీ విధానం రద్దవ్వాలనీ ఉద్యమిం చారు. తన దొరతనానికి ముప్పు వచ్చే పరిస్థితి వచ్చేసరికి తెలంగాణా కమ్యూనిస్టు లపై ఆయనకు కలిగిన ఆగ్రహం, అల్లు డిపై మరింత విముఖత్వం కలిగించింది. 1945లో 'భూస్వామ్య వ్యతిరేక' ఉద్యమం మొదలవటంతో విజయరామారావుకు మరింత అక్కసు కలిగింది.

ఇలాంటి సమయంలో ఎర్రమనాయుడి నుండి అతనికి ఉత్తరం వచ్చింది. తన తండ్రి బంగారునాయుడు చనిపోయాడనీ, ఆయన కర్మలవీ అయ్యాక తాను వచ్చి తన భార్యను తీసుకెళ్తాననీ ఎర్రమనా యుడు ఉత్తరం రాశాడు. ఆ ఉత్తరం చూడగానే విజయరామారావు మండిపో యాడు. "నీ తండ్రి, నువ్వు నాకు ద్రోహం చేశారు. కావాలని సంబంధం కలుపుకున్న వాడికి మీరు చేసిన ద్రోహం మరపురా నిది. ఎంత కట్నం మీ ఎదాన పోశాను. డబ్బు కావాలని అడిగితే, కులాభిమానంతో మీరడిగినంత బిచ్చం వేసేవాడిని. కానీ, మీరు పెళ్ళి పేరే చెప్పి నన్నూ, నా కూతుర్నీ మోసగించారు. మీలాంటి లుచ్చాలు మరొకళ్ళుండరు. నాకు ద్రోహం చేసిన ఆ దుష్టుడి మరణం నాకెంతో సంతోషం కలిగిస్తోంది. ఆ పైవాడు చూస్తూ ఊర్కోడు. తగిన శాస్తి చేస్తాడు. నువ్వు నా ఇంటికి రావాల్సిన అవసరం లేదు. వస్తే ప్రాణాలతో తిరిగిపోవు" అని తిరుగు జవాబు రాశాడు.

ఆ మర్నాడు భోజనం చేస్తున్నప్పుడు, "ఆ నా కొడుకు ఉత్తరం రాశాడు" అని ప్రకటించాడు.

"ఎవరు? " అడిగింది భార్య లలితమ్మ.

"వాళ్ళ నాయన చచ్చాట్ట! పీడాబో యింది. అంత్యక్రియలయ్యాక అనసూ యను కాపురానికి తీసుకెళ్తానని రాశాడు. 'మాకూ నీకు సంబంధం లేదు. నువ్వు రావాల్సిన పనిలేదు. వస్తే, ఛస్తావు' అని జవాబు రాసి పడేశాను"

అనసూయమ్మ మౌనంగా తండ్రి మాటలు విన్నది. ఆ కాలంలో స్త్రీ తన బతుకును తాను నిర్ధారించుకునే స్థితిలో లేదు. ఆమె బతుకు పరాధీనం. ఆ పరా ధీనతతో తండ్రి గడప దాటటమనే మొదటి మెట్టునే ఆమె అధిగమించలేకపో యింది. తనకంతే ప్రాప్తమన్న నిర్వేదంలో తండ్రికెదురు చెప్పలేదు. చెప్పి ప్రయో

జనం ఉండదని ఆమెకు తెల్సు.

తెలంగాణ సాయుధపోరాటం మొదల యింది. కమ్యూనిస్టు పార్టీ నిషేధానికి గురయింది. పోలీసు చర్య తర్వాత 1948 సెప్టెంబరు 17న నిజాం నవాబు లొంగిపో యినా సాయుధపోరాటం ఆగలేదు. నిషే ధానికి గురయిన కమ్యూనిస్టు పార్టీ 1950 దాకా పోరాటం కొనసాగించింది.

ఈ పోరాటంలో విజయరామారావు చాలా నష్టపోయారు. ఆయన భూములు చాలా భాగం రైతులకు పంచి పెట్టడం జరిగింది. 1949లో హైదరాబాద్ రాష్ట్రం భూసంస్కరణలు ప్రవేశపెట్టింది.

కొంత భూమి బినామి పేర్లకు మార్పిం చాడు. డబ్బు బలంతో తన దొరతనాన్ని నిలుపుకున్నాడు. ఆస్తి విషయంలో కొడుక్కు బందోబస్తు చేసినా, 1967లో ఆయన చనిపోయేనాటికి కూతురి బతుకు నాశనమైందన్న దిగులు ఆయన్ని వదల లేదు. ఆయన పోయిన రెండేళ్ళకు అతని భార్య లలితమ్మ కూడా చనిపోయింది.

విజయరామారావు బతికి ఉన్నప్పుడే హరినారాయణరావు వివాహమైంది. విజ యరామారావు చనిపోయాక ఇంటి పెత్తనం క్రమంగా హరినారాయణరావు భార్య విమల చేతిలోకిపోయింది. క్రమంగా అనసూయమ్మ దగ్గరకు వచ్చే అర్థుల సంఖ్య తగ్గిపోయింది. తన మామ గారు డబ్బు నీళ్ళలా ఖర్చు చేసేవారనీ, అనవసరపు ఆర్భాటాలకూ, విలాసాలకూ పోయేవాడని విమల నిశ్చితాభిప్రాయం. అలా అయితే సంసారం కుదుట పడదని భావించింది. ఇంటిలో దాసీలు, నౌకర్ల సంఖ్యను బాగా తగ్గించి వేసింది. అనసూ యమ్మను ఇంటి పనులు చేయమని ఆదే శించలేదుగాని, ఆమె కూడా కొన్ని పనులు చేయక తప్పని పరిస్థితి కల్పించింది. తండ్రి బతికున్నప్పుడు అన్ని వ్యవహారాల్లో అనసూయమ్మను సంప్రదించేవాడు. తమ్ముడు హరినారాయణరావు ఆ సంప్ర దాయాన్ని కొంత కాలం కొనసాగించాడు. కాని క్రమంగా ఆ బాధ్యతను మరదలు విమల స్వీకరించింది.




**త**ను ప్రశ్నించినప్పుడు రేణుక సిగ్గుప డటం, అన్యమనస్కంగా ఉండటం చూసిన అనసూయమ్మ ఇంక జాప్యం చేయలేదు. ఆ మర్నాడే రేణుక తండ్రి దేవదానాన్ని పిల్చి మాట్లాడింది.

“రేణుక వెంట ఎవరో కుర్రాడు పడి వేధిస్తున్నాడట! ఈ విషయమేంటో విచా రించు. ఆడపిల్ల విషయంలో ఉపేక్షాభావం పనికిరాదు” అని చెప్పింది.

“సరేనమ్మా! అట్లనే చూస్తాను” అని వెనుదిరిగి వెళ్ళిపోయాడు దేవదానం.

విజయరామారావు మరి రెండేళ్ళకు చని పోతాడనగా ఓ సంఘటన జరిగింది. తరచూ తండ్రీ, కూతురు వేణుగోపాల స్వామి ఆలయానికి వెళ్ళేవాళ్ళు. ఆలయం వెనకకే చెరువు. చల్లగాలులు వీస్తు ఉండేవి. అంతగా జనం వచ్చేవారు కాదు. ప్రశాంతమైన వాతావరణంలో ఎంతసేపు న్నా తనివిదీరేది కాదు అనసూయమ్మకు.

జమీలు పోయినా, దొరతనపు దర్జా తగ్గ లేదు విజయరామారావులో. భార్య లలిత మ్మకు దేవాలయానికి వెళ్ళాలన్న కోరిక అంత ఉండేది కాదు. అందుకే కూతుర్ని

తీసుకుని ఆలయానికి వచ్చేవాడు.

ఆ రోజు చీకట్లు ముసురుకుంటున్న సాయంసంధ్యలో కూతురితో కలసి ఆయన వేణుగోపాలస్వామి ఆలయాన్నుండి తిరిగి వస్తున్నాడు గుర్రపు బగ్గీలో. కార్ల వాడకం మొదలయినా, కొనుక్కునే స్థోమత ఉన్నా మోటారు బండిని కొనలేదు విజయరామారావు. గుర్రపు బగ్గీలో ఉండే ఠీవి, రాజసం ఆయా వాహనాల్లో ఉండదని ఆయన అభిప్రాయం. అందుకే బయటికి ఎక్కడకు వెళ్ళాలన్నా గుర్రపు బగ్గీనే వినియోగించేవాడు. వేణుగోపాలస్వామి ఆలయం ఖమ్మం నుండి గంధసిరిమీదుగా మెయిన్ రోడ్డులో కొంత దూరం పయనించాక దక్షిణానికి మళ్ళితే గాని రాదు. తిరిగివస్తూండగా ఎదుటిగుండా వస్తున్న మోటారు వాహనం హెడ్‌లైట్ల కాంతి మిరుమిట్లు గొల్పినట్లయి గుర్రం బెదిరిపోయింది. పక్కన నడచిపోతున్న ఓ స్త్రీని తాకటంతో ఆమె కిందపడిపోయింది. ఆలాంటి సంఘటనలు జరిగినప్పుడు విజయరామారావు పట్టించుకునేవాడు కాదు. బగ్గీవాడిని 'పోనీ' అని ఆదేశమిచ్చేవాడు. కాని, అనసూయమ్మ అలా ఊరుకోలేకపోయింది. బగ్గీవాడిని ఆపమని చెప్పి ఆమె బండి దిగి వెనక్కి తిరిగి పడిపోయివున్న స్త్రీ దగ్గరకు వెళ్ళింది. ఆమెకు అంతగా దెబ్బలేమీ తగలలేదు. బండి వేగంతో తాకటంతో పడిపోవటం వల్ల మోచేతులు చిట్లాయి. చేతులు డోక్కుపోయాయి. గాయాలకంటే ఆ అకస్మాత్ సంఘటన నుండి తేరుకోవటానికి ఆమెకు కొద్దిసేపు పట్టింది. వెంటనే స్పృహలోకి వచ్చిన ఆమె, తన వైపుగా నడచి వస్తున్న అనసూయమ్మను చూసి గాభరాపడిపోయింది. అనసూయమ్మ ఆమెను లేవనెత్తేందుకు వంగి "క్షమించమ్మా! మా వల్ల పొరపాటయింది. ఎదురుగా వస్తున్న మోటారు కారు చూసి గుర్రం బెదిరిపోయింది. క్షణంలో ఈ దుర్ఘటన జరిగింది. మేము ఊహించను కూడా లేదు" అంటూ ఆమె చేయి పట్టుకునే ప్రయత్నం చేసింది.



"అయ్యో, నన్ను తాకొద్దు. పెద్దోళ్ళు మీరు, మేము మాలోళ్ళం" అందా స్త్రీ కాతర స్వరంతో.



"మనుషులే కదా! లే వెళ్దాం" అంటూ భుజాలు పట్టుకుని లేవనెత్తింది ఆమెను అనసూయమ్మ.

"పెద్ద దెబ్బలేంలేదు. మోచెయ్యి గీరుకు పోయింది. అదే తగ్గిపోతుంది" అంది ఆ స్త్రీ లేస్తూ.

"ఎక్కడ వుంటారు మీరు? "

"హనుమాను మిట్టకాడ ఉంటాం"

"నిన్ను ఊళ్ళో ఎప్పుడూ చూసిన గుర్తు లేదు నాకు"

నిజానికి గంధసిరిలోని చాలా జనాభా అనసూయమ్మకు అపరిచితమే. ఘోషా పాటించాల్సిన అగ్రవర్ణానికి చెందిన స్త్రీ ఆమె. ఆమె బయటికి రావటమే అరుదు.

కొత్తగాలి...

**ఫొటో తియ్యకుండా**
**దేన్నీవదలదు**
**గుండె డిజిటల్ కెమెరా**

—మాధవీసనారా, అనకాపల్లి

కనుక ఊరిలో చాలా మందితో ఆమెకు ముఖపరిచయమైనా ఉండే అవకాశం లేదు.

"మాది బూర్గంపాడు. మా ఆయన్ను ఈ ఊరి సర్కారు స్కూలుకు బదిలీ చేసినారు. మేం ఈడకు వచ్చి ఏడాది దాటినాది. పెద్దింటోళ్ళు తమరుతెల్సు నాకు" ఆమె పేరు మరియమ్మ. చర్చికి వెళ్ళి తిరిగి వస్తున్నది.

వాళ్ళు గుర్రపు బగ్గీ దగ్గరకు వచ్చారు. అప్పటిదాకా విజయరామారావు అసహనంగా బగ్గీలో కూర్చుని వున్నాడు. ఇలా కింద తరగతి స్త్రీతో తన కూతురు మాట్లాడటం చూస్తే ఇదివరకటి రోజుల్లో అయితే అగ్గిమీద పడ్డ గుగ్గిలమయ్యేవాడు. కానీ ఇప్పుడు పరిస్థితులు పూర్తిగా మారిపోయాయి. దేశ్‌ముఖ్ అహంకారాన్ని జనం గుర్తించటం ప్రారంభించారు. తన దొరతనం పేరుకు మాత్రమే మిగిలింది. మరియమ్మ కాదంటున్నా బగ్గీ ఎక్కించి తీసుకువెళ్ళింది అనసూయమ్మ.

ఆమె బగ్గీలో ఓ మూల ఒదిగి కూర్చుంది. కక్కాలేని, మింగాలేని పరిస్థితి విజయరామారావుది. కూతుర్ని ఏమీ అనలేక, కంపరంగా ఆమె వంక చూశాడు. మరియమ్మను ఆమె ఇంటి దగ్గర దింపి, తండ్రితో ఇంటికి వెళ్ళిపోయింది అనసూయమ్మ.

ఆ తరువాత మరియమ్మతో మరింత అధిక పరిచయం పెంచుకుంది అనసూయమ్మ. ఆ పరిచయంతో అప్పటిదాకా కింద తరగతులవారి జీవనాన్ని గురించి లీలగా తెల్సిన అనసూయమ్మకు ఇప్పుడు మరింత స్పష్టంగా అవగాహన కాసాగింది. తన తండ్రి ఆంక్షలు ఆమెకు తెల్సు కనక, మరియమ్మనే వీలున్నప్పుడల్లా తన ఇంటికి- గదికి రమ్మని కోరింది అనసూయమ్మ.

అణగారిన వర్గాలలో కొంత సాంస్కృతిక వారసత్వం పొందిన కులం మాలవారు. ఆ కులంవారు చచ్చిన జంతువుల చర్మంతో చెప్పులు కుట్టటంలాంటి పనులు చేసేవారు కాదు. వ్యవసాయం చేసుకోటమో, నేతపనిని చేపట్టటమో, కూలీపనికి వెళ్ళటమో చేసేవారు. వారిలో పెద్దల దగ్గర నేర్చుకున్న తాత్విక చింతనలు కలిగిన మాలదాసరులూ ఉన్నారు.

ఇరవయ్యో శతాబ్దం అర్ధభాగానికల్లా అణగారిన వర్గాల్లో వీచిన స్వేచ్ఛా పవనాలకు మొదటగా మేల్కొంది మాలలు. చదువు ఆవశ్యకతను వారు గుర్తించారు. ఎన్ని ఏళ్ళు గడచినా, అస్పృశ్యతా నివారణ అందని మావి పండని భావించిన కొంతమంది బౌద్ధమతాన్ని స్వీకరించారు. కొంతమంది ఈ అస్పృశ్యతను పోగొట్టుకునే ప్రయత్నంలో క్రైస్తవ మతాన్ని స్వీకరించారు. స్వేచ్ఛతో ఇస్లాంను స్వీకరించిన వారు బహుకొద్దిమంది. నిజాం కాలంలో 'తబ్లిగ్' ఉద్యమం మొదలై, బలవంతంగా కొంతమందిని ఇస్లాంలోకి మార్చటం జరిగింది గానీ, ఆ తర్వాత ఆర్య సమాజీయులు వారికి 'శుద్ధి' కార్యక్రమం నిర్వహించి తిరిగి హిందూమత కవాటాలు తెర్చారు.

హిందూమతంలో బయటికి వెళ్ళే మార్గమే కానీ, లోపలికి వచ్చే మార్గంలేదు. కుల వ్యవస్థ అందుకు జవాబుదారీ వహిం

చింది. హిందువులంతా ఓ కులంలో పుడ్తారు. ఆ కులంలో చస్తారు. ఏ హిందువూ తను పుట్టిన కులం నుండి పై కులానికి ఎగబాకలేడు. హిందువన్నవాడు మరో మతం స్వీకరించినా, తాను పుట్టిన కులం అతన్ని వదలదు. అలాంటి సందర్భమే మరియమ్మ, దేవదానం దంపతులది. వారు క్రైస్తవ మతం స్వీకరించినా వారిని మాలక్రైస్తవులంటారేగానీ, క్రైస్తవులనరు. మజ్జాగతమైన కులభావన వారినీ వీడిపోదు.

విజయరామారావుకు మరియమ్మ తన ఇంటికి రావటం ఇష్టంలేదు. అణగారిన వర్గాలు పైకి వస్తున్నాయి. 1960 జనవరిలో దామోదరం సంజీవయ్య ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అయ్యాడు. కాంగ్రెసు పార్టీ ఎం.ఎల్.ఎ.గా ఉన్న తను కులవివక్షతను పాటించలేదు. ఓట్లు దండుకునే వేటలో కాంగ్రెస్ పార్టీ షెడ్యూల్డు కులాల వారికి అధిక ప్రాధాన్యమిస్తోంది. ఆయన ప్రస్తుత కాలంలో జీవించినా విజయరామారావు ఆలోచనలన్నీ నిజాం కాలంలో అనుభవించిన స్వర్ణయుగం మీదే ఉండేవి. ఆయన చనిపోవటానికి కొన్ని నెలల ముందు నిజాం నవాబు మీర్ ఉస్మాన్ అలీఖాన్ 1967 ఫిబ్రవరి 24న స్వర్గస్థుడయ్యాడు. ఆయన మరణం పట్ల అమితంగా దుఃఖించిన వాళ్ళలో విజయరామారావు ఒకడు.

మరియమ్మకు నాలుగేళ్ళ కూతురు. పసిపిల్ల రేణుక ఆలనా పాలనా చూసుకోవటంతోనూ, ఆపైన అత్తమ్మ పెట్టే ఆరళ్ళతోనూ మరియమ్మకు దొరసాని ఇంటికి తరచు రావటం కుదిరేది కాదు. అనసూయమ్మకు మరియమ్మతో ఎంతో అనుబంధమేర్పడింది. ఏ సంబంధాలు ఎలా ఏర్పడతాయో ఎవరూ చెప్పలేరు. ఓ వారం రోజులు మరియమ్మ రాకపోతే అనసూ

యమ్మ ఆమె కోసం కబురు పంపేది. తండ్రి పోయాక ఇంటి వ్యవహారాలు, బాధ్యతల నుండి పూర్తిగా విముక్తమ య్యాక మరియమ్మ సాంగత్యం ఆమెకు మరింత అభిలషణీయమైంది. తనకూ, ప్రపంచానికీ మధ్య ఉన్న లింకు ఆమె ఒక్కతే. ఇంటిలోని మిగతా సభ్యులెవరూ ఆమెతో మనసు విప్పి మాట్లాడరు.

ఓ రోజు సాయంత్రం నాలుగు గంట లకు వస్తానని మరియమ్మ ఆరింటికి తీరు బాటుగా వచ్చింది.

"మా ఇంటి పక్కనుండే కురవప్పకు ప్రా ణంమీదకొచ్చింది. మా ఆయన ప్రార్థన చేద్దాం రమ్మన్నాడు. నేనూ, అత్తమ్మా, జోగులూ, పాస్టరూ వెళ్ళినాము, ప్రార్థన చేసినాము. కురువప్పకు కొద్దిగా నయమ నిపించినాది" అంది మరియమ్మ.

"భగవంతుడిని ప్రార్థిస్తే మాత్రలు వాడ కుండానే మనిషి బతుకుతాడా? "

"బతుకుతాడు, ఏసు ప్రభువు కరుణామ యుడు, ఆయనే చూసుకుంటాడు. తన మంద యోగక్షేమాలు"

అవును, . తను విన్నది, క్రైస్తవులు మతాంతరీకరణకు ఇలాంటి సేవా కార్యక్ర మాలు నిర్వహిస్తుంటారు. ఆసుపత్రులు, బడులు అందుకే తెరుస్తుంటారట. ఉద్దేశం ఏదయినా వాళ్ళు మానవ సేవ చేస్తు న్నారు. అది మాధవసేవే. హిందువులకు సమాజసేవ అవసరం లేదు. ఎవర్నీ తమ మతంలోకి చేర్చుకునే ప్రశ్నే లేదు కనుక.

అంతలో దాసి వచ్చి అనసూయమ్మను అడిగింది, "తమరు రాత్రికి ఏం తీసుకుం టారో అడిగి రమ్మంది చిన్నమ్మగారు" అని.

చిన్నమ్మ అంటే మరదలు విమల, తమ్ముడి భార్య. అనసూయమ్మ అప్పటికి నలభయ్యవ పడిలో పడింది. ఆమె సధవే కాని విధవ బతుకు. ఎప్పుడో తనకు పదే ళ్ళపుడు వివాహమైంది. అసలు ఆ మనిషి ఎలా ఉంటాడో కూడా ఆమెకు గుర్తులేదు. విధవలు రాత్రిపూట భోజనం మానే యటం ఆచారం. ఆమె కూడా ఆచారం పాటిస్తుంది.

"ఉప్మా చెయ్యమను. మరియమ్మకు చాయ్ తెచ్చి పెట్టు" అంది అనసూ యమ్మ.

"అట్లాగే" అని, మరియమ్మ వంక తిరిగి, "నిన్నట్లా మెత్తమీద కూర్చోవద్దని చిన్నమ్మ చెప్పింది" అని విరసంగా చెప్పి లోపలికి వెళ్ళిపోయింది దాసి.

అనసూయమ్మ దాసి మాటలకు ఆఘా తపడిపోయింది. తండ్రి బతికున్నంత కాలం తనేం చేసినా ప్రశ్నించిన వాళ్లు లేరు. ఆమె కులాల ఉచ్చనీచాలను పాటించే మనిషి కాదు. సమాజం అంతగా ఆమె దరికి రాలేదు. పురోహితుడు రామ శర్మ, పూజారి రంగాచారి వచ్చినా వాళ్ళను గౌరవించటమేగానీ, అందులో తమ తక్కువతనం ఆమెకెప్పుడూ అనుభవం కాలేదు. వాళ్ళకిచ్చిన గౌరవమే మరియ మ్మకు ఇచ్చింది ఆమె. మెత్తలున్న సోఫా లోనే ఆమెను ఆసీనురాలిని చేసేది. మొదట్లో మరియమ్మ అందుకు అంగీకరిం చక కింద కూర్చోబోయినా తనే ఆమె చేయి పట్టుకుని పైన కూర్చోబెట్టింది. అప్పుడెవరూ తప్పు పట్టినవాళ్ళు లేరు. మొదట దాసీదానిపై ఆగ్రహం వచ్చింది అనసూయమ్మకు. తర్వాత మనసు నిగ్ర హించుకుంది. అందులో దాసీదాని తప్పేం లేదు. మరదలు మాటలకు వాహిక మాత్రమే ఆమె. ఇంట్లో తన స్థానమేమిటో తెలియచెప్పే సంఘటనలు ఇంతకు ముందు జరిగాయి గానీ, ఇంత స్పష్టంగా వ్యక్తపరచిన ప్రయత్నమిదే. తన బతుకు లోని ప్రయోజనాన్ని నిర్ధారించుకోవాలని ఆమె ఎప్పటినుండో అనుకుంటున్నది. ఈ

# ఇది చతురలో నా అయిదో నవల

**నే**రాసిన నవలల్లో సింహభాగం 'చతుర'లోనే ప్రచురితమవడం నిజంగా ఆనందం కల్గించే అంశం. ఇప్పటిదాకా పది నవలలు రాస్తే ఇపుడు ప్రచురితమవుతున్న 'శీలపరీక్ష' చతురలో అయిదోనవల. ఈ నవలకు కన్సొలేషన్ బహుమతి ఇచ్చి ప్రోత్సహించినందుకు పత్రిక సంపాదకవర్గానికి కృతజ్ఞతలు. ఇక నా గురించి... గుంటూరు జిల్లా మంగళగిరి పక్కన ఉన్న చినకాకాని గ్రామంలో 1942 ఏప్రిల్ 26న జన్మించాను. ఇంగ్లీషులో ఎంఏ., పిహెచ్‌డి చేసి మూడు దశాబ్దాలపాటు కళాశాలల్లో ఆంగ్ల భాషోపాధ్యాయుడిగా వృత్తిబాధ్యతలు నిర్వర్తించాను. రచనా వ్యాసంగంపట్ల మక్కువ ఎక్కువ కాగా వివిధ పత్రికల్లో అనేక కథలు, వ్యాసాలు వెలువరించాను. 'పతితపావని', 'థ్రిల్లింత', 'నివురు' పేరిట మూడు కథాసంపుటాలు వెలువడ్డాయి. కాగా, తెలుగు సాహిత్యంలో ఆణిముత్యాలనదగ్గ రాజశేఖర చరిత్రము, మైదానం, అసమర్థుని జీవయాత్ర, చివరకు మిగిలేది, అల్పజీవి నవలలను ఆంగ్లంలోకి అనువదించాను. 'ఆంధ్రభూమి' దినపత్రికలో 'కథలు-కాకరకాయలు' శీర్షికతో చాలాకాలం కాలమిస్ట్‌గా రచనలు వెలువరించాను. జీవితానికి కొంత సార్థకత పొందాలన్న ఆరాటం, తపన మెండుగా ఉన్నాయి.




కాకాని చక్రపాణి
6-1-149/10, ఫ్లాట్ నంబర్ 101,
విశ్వంభర అపార్ట్‌మెంట్స్,
పద్మారావునగర్,
సికింద్రాబాద్-500025
ఫోన్: 040-27501409


సంఘటనతో ఆమె మనస్సు మరింత నిర్ణయాత్మకమైంది. ఇందులో మరియమ్మను అవమానించటం లక్ష్యం కాదు. ఆ ఇంట్లో తన స్థానమేమిటో తెలియచెప్పటం గృహిణి ఉద్దేశం.

అలా దాసీది చెప్పినందుకు మరియమ్మ చిన్నబుచ్చుకోలేదు. సోఫానుండి లేచి కింద కూర్చున్నది. అనసూయమ్మ కూడా లేచి ఆమె ముందు నేలమీద కూర్చున్నది.

"అదేంటి దొరసానీ, కింద కూచున్నావు. మాలాంటోళ్ళు కిందనే కూచోవాలి. నేనే తప్పు చేశాను. అందుకు నేనేం మనసు కష్టపెట్టుకోను" అంది మరియమ్మ.

"నేను ఇలాంటివాటికన్నింటికీ అలవాటు పడాలనుకుంటున్నాను. నేను మనసు కష్టపెట్టుకోలేదు. మరోమాట నన్ను 'దొరసానీ' అని పిలవకు, వయసులో నీ కంటే పెద్దదానిని కనుక 'అక్కా' అని పిలువు"

"అలాగే, అక్కా!" అంది వెంటనే మరియమ్మ.

ఈ సరళస్వభావమే మరియమ్మను అనసూయమ్మ గుండెకు మరింత దగ్గిర చేర్చింది.

"దొరతనం భౌతికమైంది కాదు, మానసికమైంది"

మరియమ్మకు ఆమె మాటలు అర్థం కాలేదు, "మీ భర్త ఏం చేస్తుంటారమ్మా!" అనడిగింది.

ఓ క్షణం ఏం మాట్లాడలేకపోయింది అనసూయమ్మ.

"ఆయన మహారాజు, ఊహల్లో రాజ్యమేలుతుంటారు" అంది సన్నగా నవ్వుతూ.

"మరి మీరు ఆయన దగ్గరకు వెళ్ళలేదేం? "

"మాది రేచెర్ల వారి వంశం. శూరుల కుటుంబంలో పుట్టినదాన్ని. భర్త గాలి తగలకుండా శౌర్యంగా బతకాలని దేవుడు రాసిపెట్టాడు. అందుకే ధైర్యంగా, ఒంటరిగా బతుకుతున్నాను."

మరియమ్మకు ఆమె మాటలు అర్థం



కాలేదు గానీ, ఆమెకు విషయం చెప్పటమి ష్టంలేదని అర్థం చేసుకున్నది. అందుకే మరి ఆ విషయంలో ఆమె తరచి ప్రశ్నించలేదు.

"మరి పచ్చీసు ఆడదామా, అక్కా? " అడిగింది మరియమ్మ.

"ఇవాళ నాకు ఆడాలని లేదే. కబుర్లు ఏమయినా చెప్పు" అంది అనసూయమ్మ. పావుగంట గడిచినా, తను మరియమ్మ కోసం ఆదేశించిన 'చాయ్' రాలేదు. ఇంక 'రాదు' అని ఆమె నిర్ధారించుకుంది.

"ఏం చెప్పమంటావమ్మా! మా ఆయన నాలుగ్గంటలకు స్కూలు నుండి వస్తాడు. చాయ్ తాగినాక, ఆరుగంటలకు రాత్రి వయోజన పాఠశాల అంటూ వెళ్తాడు. రాత్రి వచ్చేటప్పటికి ఎనిమిది గంటలవుతుంది. ఆయన వచ్చే లోపల నేను వంట చేస్తాను"

అవును. తను ఆ విషయం వింది. వయోజన పాఠశాల అంటూ దేవదానం మతాంతరీకరణకు ప్రయత్నిస్తున్నాడని శౌరయ్య తమ్ముడితో అనడం తను విన్నది. మతాంతరీకరణో, మట్టి గడ్డలో, ప్రజాహితకార్యం చేపట్టటం తనకిష్టమైన పనే.

"రాత్రిపాఠశాలలో జీతం ఎంతిస్తారు? "

"ఏమివ్వరు. మా ఆయనే చదువుకొని పెద్దోళ్ళకు చదువు నేర్పాలని ఆరాటపడుతుంటాడు. ఏసుదేవుడు ఆయనకు చదువిచ్చిండు. అది నలుగురికీ చెప్తే బాగుపడతారంటడు. బాపనోళ్ళు మమ్మీస్థితికి తెచ్చారంటాడు. అంటరానితనం ఆళ్ళు అంటగట్టిందే. కానీ, మా ఆయనకు ఓ బాపన పంతులు చదువు చెప్పిండు. ఆయనంటే నా మొగుడికి గురి. 'నీ చదువు నీ దగ్గరే ఉంచుకోకొరే. కుళ్ళిపోతాది. నలుగురికీ చెప్పు. నీకు మంచి జరుగుతాది' అన్నాడంట! ఆ రోజుల్లో ఆయనకు చదువుకొనడమే కష్టమైనాదంట! ఆ పంతులు దగ్గరకు తీసుకుని చదువు చెప్పినాడు. ఆ పంతులిప్పుడు లేడు. మా ఆయన ఆయన కోసం రోజూ ప్రార్థన చేస్తాడు"

"నువ్వు ఎంతవరకు చదువుకున్నావే? "

"నాకా, చదువా? " నవ్వింది మరియమ్మ.

"నేను చదువుకోలేదు. అసలు మా ఊళ్లో ఆడపిల్లలు కూడా చదూకోవాలని ఎవరికీ తెలియదు. మా ఆయన నాకు పాఠం చెప్తనంటడు. కానీ, నాకా చదువు రాదు. దానిమీద నాకు ఆసక్తి లేదు"

"దేవుడి మీద నమ్మకముందా? "

"ఏమో తల్లీ! దేవుడిమీద నమ్మకముండకపోతే ఎట్లా? సైతాను వేపుకు తింటాడు. 'ఏదో పని చెయ్యవే, పనిలేనోళ్ళను సైతాను పట్టి పీడిస్తాడు' అంటాడు మా ఆయన. ఏంపని చెయ్యాను? ఖమ్మంలోనూ ఆయన మాస్టరు ట్రయినంగవుతుంటే, నేను కుట్టుపని నేర్చుకున్నాను. కుట్లు, అల్లికలు బాగా చేయగలను. ఈడకొచ్చినాకే అదీ మూలబడినాది"

అలా ఉబుసుపోక కబుర్లు చెప్పుకున్నాక ఏడు గంటల సమయంలో మరియమ్మ ఇంటికి వెళ్ళిపోయింది. అనసూయమ్మ అలాగే నేలమీద కూర్చుని ఆలోచనల్లో పడిపోయింది.

దేవదానం, ఏ ప్రయోజనాన్నుద్దేశించినా, తనకు తోచిన పద్ధతిలో సమాజసేవ చేస్తున్నాడు. తనేం చేస్తున్నది! తనూ చదువుకున్నది, భారత భాగవతాదులు. మారిన పరిస్థితుల్లో ఆ చదువుకు ప్రయోజనం లేకపోవచ్చు. తను ఎవరికీ ఓ మంచి మాట చెప్పినది లేదు. తండ్రి బతికున్న రోజుల్లో వెలమదొరసానుల రాజసం తానూ అనుభవించింది. తండ్రి అహంకారంతో తన భర్తతో సంబంధం పెట్టుకోకూడదని నిర్ణయించినా తనూ అహంకారంతో భీష్మిం

చింది. ఇప్పుడు దేవదానం చేస్తున్నపని విన్నాక, తన భర్త తీసుకున్న నిర్ణయంలో తప్పేం తనకు కనపడటంలేదు. కమ్యూనిస్టులు, విప్లవం, సామాజిక మౌలిక మార్పు అంటూ ఆయన మాట్లాడేవాడట! "పిచ్చి మాటలు, ఉన్మాది!" అంటూ తండ్రి ఆయన మాటలు కొట్టి పారేసాడు. అప్పుడు తండ్రి మాటలు తనకు నిజమేననిపించాయి. ఆ తరువాత 'దిన్‌కా సర్కార్, రాత్‌కా సర్కార్' అని తను విన్న మాటలూ తండ్రి మాటలనే ధృవీకరించాయి. కానీ ఇవాళ ఆలోచిస్తుంటే ఆయన ఆలోచనల్లో తనకు తప్పేం కన్పడలేదు. ఆయన ఊహించిన విప్లవం అవతరించలేదు. కానీ, ఊహలలోని గొప్పతనం, ఆశయం, ఆదర్శం తప్పుపట్టేవి కావు.

తన్ను మాత్రం మర్చిపోయాడు. ఆ మనిషి మళ్ళా పెళ్ళి చేసుకున్నాడేమో? అక్కడినుండి వార్తలే లేవు. ఎంతమంది పిల్లలో? ఆ మనిషికి తను గుర్తుండాల్సిన అవసరమూ లేదు. ఎట్లా ఉంటాడు ఆయన? తమ పెళ్ళయ్యేనాటికి ఫొటోలు లేవు. పెళ్ళప్పటికి తను బాగా చిన్న పిల్ల. నగలతో, పట్టు పరికిణీ, జాకెట్లలో తన్ను అలంకరించినప్పుడు సంబరపడిపోయింది గానీ, తన పక్కన కూర్చున్న ఆ పిల్లవాడు ఎట్లా ఉంటాడో కూడా తను పట్టించుకోలేదు. తన మొగుడని చెప్పారు. తను చిన్నప్పుడు స్నేహితురాళ్ళతో బొమ్మల పెళ్ళిళ్ళు ఎన్ని చేయలేదు. తమదీ అలాంటి బొమ్మలపెళ్ళే. ఆ మొగుడు బొమ్మను గూర్చిన జ్ఞానమే తనకు లేదు.

తండ్రి బతుకున్న రోజుల్లో ఇలాంటి నైరాశ్యం లేదు, ద్వైదీభావం లేదు. ఏం చేయాలన్న ప్రశ్న కలగలేదు. ఎప్పుడూ ఏదో పని ఉండేది. ఇప్పుడు తను చేయటానికేమీలేదు. తన బతుక్కు తను సన్నద్ధపడలేదు!

అలా ఆలోచనలోపడి కూర్చుండిపోయింది అనసూయమ్మ.

"అదేంటమ్మా! దీపం వెలిగించుకోకుండా కూచున్నారు? చిన్నమ్మగారు ఫలహారానికి మిమ్మల్ని లేవమంటున్నారు" అని దాసీ అనటంతో ఉలిక్కిపడి ప్రస్తుతంలో పడింది అనసూయమ్మ.

లేచి కాళ్ళూ చేతులూ కడుక్కొని వచ్చి వంటింట్లో పీటమీద కూర్చుంది. అప్పటికింకా డైనింగ్ టేబుల్ సంస్కృతి ఆ ఇంట్లో ప్రవేశించలేదు. వంటామె ఉప్మా పళ్ళెం తెచ్చి ఆమెముందు పెట్టింది. పిల్లల భోజనాలు అయినట్లున్నాయి. తమ్ముడు హరినారాయణరావు, మరదలు విమల ఆమె పక్కన భోజనానికి కూర్చున్నారు.

"అందర్నీ తీసుకొచ్చి సోఫాల్లో కూర్చోపెట్టటం సరైంది కాదని అన్నానని వదినగారికి కోపం వచ్చినట్లుంది. ఆ వచ్చినామెతో తనూ నేలపై కూర్చుండిపోయారు" అంది విమల భర్తతో తెలివిగా. పైకి సంజాయిషీ ఇచ్చుకున్నట్లు కన్పించినా ఆమె మాటలు భర్తకు వదినగారిపై ఫిర్యాదు చెయ్యటానికే లక్ష్యితమయ్యాయి.

"నాకు కోపమా?" అంది అనసూయమ్మ చిరునవ్వు నవ్వుతూ.

"చెప్పకండి... మా కన్నారింట్లో అయితే అలాంటి వాళ్ళని అసలు లోపలికే రానిచ్చే వాళ్ళు కాదు. మామగారు మీ మాటని కాదనలేక తనకు ఇష్టం లేకపోయినా

## కొత్తగాలి...

**అరె!**
**ఆకాశంలో నక్షత్రాలు**
**మా పెరటిచెట్లో నందివర్ధనాల్లా**
**ప్రత్యక్షం**

**–యలమర్తి అనూరాధ,** పెనుగొండ



మారు మాట్లాడేవారు కాదు. కానీ, ఎన్నాళ్ళు? పిల్లలు పెరుగుతున్నారు. వాళ్ళపై చెడు ప్రభావం పడకూడదు. తార తమ్ములు తెలియక భంగపడిపోతారు"

తమ్ముడు హరినారాయణరావు మాట్లాడకుండా భోజనం చేస్తున్నాడు.

"నాది పొరపాటేనమ్మా! నేను ఆలోచిస్తున్నాను- ఇలా ఏం పనిలేక ఇంట్లోపడి తినటం నాకూ కష్టమనిపిస్తున్నది. నువ్వన్నది నిజమే- ఎన్నాళ్ళిలా? "

"అలగా జనాలను నెత్తినెక్కించుకోవద్దని చెప్పాను గానీ, మీ సంరక్షణ భారం మాకు కష్టమనలేదు"

"అసలు నీకు ఆ పంతులు పెళ్ళాంతో ఏం మాటలక్కా? ఎవరి జాగాలో వాళ్ల నుంచాలి. ఇప్పటికే జనం మితిమీరిపోతున్నారు. అలాటి వాళ్ళను ఇంట్లోనూ తెచ్చి పెట్టుకోవాలా? " అన్నాడు హరినారాయణరావు భార్యకు వత్తాసుగా.

"సర్లే... రేపటి నుండి ఆమెను రావద్దని చెప్తాను. కావాలంటే నేనే ఆమె ఇంటికి వెళ్తాను" అంది అనసూయమ్మ.

"నువ్వు ఇల్లు దాటితే మన పరువేం గావాలి" అన్నాడు హరినారాయణరావు కోపంగా.

"అవును. ఆ పరువుకోసమే నా బతుకు పణంగా పెట్టాను. ఇంక ఆ మిథ్యాభావమూ నన్ను వదలిపోయింది. ఏం చేయాలో ఆలోచిస్తాను" అంది అనసూయమ్మ, పళ్లెం ముందు నుంచి లేస్తూ. పళ్ళెంలో పెట్టిన ఉప్మా అలాగే ఉండిపోయింది. అది ఆమె నోటికి సహించలేదు.

మరియమ్మలోని అమాయకత్వం అనసూయమ్మకెంతో ఆకర్షణ కలిగించింది. ఆమె ద్వారా బయటి ప్రపంచం పట్ల తనకు తెలివిడి కలుగుతోంది. అందువల్ల ఆ స్నేహాన్ని, తనకు ప్రపంచానికీ ఉన్న ఒక్క లింకును తుంచివేయాలని ఆమె భావించలేదు. మరియమ్మకు తన ఇంట్లోకి వచ్చే దారిని మూసివేశారు. కనుక తనే ఆమె ఇంటికి వెళ్ళాలని నిర్ణయించుకుంది అనసూయమ్మ.

ఆ మర్నాడు వెంట తోడు లేకుండా మొదటిసారిగా ఆమె బయటకడుగుపెట్టింది. అంతదాకా తను గుమ్మం దాటింది వేణుగోపాలస్వామి ఆలయానికి. తండ్రి బతుకున్నరోజుల్లో తన్ను తీసుకు వెళ్ళటానికి గుర్రపుబగ్గీ సిద్ధంగా ఉండేది. ఇప్పుడు గుర్రపు బగ్గీగానీ, అశ్వశాలలో అశ్వాలుగాని లేవు. తమ్ముడు గుర్రాల్ని అమ్మేశాడు. ఆ పనికి నియమించిన పనివాళ్ళను తొలగించాడు. ఓ మోటారు కారు కొన్నాడు. అది అతడికి, అతని భార్యా, పిల్లలు బయటికి వెళ్ళటానికి మాత్రమే ఉపయోగపడేది. అందుకు ఒక డ్రైవరును కూడా నియమించుకున్నాడు. అనసూయమ్మ బయటికెళ్ళాల్సిన పని ఉంటుందని ఎవరూ భావించలేదు. తన కోసం మోటారు కారు పంపమని ఆమె అడిగినదీ లేదు. ఇప్పటిదాకా దొరసానులు ఒంటరిగా నడిచి వెళ్లకూడదు కనుక, గుడికి వెళ్ళటం కూడా మానుకుంది ఆమె. ఇంక ఎవరి పరువు, ప్రతిష్టల కోసమూ తను చేయదల్చుకుంది మానుకోకూడదని నిర్ణయించుకుంది. తోడుగా దాసిని వెంట తీసుకువెళ్ళాలన్నా మరదలు అనుమతి తీసుకోవాలి. అందుకు ఆమె మనస్సు అంగీకరించలేదు.

ఇల్లుదాటి బయటకొచ్చిన అనసూయమ్మకు మరియమ్మ ఇల్లెక్కడో తెలియదు. "హనుమాన్ మిట్టకాడ ఉంటాం" అని ఆమె చెప్పిన మాట గుర్తు. ఆ హనుమాను మిట్ట ఎక్కడో తెలియదు ఆమెకు. తోవలో పోతున్న స్కూలు పిల్లలను అడిగింది. వాళ్ళిచ్చిన సమాచారం మేరకు ఆమె నడుచుకుంటూ వెళ్ళింది. చివరికి

# సింహం గర్జిస్తే ఏమవుతుంది?




సింహం గర్జిస్తే ఏమవుతుంది? ఎం.జి.ఎం. సినిమా మొదలవుతుంది. పైప్రశ్న, జవాబు 1960లలో ఇంగ్లీషు సినిమా ప్రేక్షకులకి సుపరిచితమైనదే.

హాలివుడ్ సంస్థ ఎం.జి.ఎం. చిహ్నం గర్జించే సింహం. ఆ సింహం పేరు లియో. అది మరణించాక న్యూజెర్సీలోని గిల్లెట్ అనే ఊళ్ళోని ఓ పొలంలో దాన్ని పాతిపెట్టారు. టార్జాన్ సినిమాలో నటించిన 'చీటా, ది చింప్' అనే కోతి సమాధి పక్కనే దీని సమాధి ఉంది. హాలీవుడ్ అనిమల్ ట్రైనర్ ఓర్నే గ్రెఫర్ 1974లో మరణించాడు. అతను శిక్షణ ఇచ్చిన సినిమాల్లో నటించిన అనేక జంతువులు అనంతర కాలంలో మరణించాక తన పొలంలోనే పాతిపెట్టాడు.

32 ఏళ్ళ తర్వాత క్రితం సంవత్సరం ఎం.జి.ఎం. సంస్థ వారు తమ చిత్రాలకి ఎంబ్లెమ్‌గా నటించిన లియో సింహానికి దాన్ని పాతిపెట్టిన చెట్టు కింద ఓ చక్కటి సమాధిని కట్టించి తమ గౌరవాన్ని చాటుకున్నారు.

వాళ్ళనీ వీళ్ళనీ అడిగి మరియమ్మ ఇల్లు పట్టుకోగల్గింది. దొరసాని దారి వెంట వస్తూ ఉంటే, ఆమెను గుర్తించిన పాత కాలం మనుషులు పక్కకు తొలగిపోయారు.

తన ఇంటికి వచ్చిన అనసూయమ్మను చూసి సంబరపడిపోయింది మరియమ్మ.

"అమ్మో మా ఇంటికి మా లచ్చిమే తరలివచ్చింది! నేనేం చేయనమ్మా, నిన్నెక్కడ కూర్చోపెట్టను? మా ఇంటిలో సోఫాలు లేవు" అని గాబరా పడిపోయింది ఆమె.

"చాప ఉంటే వెయ్యవే, లేదూ నేలమీదే కూర్చుందాం" అంది అనసూయమ్మ.

పిల్లను ఎత్తుకునున్న అత్తమ్మకు పరిచయం చేసింది, "దొరసానమ్మ" అంటూ మరియమ్మ.

"నీ కాళ్మొక్కా, బాన్చను" అంటూ ఆమె మనవరాల్ని కిందకు దించి ఆమెకు నమస్కరించబోయింది.

"వద్దు తప్పు, అలా చేయవద్దు" అంటూ ఆమెను నిలువరించింది అనసూయమ్మ. పాప వంక తిరిగి, "మీ మనవరాలా? ఏం పేరే పిల్లా? " అని అడిగింది.

"రేణుక" అంది ఆ పిల్ల భయం భయంగా చూస్తూ.

"బావుందే నీ పేరు. మరి మీ అమ్మ పేరేమిటి, నాయనమ్మ పేరేమిటి? ..." అని ఆమెను దగ్గరకు తీసుకుంది.

అంతలో లోపలి గదిలో నుండి స్కూలుకు బయలుదేరుతూ బయటికి వచ్చిన దేవదానం "దండాలు. దొరసానమ్మా" అన్నాడు ఆమెకు నమస్కరిస్తూ.

"నేను దొరసానమ్మను కాదు. నీ భార్యకు అక్కను. ఆ గౌరవమిస్తే చాలు"

"తమ రెట్లన్నా దొరతనం మాటల్లో పోయేదికాదు. ఇట్లొచ్చిన్నారు. కాకితో



కబురంపితే మరియమ్మే మీ ముంగిట్లో వాలేది"

అతను స్కూలుకు టైమైందని చెప్పి సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు. అనసూయమ్మతో ఎలా మాట్లాడాలో తెలియని భయం, భీతి, బెరుకు మరియమ్మ అత్త చెంచులమ్మది. అక్కడున్న ప్రతిక్షణం తను కుంగిపోతున్న అనుభూతి ఆమెది. అందుకే మనవరాల్ని ఎత్తుకుని పొరుగింటికి పెత్తనానికి వెళ్లింది.

చాప పరిచి అనసూయమ్మను కూర్చొబెట్టింది మరియమ్మ. "ఇంత దూరం వచ్చావు, అక్కా! ఇంట్లో మంచినీళ్ళయినా తాగుతావా? " అని సందేహిస్తూ అడిగింది.

"ఏం, మీరు 'చాయ్' తాగరా? "

అంతే! మరియమ్మ ఆనందం విహ్వాలమైంది. ఆమె తక్కువతనం అనుభూతి పొందే మనిషికాదు. అందరూ తనను తక్కువ కులపుదానివంటే కాబోసనుకుంది. కానీ అది ఆమె అంతరాలను తాకలేదు.

"అట్లాగే. రా. అక్కా! నీకు నా ఇల్లు చూపెడతాను"

నిజానికి అక్కడ చూడటానికేమీ లేదు. రెండు గదుల ఇల్లు. ఒకటి వంట గది, మరొకటి ముందుగది. ఆ ముందు గదిలో క్రైస్తవుల ఇళ్లల్లో సాధారణంగా కన్పించే ఏసుక్రీస్తు, మేరీమాతల పటాలు, ఇంగ్లీషు సూక్తులు రాసి ఉన్న అల్యూమినియం ప్లేట్లు ఉన్నాయి. ఓ కొంకికి శిలువ వేలాడుతున్నది. విచిత్రంగా తలుపు మూలకు, అందరికీ తేలికగా కన్పడని విధంగా వ్యస్త పాదముద్రాలంకృతుడు, గో బృందం పరివృతుడయిన గోపాలమూర్తి చిత్రపటం కూడా కన్పించింది.

మరియమ్మ 'చాయ్' పెట్టి తీసుకువచ్చి అనసూయమ్మకు ఇచ్చింది. రోజూ పెట్టే చాయే గానీ, ఇవాళ దాంట్లో ఆనందాన్నీ, స్నేహాన్నీ కూడా కలిపి తయారుచేసింది ఆమె.

"మీరు క్రైస్తవులు. హిందూ దేవతలను పూజిస్తారా? "

"నా పేరు నిజానికి మరియమ్మ కాదు. చుక్కమ్మ. మా అమ్మా, నాయనలు క్రైస్తవ మతం పుచ్చుకోలేదు. మా కులం ఒకటే. పెళ్ళికి మతం అడ్డు రాలేదు. పెళ్ళాం మొగుడి తోవ అనుసరించాలి. అందుకే నేను మా ఆయనతో, అత్త మామతో చర్చికి పోతాను. అందరూ నేను ఆ మతానికి చెందినదాన్నే అనుకుంటారు. ఆయనా అనుకుంటాడు. నేను గుడికి వెళ్ళినా, మమ్మల్ని లోపలికి రానీయరు. క్రీస్తు రానిస్తాడు. ఎప్పుడైనా గుడికి సమీపంగా వెళ్తే బయటనుంచే దేవుడికి మొక్కుకుంటాను. దేవుడి బొమ్మ తెచ్చి ఇంట్లో పెట్టుకోవటం మా ఆయనకు, అత్తమ్మకూ ఇష్టం లేదు. గట్టిగా కాదనటానికి మా అత్తమ్మకు భయం. మా ఆయన నాకు కష్టం కలుగుతుందని ఊరుకున్నాడు. అందుకే కృష్ణ మూర్తి ఆ మూల వేలాడుతున్నాడు. నాది ఏ దేవుడి మతమో నాకే తెలీదు"

అలా ఆమె చాలా సరళమైన మాటల్లో ఇవాల్టి కుహనా లౌకికవాదులకు భిన్నంగా అసలు సిసలు లౌకిక వాదాన్ని విన్పించింది.

"సరే నీ బట్టలు కుట్టే మిషను తియ్యి, నాకు నేర్పు" అంది అనసూయమ్మ.

"నువ్వు నేర్చుకుంటావా, అక్కా? "

"ఏం, ఎందుకు ఆశ్చర్యపోతావు? భర్త మార్గాన్ని భార్య అనుసరించాలని నీవే చెప్పావు. నేను విన్న మాటలను బట్టి నా భర్త సమాజానికి పనికి వచ్చే మనిషి తన భార్య కావాలనుకుంటాడు. ఆ పని కుట్టు మిషనుతో మొదలెడతాను. ఊర్కే వద్దులే. నీకు నేను భారత భాగవతాల కథలు విన్పిస్తాను. స్త్రీల పాటలు నేర్పి

స్తాను"

"నువ్వు పాటలు పాడుతావా అక్కా?"

"పాడుతాను, అంత బాగా రాదు"

అనసూయమ్మ పాడసాగింది. ఆమె గొంతు మధురమైంది. ఆమె కమనీయంగా పాడుతున్న పాట వింటున్న మరియమ్మ మనసు సంతోషంతో గిరికీలు కొట్టింది. స్త్రీల పాట, గజేంద్ర మోక్షం- విన్పించింది అనసూయమ్మ. మడుగులో దిగిన గజరాజును మొసలి పట్టింది. అతని భార్యలు తమ భర్తని కాపాడమని పరాత్పరుని కొలుస్తారు.

'మత్స్యమై జలధిలో జొచ్చి సోముకు ద్రుంచి
తెచ్చి చదువుల బ్రహ్మ కిచ్చినాడు
అచ్యుతా మీమీద చిత్తమ్ము నిలిపితిని
మత్స్యావతార మము కరుణించరే!'

అలా అనసూయమ్మ విష్ణువు పది అవతారాలను కీర్తించిన పడతుల కథను విన్పించింది. "పోతన గజరాజు భార్యల సంగతి పట్టించుకోలేదు. 'నీవే తప్ప నితః పరం బెరుగ' అని గజరాజు ప్రార్థిస్తే పరమాత్ముడు వచ్చి గజరాజును రక్షిస్తాడు. కానీ భర్త విపత్కర పరిస్థితిలో ఉంటే, స్త్రీలు ఊరుకోలేరు కదా! వాళ్లు విష్ణువును కీర్తించి, తమ భర్తను కాపాడమని వేడుకుంటారు. ఈ దృక్కోణాన్ని దృశ్యించారు. ఆ పాటకు కర్త్రీణులయిన ఆ అనామక స్త్రీలు. పాటెలా ఉంది?" అని అడిగింది అనసూయమ్మ.

"బాగుందమ్మా! నాకు ఆ పాటలు నేర్పు" అంది మరియమ్మ.

అనసూయమ్మ పాట పాడుతుంటే, ఆ పొరుగింటి స్త్రీలు వచ్చి విన్నారు. వారిలో హిందూ స్త్రీలూ ఉన్నారు. క్రైస్తవులూ ఉన్నారు. దొరసాని తమ పేటకు రావటమే అబ్బురం. ఆమె పాటలు పాడటం మరింత అబ్బురం. పొరుగువాళ్లతో పాటు వచ్చిన చెంచులమ్మకు ఈ సంరంభం నచ్చలేదు. ఏం చేయాలో తెలియక చూస్తుండిపోయింది. ఆ రోజుకు పాటలు ఆపి అనసూయమ్మ ఇంటికి బయలుదేరింది.




**అ**యితే, అనసూయమ్మ రాకపోకలు ఎక్కువ కాలం సాగలేదు. ఇరువర్గాల నుంచి ఆమెకు, మరియమ్మకు ఆక్షేపణలు ఎదురయ్యాయి. హరినారాయణరావు అక్కకు స్పష్టంగా చెప్పేశాడు. అలగాజనాల ఇళ్లకు వెళ్ళి తన పరువు తీయవద్దని, ఆమె తిరగటం తన మామగారి దృష్టికే వచ్చి తన పరువు పోయిందట!

తమ్ముడి మాటలకు అనసూయమ్మ సమాధానమివ్వలేదు. హరినారాయణరావే చెప్పసాగాడు. "మొన్నామధ్య అసెంబ్లీ సమావేశాల సందర్భంగా హైదరాబాదు వెళ్లాను కదా! అక్కడ బావగారు కన్పించాడు"

అతను బావగారు అనేసరికి అనసూయమ్మ ఒక్కసారిగా సచేతనమయింది.

"ఏ బావగారు?"

"ఇంకెవరు? ఎర్రమనాయుడు"

"ఎట్లా ఉన్నారు?"

"ఆయనకేం గుండులా ఉన్నాడు. మనిషిలో ఆ పిచ్చి తగ్గలేదు. తెలంగాణలో సాయుధ పోరాటం చేపట్టినప్పుడు ఇక్కడ గెరిల్లా స్క్వాడ్‌లలో కూడా పని చేశాడట! మనకు చాలా భూములు పోవడంలో ఆ

## మార్క్‌ట్వెయిన్ చతురోక్తులు



మార్క్‌ట్వెయిన్‌కు మరోపేరు నవ్వుల రాజు! ప్రతిమాటలో విరుపు, వ్యంగ్యం ఆయన ప్రత్యేకత!! ఈ నెల 'చతుర' పాఠకులకు ఆయన చతురోక్తులలో కొన్ని.

### అదే తేడా

**ఆం**గ్లేయులకు, అమెరికన్లకు తేడా ఏమిటని ఎవరో అడిగితే మార్క్‌ట్వెయిన్ జవాబిది:

'బ్రిటిష్‌వాడు గతంలో ఎవరైనా చేసిన పనినే తనూ చేస్తాడు. అమెరికావాడు గతంలో ఎవ్వరూ చేయని పనినే తనుచేస్తాడు'.

మహానుభావుడి హస్తం కూడా ఉంది. జాగీర్దార్లు, జమీందార్ల నుంచి గుంజుకున్న భూములను దరిద్ర రైతులకు దానం చేసి మన పాలక వర్గానికి ద్రోహం చేశాడు. స్వాతంత్ర్యం వచ్చాక కమ్యూనిస్టులపై నిషేధం విధించిన కాలంలో రెండు మూడేళ్ళు జెయిల్లో ఉన్నాడు. ఆ తర్వాత విశాలాంధ్ర పిచ్చి పట్టుకుంది. 1955 ఎన్నికల్లో ఆంధ్ర రాష్ట్ర శాసనసభకు కమ్యూనిస్టు పార్టీ తరపున పోటీ కూడా చేశాట్ట కాని ఓడిపోయాడు. తర్వాత ఏం చేశాడో స్పష్టంగా చెప్పలేదు. 1962లో కమ్యూనిస్టు పార్టీ రెండుగా చీలిపోయాక, ఈయన సిపిఐ (యమ్) పార్టీలో ఉండిపోయాడు. తరిమెల నాగిరెడ్డి గ్రూపు మనిషని విన్నాను. పార్టీవాళ్లు హైదరాబాదులో ఏదో మీటింగు పెట్టుకున్నారు. ఈయన దానికి అటెండు కావటానికి వచ్చాడు"

ఇంకేమన్నా తమ్ముడు చెప్తాడేమోనని ఎదురు చూసింది అనసూయమ్మ. తమ్ముడు చెప్పిన విశేషాలు ఆమెకు పట్టలేదు. అంతకంటే భిన్నమైనదేమైనా అతని నోటినుండి వస్తుందేమోనని చూసిన ఆమెకు నిరాశే మిగిలింది.

"ఆయన తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ ఎట్లా ఉన్నారట? " అడిగింది అనసూయమ్మ. 'ఆయన మళ్ళీ పెళ్ళి చేసుకున్నారా? ' అని ఆమె అడగలేక పోయింది.

"ఏమో అడగలేదు. వాళ్లెట్లా తగలడితే నాకేం? ఈయనకు యాభై ఐదేళ్లట! ఒక్కటి మాత్రం అన్నాడు. 'మీ అక్కకు మాత్రం న్యాయం చెయ్యలేక పోయానోయ్!' అని. ఆ మాటిన్నాక నాకు ఒళ్ళు మండిపోయిందనుకో. కంపరం కలిగింది. నాకింక ఆ మనిషితో మాట్లాడడం ఇష్టం లేక వచ్చేశాను. నువ్వెట్లా ఉన్నావని అడగ లేదు కనీసం! కట్టుకున్న పెళ్లానికి న్యాయం చెయ్యలేని మనిషి జనాలకు మంచి చేస్తాడట! నీ సంగతి నేనేం చెప్ప లేదు. అయినా నువ్వెట్టా తిరిగితే మాత్రం ఆయనకేం లెక్కా? కానీ, మేం పరువున్న మనుషులం! నీ ప్రవర్తన మార్చుకో..."

"పెద్దవాడివయ్యావురా, హరీ! అక్కకే నీతులు చెప్తున్నావు! ఆ పిల్ల ఇక్కడకు రావటానికి అభ్యంతరం చెప్పారు. కాదన లేదు. నేను వెళ్తున్నాను. అందుకూ అడ్డు చెప్తున్నావు. నాయన పోయాక, నాకు ఈ ఇంట్లో స్వాతంత్ర్యం కరువైంది"

"అలా అనకు అక్కా! ఈ ఇంట్లో నీ తర్వాతే ఎవరయినా. నువ్వు ఎవరినైనా పిల్చుకో. నువ్వు మాత్రం బయటికి వెళ్ల వద్దు. వేణుగోపాలస్వామి ఆలయానికి వెళ్లాలంటే చెప్పు. డ్రైవరు నిన్ను గుడికి తీసుకొస్తాడు. దేవిడీలో దక్షిణంవైపు వున్న మూడు గదులు నీకు కేటాయిస్తున్నాను. అక్కడ నీకెవరూ భంగం కలిగించరు. నీ

చదువు, పాటలు, పూజలు, వ్రతాలు నీ ఇష్టం..."

"ఇంటిలో వాటా పంచుతున్నావా? నాకెందుకురా నీ ఆస్తి, నాకెవరున్నారు? "

"అదేం మాట! నాయన ఆస్తి అంతా నీదే. నీ తర్వాతే నాది"

అక్కడ దేవదానం ఇంట్లోనూ ఇంచు మించు ఇలాంటి అభ్యంతరమే వ్యక్తమ యింది. ఇక్కడ మరియమ్మ అత్తమ్మ నాయకురాలి పాత్ర వహించింది.

"ఏందిరో, నీ పెళ్ళాం బాపన మతం పుచ్చుకుంటూ ఉన్నాది. ఆ పాటలేంది, పద్యాలేంది? పనిలేని ఆడోళ్లనందర్నీ జేర్చి కొంప చేపల మార్కెట్టు చేస్తున్నాది. ఇంట్లో పనీ పాటా లేదా? ముసల్దాన్ని! అది తప్పట్లు కొడ్తా దిక్కుమాలిన పాటలు పాడతా ఉంటే, నేను పని చేయ లేక చచ్చిపోతున్నాను. దాన్ని కట్టడి చేయ లేకపోతివో, నన్ను బూర్గంపాడు పంపెయ్యి. నా చావు నేను చస్తాను. ఇంట్లో పిల్లదాని ఆలనా పాలనా కూడా చూడదు. ఆయమ్మ వచ్చినాదంటే, నీ పెళ్లానికి ఒంటిమీద బట్ట నిలవదు. ఆ తర్వాత నీ ఇష్టం!" అని కొడుక్కు ఫిర్యాదు చేసింది.

"అట్లా మాట్లాడకత్తా. నేనేం పనులు చెయ్యటం లేదు? ఇంటి పనులకు అడ్డం వస్తుందనే మేము మధ్యాహ్నం పెట్టుకుం టున్నాము గోష్టి" అంది మరియమ్మ.

"ఏందే అది? కొత్త మాటలు నేర్చుకుం టున్నావు? "

"సద్గోష్టి, అంటే మంచి మాటలు చెప్పు కోవటానికి కలుసుకోటం!"

"ఏం మంచి మాటలు! హిందూ దేవ తల పాటలు ఆమె పాడుతుంటే మీరు తాళం వేస్తూ అందుకోవటమా! మొన్న పాస్టర్ కన్పించి, ఇలాంటివి క్రైస్తవుల ఇండ్లల్లో కొనసాగటానికి వీలు లేదన్నాడు. కావాలంటే మనోళ్లని పిల్చుకుని క్రీస్తు పాటలు పాడుకో. ఆమెను పిలవొద్దు. ఆ పాటలు, పద్యాలు వినవద్దు. ఆc, ఆ హిందూ దేవుడి బొమ్మ కూడా తీసిపా రెయ్యి. ఇప్పటిదాకా సహిస్తూ ఊరుకుం టిని. నీ ఆగడం మితిమీరుతోంది" అని దేవదానం చివాట్లు వేశాడు.

మరియమ్మ భర్తతో వాగ్వాదానికి దిగ లేదు గానీ, భర్త కట్టడి ఆమెకు అన్యాయ మన్పించింది. అనసూయమ్మను ఎలా తన ఇంటికి రావద్దని చెప్పాలో ఆమెకు తెలియ లేదు. అయితే ఆమెకు ఆ ఇబ్బంది కల్పిం చకుండా అనసూయమ్మే ఆమె ఇంటికి రావడం మానుకుంది. అమ్మలక్కలు "దొరసానమ్మ రావటం లేదేం? " అని మరి యమ్మను అడగసాగారు. ఏం చెప్పాలో తోచని స్థితిలో ఉన్న మరియమ్మకు అన సూయమ్మ నుంచి తన ఇంటికి రమ్మని కబురు వచ్చింది. ఆమె భయపడుతూనే భర్తకు ఆ మాట చెప్పింది.

తల్లినుంచి, పాస్టర్ నుంచి వత్తిడి రావ డంతో అతను ఏం చేయలేక భార్యకలా నిక్కచ్చిగా చెప్పాడు. నిజానికి తన ఇంట్లో క్రైస్తవ వ్యతిరేక కార్యక్రమాలు జరగటం తనకూ ఇష్టం లేకపోయినా, భార్యమీద ప్రేమ వల్ల చూసీ చూడనట్లు ఊరుకు న్నాడు. అతనికి మరో భయం కూడా ఉంది. తను ఉద్యోగరీత్యా పొరుగూరు వచ్చినవాడు. దొరలమీద కత్తిగట్టడం అతను సాహసించని పని. దొరసానమ్మ తల్చుకుంటే ఆ ఊళ్ళో తన బతుకు దుర్భరం చెయ్యగలదు. అందుకే "సరే వెళ్ళు. అక్కడ నువ్వు ఏం చేసినా, ఆ ఆగం మాత్రం మన కొంపలో జరగనివ్వ వద్దు. పాస్టరు వేసిన చివాట్లకు నేను ముఖం తిప్పుకోలేక పోయాను" అన్నాడు దేవదానం భార్యతో.

అనసూయమ్మకు ఏం చెప్పాలో తోచక



కొట్టుమిట్టాడుతూ, ఆమె ఇంటికి వెళ్లింది మరియమ్మ. అయితే, మరియమ్మ చెప్పక పోయినా ఆమె ముఖం చూసి ఏం జరిగి ఉంటుందో గ్రహించింది అనసూయమ్మ.

"నువ్వు చెప్పొద్దులే. క్రైస్తవ సమాజం కూడా మనమీద కత్తిగట్టిందన్న మాట. ఇక్కడ పరువుగల మా దొరల సమాజమూ నేను బయటకు రావటాన్ని నిషేధించింది. నేను దాన్ని లెక్కచేయను. ప్రతిఘటిస్తాను. నువ్వు రోజూ ఇక్కడికిరా. నీ స్నేహితురాళ్లని కూడా తీసుకురా. ఇప్పటిదాకా మనం ఇతర్ల పరువు కోసం, ఆలోచనల కోసం బతుకుతున్నాం. మన కోసం కూడా మనం బతకాలి. సమాజం కోసం కూడా బతకాలి" అంది ఆమె.

తమ్ముడి మామగారిక్కూడా తను బయటికి వెళ్లటం చిన్నతనమనిపించిందని తెలిశాక తన బతుకులోని హైన్యపు లోతెంతో ఆమెకర్థమైంది. మరియమ్మకు అనసూయమ్మ పట్ల గాఢమైన విశ్వాసం, ప్రేమ ఉన్నాయి. తను చుట్టూ గిరిగీసుకున్న పరిధి ఆమెకు పూర్తిగా అవగాహన కాకపోయినా, అందులోని అన్యాయం, అసమానత్వం అనుభూతమయ్యాయి. ఆరోజు పాటలు లేవు. తాము ఏం చెయ్యాలన్న విషయంలో సుదీర్ఘంగా ఆలోచించారు. కిందివర్గాల మహిళలు కూలీ నాలీ చేసుకుని బ్రతికే స్త్రీలు వ్యవసాయపు ఋతువులో తప్ప ఏడాది పొడవునా పనిపాటల్లేక అలమటించటం గమనించింది అనసూయమ్మ. ముందుగా కుట్టు శిక్షణా తరగతులను మరియమ్మ ఆధ్వర్యంలో నడపాలని నిర్ణయించుకున్నారు.

అందుకు ముందుగా కనీసం పది కుట్టు మిషన్లయినా కొనాలి. డబ్బు కావాలి. ముందుగా మహిళలను జాగృతం చెయ్యాలి. తమ్ముడు బయటకు వెళ్ళకూడదని ఆంక్ష విధించినా అనసూయమ్మ లెక్క చెయ్యలేదు. మరియమ్మతో వచ్చి దళిత వాడల్లో తిరిగింది. దొరసానమ్మ తమ ఇండ్లకు రావడం పరమానందమైంది ఆ స్త్రీలకు. ఆమె ఆలోచనలకు వెంటనే అంగీకరించారు వాళ్ళు. ఏదో ఒకటి నేర్చుకోవాలి, పైకి రావాలి, డబ్బు సంపాదించాలి, తమ కాళ్ళపై తాము నిలబడగలగాలి అన్న ఉత్సుకత వాళ్ళలో ఉంది. "ఆఁ, మనమేం చెయ్యగలంలే" అని నిరుత్సాహపడిన మహిళలూ ఉన్నారు. వాళ్ళల్లో చాలామంది సుమారుగా నిరక్షరకుక్షులే. వాళ్ళకు ముందుగా కావల్సింది చదువు కాదు. తమ కాళ్ళపై తాము నిలబడగలిగే సామర్థ్యం. అలా సుమారుగా ఓ రెండు మూడు నెలలు దళితవాడలు, వెనుకబడిన వర్గాల వాడల్లోను తిరగటం వల్ల అనసూయమ్మకు కలిగింది ఆ అభిప్రాయం. తను ఊహించినదానికంటే ఎన్నో రెట్లుగా మూఢాభిప్రాయాలూ ప్రచలితమై ఉన్నట్లు ఆమె కనుగొంది.

అయితే ముందుగా డబ్బు కావాలి. ఆమె సర్పంచి శౌరయ్యని పిలిపించింది. అతనప్పటికే అనసూయమ్మ చేపట్టిన కార్యం గురించి విని ఉన్నాడు. ఆమె అతనికి తాము చేయదల్చుకున్న పనిని గూర్చి విపులంగా చెప్పి, "మీ పంచాయితీ ఆఫీసు నుంచి మా సంస్థకు కుట్టుమిషన్లు కొనిపెట్టగలవేమో ఆలోచించు. పంచాయతీ ఆఫీసులో ఓ గది కూడా ఖాళీ చేయించి మాకివ్వాలి. మిషన్లు గదిలో పెట్టుకుంటాం. కింది వరండాలో తరగతి నిర్వహిస్తాం" అని చెప్పింది.

"అట్లనే. నా వల్ల ఏమయితదో చూస్తాను, దొరసానీ!" అని చెప్పి వెళ్ళిన వాడు ఏ కబురూ చెప్పటానికి తిరిగి రాలేదు. అనసూయమ్మ ఏ విషయం తేలిగ్గా వదిలే వ్యక్తి కాదు. వారం రోజులాగి తను చెప్పిన విషయం ఏం చేశావని

కబురు చేస్తే, పంచాయితీ సభ్యులు కుట్టు మిషన్లు కొని మరో సంస్థకు అప్పగించటానికి రూల్సు ఒప్పుకోవని అన్నారని, అంత డబ్బు తమ వద్ద లేదనీ, పంచాయితీ ఆఫీసులో టైలరింగ్ శిక్షణ తరగతులు నిర్వహించటానికి సభ్యులు నిరాకరించారనీ తను పంపిన పాలేరు వెంకన్నకు సమాధానం చెప్పి పంపాడు శౌరయ్య.

శౌరయ్య అలా చెప్పి పంపటానికి కారణమెవ్వరో ఆమె వెనువెంటనే గ్రహించింది. తన తమ్ముడు హరినారాయణ రావు చేయించిన పనే అది. దొరల పరువు ప్రతిష్ఠలు కాపాడుకునే ప్రయత్నమే. అయితే అనసూయమ్మ వెనక్కు తగ్గలేదు. ఓరోజు తన పెద్ద మేనల్లుడు, గోపాలకిషన్‌రావును వెంట పెట్టుకొని ఖమ్మం వెళ్ళి, తన కాసులపేరు అమ్మేసి, పది కుట్టుమిషన్లు కొని, రెండు మూడు రోజుల్లో గంధసిరికి పంపవలసిందని ఆదేశమిచ్చి తిరిగివచ్చింది.

మరియమ్మతో కలిసి వీధుల్లో రెండు రోజులు తిరిగాక ఓ యజమాని తన ఇంట్లో రెండు గదులు, వరండా అద్దెకివ్వడానికి అంగీకరించాడు. నెలకు అద్దె యాభై రూపాయలు. కాసులపేరు అమ్మగా, కుట్టుమిషన్ల కిందా, మిగతా పరికరాల కొనుగోలుకు పోయాక ఆమె వద్ద సుమారుగా ఐదువందల రూపాయలు మాత్రం మిగిలాయి. ఇంక ఏం ఖర్చులుంటాయో ఆమెకు తెలియదు. మిగిలిన డబ్బుతో ఆర్నెల్లు అద్దె మాత్రం చెల్లించగలదు. 'చూద్దాం, తర్వాత ఆపైవాడే ఉన్నాడు. ఇంకా తన నగలున్నాయి' అనుకుంది అనసూయమ్మ.

అలా మొదలైంది టైలరింగ్ శిక్షణా సంస్థ. జీతంలేని టీచరు మరియమ్మ. మొదటి విద్యార్థిని అనసూయమ్మ. తామూ టైలరింగ్ శిక్షణకొస్తామని మొదట్లో కబుర్లు చెప్పిన మహిళల్లో చాలా

## కొత్తగాలి...

**నిజానికి**
**కోకిలపాడదు**
**చిగురుగర్భంలో**
**పాటను వెలికితీస్తుంది**

**–ఎస్.ఆర్.భల్లం,** తాడేపల్లిగూడెం

మంది శిక్షణ క్లాసులకు హాజరు కాలేదు. ముగ్గురు విద్యార్థినులతో ప్రారంభమైన టైలరింగ్ శిక్షణా సంస్థ క్రమంగా పుంజుకోసాగింది. అందుకోసం శిక్షణ పూర్తిచేసిన వారికి కుట్టుమిషను ఊరికే ఇస్తామని చెప్పింది అనసూయమ్మ.

ఇంట్లో అనసూయమ్మకు నిరాదరణ అధికమవసాగింది. మరదలు విమల ఆమెతో మాట్లాడడం మానేసింది. పైగా ఆమె వినేటట్లు, "అంతా ఊరిని ఉద్ధరించేవారే. ఇంట్లో పనిపాటలు ఎవరికీ పట్టవు. నేను మాత్రం ఎంతకాలం చేసిచావను. నా రెక్కలు విరిగిపోతున్నాయి" అనేది.

నిజానికి విమలకి ఇంట్లో చేసే పనేమీ లేదు. వంట చెయ్యటానికి వంటావిడ ఉంది. పైపనికి దాసీది ఉంది. బయట పన్లు చెయ్యటానికి ఇద్దరు నౌకర్లు ఉన్నారు. ఇంట్లో పూజలు, వ్రతాలు నిర్వహించటానికి రోజూ రంగాచారి వచ్చివెళతాడు.

శిక్షణా సంస్థ ప్రారంభమైంది గానీ, అనసూయమ్మకు మరిన్ని చిక్కులు ఎదురయ్యాయి. చెంచులమ్మకు కోడల్ని ఇంటినుంచి ఊరిని ఉద్ధరించటానికి పంపటం ఇష్టంలేదు. రోజూ ఇంట్లో గోల చెయ్యసాగింది. సూటీపోటీ మాటలనసాగింది. "నువ్వు ఊళ్ళట్టి తిరుగుతూ ఉంటే నేను నీ కూతుర్ని సాకలేను. ముసలిముండను

కొత్తగాలి...

**ఆకాశంలో పసిపాప**
**కిలుక్కున నవ్వినట్లు**
**మెరిసింది మెరుపు**

**–ఎ. సూర్యప్రకాశ్,** సికింద్రాబాద్

నాకు ఒంట్లో ఓపిక లేదు. నీ కూతురు గడుగ్గాయి. దాన్ని పట్టటం నావల్ల కాదు" అనేది. ఆ సతాయింపు పడలేక రేణుకను తనతోపాటు టైలరింగ్ క్లాసుకు తీసుకొచ్చేది మరియమ్మ.

మధ్యాహ్నం ఒంటిగంట నుంచి ప్రారంభమైన శిక్షణా తరగతి రెండు గంటలు కొనసాగేది. భర్త స్కూలు నుంచి తిరిగి వచ్చే సమయానికి మరియమ్మ ఇంటికి వెళ్ళేది. అనసూయమ్మకు కుట్టుపని నేర్చుకోవటం ప్రధానం కాదు. మరియమ్మ కుట్టుపని నేర్పటంలో నిమగ్నమైతే, అనసూయమ్మ పనికి భంగం కలగకుండా రేణుకను ఆడించేది. ఆ పిల్ల ముద్దుమాటలు చెప్తూంటే వింటూ ముచ్చటగా కాలం గడిపేది. ఆ సమయంలో ఆమెకు ఆ పిల్లతో ఎంతో సాన్నిహిత్యం పెరిగింది. తన ఇంట్లోని పిల్లలతో ఆమెకంత సాన్నిహిత్యం కలగలేదు. వాళ్ళ లోకం వేరు. పెరిగిన పిల్లలెలాగో ఇంటిపట్టున ఉండటం లేదు. హైదరాబాద్, ఖమ్మంలలో ఉంటున్నారు. ఒక్క గోపాలకిషన్‌రావుతో ఆమెకు అధిక సాన్నిహిత్యం. ఆ పిల్లవాడు హైదరాబాద్‌లో మెడిసిన్ చదువుతూ ఎప్పుడోగానీ గంధసిరికి వచ్చేవాడు కాదు.

మరియమ్మ కూతుర్ని తనతో తీసుకెళ్తున్నందువల్ల చెంచులమ్మ కోడల్ని సతాయించటం ఆపలేదు. కొడుకు దేవదానానికి ఎక్కించసాగింది. "అది బాపన మతంలో కలిసిపోతుంది. తరువాత నీ ఇష్టం" అనేది.

"పిల్లలను నేను సాకలేనని అన్నానని, నన్ను సతాయించటానికని చెప్పి దాన్ని ఎండలో తీసుకువెళ్తోంది. పిల్ల వడలిపోయి ఇంటికి వస్తా ఉంది. అయినా, ఏందిరా నీ పెళ్ళాం యవ్వారం? లచ్చనంగా కాపురం చేసుకోక ఈ పన్లేంది? నువ్వు వట్టి వాజెమ్మవు! నీ అలుసు చూసుకునే అది తైతక్కలాడతా ఉంది" అని కొడుకుని తిట్టేది.

దేవదానానికి భార్య చేసే పనులు నచ్చకపోయినా, దొరసానికి కోపం వస్తుందేమోనని కొంతకాలం పస్తాయించాడు. అయితే దొర హరినారాయణరావుకూ అక్క ఊరి ఉద్ధరింపు కార్యక్రమాలు ఇష్టంలేదని చూచాయగా తెల్సాక, ఇంక తను భార్యను కట్టడి చేయసాగాడు.

"నీకు హిందూ ఆడోళ్ళతో పనేందే? చూస్తే కొన్నాళ్ళలో హిందూమతంలోకి చేరిపోయేట్టున్నావు. పాస్టరుక్కూడా నీ చర్యలు నచ్చలేదు. 'నీ పెళ్ళాన్ని కంట్రోలు చెయ్యి' అని చెప్పిండు" అన్నాడు భార్యతో.

తన విషయంలో జోక్యం చేసుకోవటానికి పాస్టరెవరని ఆమె అనలేకపోయింది. ఏ మతపు వేళ్ళయినా చాలా లోతుగా ఉంటాయి. పూజారుల పలుకుబడి అంచనా వేయదగింది కాదు. అక్షరాస్యత అంటని సమాజంలో, జీవితపు అన్ని కోణాల్లోనూ జోక్యం చేసుకోగలిగే అధికారం వాళ్ళకుంటుంది. సమాజంలోని వ్యక్తులందరూ అజ్ఞాతంగానే ఆ అధికారానికి తలొగ్గుతారు.

"పాస్టరు సంగతట్లుంచు. నీ సంగతేందో ముందు చెప్పు" అంది మరియమ్మ మొదటిసారిగా ప్రతిఘటిస్తూ.

"ఏందే మొగుణ్ణే ఎదిరిస్తున్నావు?

# మిస్టర్ ఇన్వెంటర్







మనం కెచప్ బాటిల్ ఉపయోగించినప్పుడల్లా స్టేన్లీ మేసన్‌కి కృతజ్ఞతలు తెలియజేసుకోవాలి. కెచప్ బయటకి వలకకుండా నొక్కితే కొద్ది కొద్దిగా మాత్రమే బయటికి వచ్చే కెచప్ బాటిల్స్ (ఖరీదైన రెస్టారెంట్స్‌లో వీటిని చూడచ్చు) మేసన్ కనిపెట్టాడు. అదేకాదు ఇళ్ళల్లో ఉపయోగించుకునే అనేక సౌకర్యవంతమైన 100కి పైగా ప్రొడక్ట్‌లని 77 ఏళ్ళ మేసన్ కనిపెట్టాడు. 60 పేటెంట్స్ అతని పేరున ఉన్నాయి.

చక్కగా సపోర్ట్ చేసే బ్రాలు, పిజ్జా పేకింగ్ బాక్స్, మైక్రోవేవ్ సేఫ్ కుక్‌వేర్, బేబీ డయాపర్స్, గోనిటరి నాప్కిన్స్ ఇంకా ఎన్నో...

సిమ్‌కో పేర ప్రొడక్ట్ డెవలప్‌మెంట్ కంపెనీ నడిపే మేసన్ సహాయాన్ని పెద్ద పెద్ద కంపెనీలు తరచూ తీసుకుంటుంటాయి. ఇన్వెంటర్స్ డైజెస్ట్ అనే పత్రిక అనేకసార్లు మేసన్‌ని 'బెస్ట్ ఇన్వెంటర్ ఆఫ్ ది ఇయర్'గా ఎన్నుకుంది.

"అందుకు కారణం నేను రోజుకి పన్నెండు గంటల చొప్పున వారంలో ఒక్కోసారి ఏడు రోజులు పనిచేస్తూంటాను" అంటాడు మేసన్.

పాస్టరు సంగతి వదిలెయ్యాలా? నీ తప్పుకు ఎవడు జవాబుదారీ! సైతాను పట్టినట్టు మాట్లాడతా వుండావు!" అని గయ్యిమని లేచింది చెంచులమ్మ.

"అత్తమ్మా! తప్పుడు అర్థాలు తియ్యొద్దు. నేనేం మొగుడిని ఎదిరించటం లేదు, తప్పుడు తిరుగుళ్ళు తిరగటం లేదు" అంది మరియమ్మ.

"నేన్నీకప్పుడే చెప్పినా. దాన్ని పెళ్ళి చేసుకోవద్దురా అన్నా. మన మతంలో పిల్లలు లేరా? దొరికింది అందాల రాశి! ఏడపోతదో అని కట్టుకున్నావు. బొమ్మ తైతక్కలాడతా ఉంది. మురిసిపోతా చూస్తా ఉండు."

"నువ్వు కుట్టు క్లాసులకు వెళ్ళవద్దు" అన్నాడు చివరగా దేవదానం.

"ఆయమ్మను నేను నట్టేట్లో ముంచలేను"

"చంపేస్తాను, నా మాట వినకుంటే"

"నువ్వు చంపినా, చీరినా నేను వెళ్ళక మానను"

అంతే, భార్యను చాచి లెంపకాయ కొట్టాడు దేవదానం. మొదటిసారిగా భర్త చేతిలో దెబ్బలు తిన్న మరియమ్మ బిక్కచచ్చి కూలబడిపోయింది.

"ఒక్క దెబ్బకు సైతాను వదలదురా. ఇంకా నాలుగు తగిలియ్యి" అని ప్రోత్సహించింది చెంచులమ్మ.

ఆ గలాటా చూసిన రేణుక పెద్దగా ఏడవసాగింది. దేవదానానికి కంపరం కలిగింది. అతనికి భార్యంటే ఎంతో ఇష్టం. అలాంటి దానిపై చేయి చేసుకున్నందుకు పశ్చాత్తాపడసాగాడు. కానీ, తను బతికే సమాజ యంత్రంలో ఓ చిన్న చక్రం. అది పై వత్తిడికి పనిచెయ్యక తప్పదు.

"చాల్లే! ఇంక మాట్లాడకు. అది ఇల్లు దాటి వెళ్ళదు" అని రాత్రి పాఠశాలకు వెళ్ళి

## మాటకు మాట..

**మార్క్‌ట్వెయిన్‌**కు ఓసారి ఏదో పుస్తకం అవసరమై పొరుగింటి పెద్దమనిషిని అడిగాడు. దానికి ఆయన తాను పుస్తకాలను ఇంటికి ఇవ్వనని, కావాలంటే- తన ఇంట్లోనే కూర్చొని చదువుకుని వెళ్లవచ్చని జవాబిచ్చాడు. కొద్దిరోజుల తర్వాత పొరుగింటాయనకు మార్క్‌ట్వెయిన్‌ ఇంటిలోని లాన్‌మొవర్‌ (గడ్డిని కత్తిరించే యంత్రం) అవసరమైంది. అతను వచ్చి అడిగితే ట్వేన్‌, 'నిరభ్యంతరంగా వాడుకోండి.. కానీ ఇక్కడే నా లాన్‌ మీదే దానిని ఉపయోగించుకుని వెళ్లవచ్చు' అని తిప్పికొట్టాడు.



పోయాడు దేవదానం.

రెండ్రోజులుగా మరియమ్మ ట్రైనింగ్‌ సెంటరుకు రాకపోయేసరికి అనసూయమ్మ ఆమె ఇంటికి వెళ్ళింది. ముందు గదిలోనే అడ్డుగా కూర్చుని ఉంది చెంచులమ్మ. మరియమ్మకు నెలకు యాభై రూపాయలు ఇద్దామనుకుంటున్నానని అనసూయమ్మ చెప్పేసరికి, డబ్బు ఆశతో చెంచులమ్మకున్న అభ్యంతరాలన్నీ పటాపంచలయ్యాయి.

ఇక్కడి సమస్యను తేలిగ్గా పరిష్కరించగలిగినా, దేవిడీ వ్యతిరేకతను పరిష్కరించటం అంత తేలికవలేదు అనసూయమ్మకు.

శిక్షణా సంస్థ ప్రారంభించాక, తను ఊహించని మరిన్ని ఆర్థిక సమస్యలు ఆమెను చుట్టుబెట్టాయి. చేతిలో ఉన్న డబ్బు క్షణాల్లో ఖర్చయిపోయింది. డబ్బు సమకూర్చుకోవటానికి తన గాజులు అమ్ముదామనుకున్న అనసూయమ్మకు మరదలు విమల నుంచి వ్యతిరేకత వ్యక్తమయింది. ఓ రోజు ఆమె భోజనాల సమయంలో రణరంగమే సృష్టించింది.

వంటమనిషి మాంసం కూడా వడ్డించబోతే, "నాకు వద్దు, నేను మాంసాహారం మానేశాను" అంది అనసూయమ్మ.

"ఏంటో వింతబుద్ధులు పుట్టుకొస్తున్నాయి మనుషులకు! ఇవాళ మాంసాహారాన్ని త్యజిస్తారు. రేపు ఇంటినీ, మర్నాడు బంధువుల్నీ, పుట్టి పెరిగిన వాతావరణాన్నీ త్యజిస్తారు. ఉన్నాయిగా నగలు! ఏం త్యజించటానికయినా అవి మనిషికి దన్నునిస్తాయి" అంది విమల.

అనసూయమ్మేం మాట్లాడలేదు. హరినారాయణరావు కలగజేసుకోలేదు. సెలవులకు గంధసిరికి వచ్చిన గోపాలకిషన్‌రావు అడిగాడు. "ఏందత్తా! నగలు అమ్మే ఖర్మ నీకేమొచ్చింది! నీకు డబ్బులు కావాలంటే నాయన ఇవ్వడూ? " అని.

"ఎందుకివ్వరూ? ఇస్తారు. మీ తాత శిబిచక్రవర్తి. మీ నాయన అపర దానకర్ణుడు. వారి చేతికి ఎముక లేదు. బతికున్న రోజుల్లో మీ తాత ఉన్నదంతా ఊరోళ్లకు దోచిపెట్టాడు. ఆయన గారాలపట్టి చేతికి ఎదురులేదు. నగలు అమ్మేస్తారు! టైలరింగ్‌ ట్రయినింగ్‌ సెంటర్లు నడుపుతారు! దళిత స్త్రీ జనోద్ధరణమంటూ కొంపలు పట్టుకు తిరుగుతారు! అసలు నగలు అమ్మే హక్కు ఆమెకెవరిచ్చారు? అది ఉమ్మడి సొత్తు. ఆమెకెవరినీ అడగాల్సిన పనిలేదు. మీ నాయనకు అక్కగారంటే వల్లమాలిన గౌరవం. ఆమె ఏం చేసినా కాదనటానికి ఆయనకు నోరు రాదు. వెలమ దొరల పరువు, ప్రతిష్టలు గంగలో కలవనీ! నేను మాత్రం నోరు తెరవకూడదు. ఈ ఇంట్లో అందరికీ నోరు మెదపక పనిచేసే దాసీదాన్ని నేనొక్కత్తే దొరికాను" అంది గయ్యిమని లేస్తూ.

అనసూయమ్మ మరదలుతో ఏం మాట్లా

డలేదు. తమ్ముడివంక తిరిగి, "ఏరా, హరీ! నా నగలు నావి కావా? నేను వాటిని అమ్ముకోకూడదా? " అని అడిగింది.

"ఎవరు కాదన్నారు? దిక్కుమాలిన దీన జనోద్ధరణమంటూ వాటిని అమ్మొద్దనే మీ మరదలు చెప్పేది. అందులో తప్పేం ఉంది? " అన్నాడు హరినారాయణరావు తప్పుక.

ఇంక మాట్లాడలేదు అనసూయమ్మ. భోజనం పూర్తిచేసి లేచి వెళ్లిపోయింది. అక్కకు కోపం వచ్చిందని గ్రహించాడు కానీ అతను మరేం మాట్లాడలేకపోయాడు. ఆమె తన గదిలోకి వెళ్లి తన నగలన్నీ తీసి పెద్ద మూటగట్టి వంటగదిలోకి వచ్చింది. అంతకుముందు ఏం మాటలు జరిగాయో ఆమెకు తెలియదు. అనసూయమ్మ గుమ్మం దాపుకొచ్చేసరికి విమల అంటోంది.

"సొంత తోడబుట్టినదయితే తమ్ముడి మాట కాదని, ఇష్టం వచ్చినట్టు ఊరుపట్టి తిరగదు. సవితి అక్క! ఆమెకు తమ్ముడి పేరు ప్రతిష్ఠలేం పట్టాయి! తన సంసారం నాశనం చేసుకుంది. నా సంసారం నాశనం చెయ్యటానికి సిద్ధపడింది."

వెనక అలికిడి విని, "ఉష్... మాట్లాడకు... అక్క వస్తున్నట్టుంది" అన్నాడు హరినారాయణరావు.

అనసూయమ్మ వంటగదిలోకి వచ్చి తమ్ముడి పక్కన నగల మూట పెట్టి, "అవునురా, హరీ! నేను నీ సవితి అక్కనే. నీ పరువు ప్రతిష్టలు తీయటమే నా పని. అందుకే కృషి చేస్తున్నాను. నా సంసారం ఎలాగో నేను విధ్వంసం చేసుకున్నాను. నీ భార్యంత తెలివితేటలు నాకు లేవు. నేనేం చెయ్యను. దేవుడిచ్చిన బుద్ధి! ఇది పుడకల తోగానీ పోదు. స్వయానా తోడబుట్టిన దానికి ఉండే ప్రేమ నాకు నీమీద లేకపోయినా, మనం చిన్నప్పటినుంచి కలిసి పెరిగాం. నీ భార్య చెప్పిన మాట నిజమే. నగలు ఉమ్మడి ఆస్తి. ఇప్పటిదాకా అవి నావన్న భ్రమలో ఉన్నాను. కాదని తెల్సి వచ్చింది. నా మొగుడు నాకు ఇచ్చిందేం లేదు. ఇవాళ తెల్సివస్తోంది నా దారిద్ర్యం ఎంత గొప్పదో! అవును. నేను ఇంటిని త్యజిస్తున్నాను. రెండు రోజుల సమయమివ్వు. నేను ఆలోచించుకోవాలి ఏం చెయ్యాలో. ఆ తర్వాత ఒక్కరోజు కూడా నీ ఇంట్లో ఉండను. నీ దొరతనం గంగ పాలు కాకుండా కాపాడుకో. నా వల్ల అయిన అపచారానికి నన్ను క్షమించు" అని గిరుక్కున తిరిగి తన గదిలోకి వెళ్లిపోయింది అనసూయమ్మ.

ఇంత ప్రతిఘటన అక్కనుంచి వస్తుందని హరినారాయణరావు ఊహించలేదు. వాళ్లు సవతి అక్కాతమ్ముళ్లుగా ఎప్పుడూ పెరగలేదు. అక్కకు తనంటే ఎంత ప్రేమో అతనికి తెల్సు. తన బాల్యం అతనికి బాగా గుర్తు. తన తల్లి ఇంటి విషయాలేం పట్టించుకునేది కాదు. తన సంతోషాలు, తన సరదాలు తనవి. నిజానికి అక్క స్నేహంలోనే ఇతను పెరిగాడు. అలాంటి అక్క ఇంటినుంచి వెళ్ళిపోతానని అనగానే అతని వెన్నుమీద మిన్ను విరిగి పడినట్లయింది. అతనికి భోజనం సహించలేదు. పళ్ళెంలో చెయ్యి కడుక్కుని లేచి వెంటనే అక్క గదిలోకి వెళ్ళిపోయాడు.

ఆమె గదులన్నీ నిరాలంకారంగా ఉన్నాయి. ఎక్కడా ఒక్క సోఫాగానీ, కుర్చీగానీ లేదు. అలగావాళ్లను ఇంటిలో చేరుస్తున్నదనీ, ఇల్లు మైలపడిపోతోందనీ మరదలు వాటినన్నింటిని మిగతా గదులకు తరలింపచేసింది. భర్త వుండే వైధవ్యం అనుభవించే స్త్రీ కనుక, అనసూయమ్మ మంచం, పరుపు మీద ఏనాడూ శయనించేది కాదు. కనుక వాటి ప్రస్తావనే ఆమె గదిలో లేదు. ఓ అలమరాలో ఆమె చదు



వుకునే భారత భాగవతాది గ్రంథాలు ఉన్నాయి. కిటికీ పక్కన పరిచిన చాప మీద నిస్తేజంగా కూర్చుని ఉంది అనసూయమ్మ, తమ్ముడు ఆ గదిలోకి ప్రవేశించేసరికి.

దారిద్ర్యం తాండవిస్తున్న ఆ గది చూసేసరికి హరినారాయణరావు గుండె దేవుకుపోయింది. అతనెప్పుడూ అక్క గదిలోకి వచ్చినవాడు కాదు. ఆమె ఎలా బతుకుతుందో తెల్సుకున్నవాడు కాదు. బయటి దొరతనం, రాజకీయాలతోనే అతనికి సరిపోయేది. అతను వస్తూనే అక్క కాళ్లమీద పడిపోయాడు.

"అక్కా! నన్ను క్షమించు. నేను పాపం చేశాను" అంటూ భోరున ఏడ్చాడు.

"ఇదేమిటిరా, హరీ! ఇప్పుడేమయింది, లే" అంది ఆమె తమ్ముడిని పట్టి లేవదీయబోతూ.

"నువ్వు ఈ ఇంట్లోనుండి వెళ్ళిపోనని మాట ఇస్తేనే నేను లేస్తాను. ఈ ఇల్లు నాదా? నాయనది. అంటే నీదీ. నువ్వు బయటికెళ్లి ఎట్లా బతుకుతావు! నీకు ఎలాంటి పరిస్థితి దాపురించిందో తల్చుకుంటేనే నాకు కంపరం కలుగుతోంది"



నగలతో పనిలేదు. ఆ విషయం నేనెప్పుడో గ్రహించవల్సింది. నేను నీ ఇంట్లో ఉండా లనుకుంటే, నువ్వు వాటిని నాకు తిరిగి ఇవ్వవొద్దు. నిజానికి నాకెవరిమీద కోపం లేదు"

ఆ నగలు తీసుకోకపోవడం ఆమెకెంత బలవత్తర విషయమో అతనికర్థమైంది. మరి బలవంతం చెయ్యలేదు. "నగలు అమ్మబోయావంటే నీకు ఖర్చులు ఉన్నాయి. ఆ విషయమే నేను మరిచాను. కిషన్‌తో డబ్బు పంపిస్తాను వాడుకో.



అన్నాడు.

"సర్లే, వెళ్లనులే. నువ్వు లే" అంది అనసూయమ్మ తమ్ముడి జుట్టులోనికి చెయ్యి జొనిపి, స్నేహపూర్వకంగా నిమురుతూ.

అతడు లేచి కూర్చున్నాడు. ఆమె చేతికి నగల మూట ఇస్తూ, "ఇవి నీవి. ఉమ్మడి సొత్తు కాదు. ఆడబిడ్డకు తండ్రిగానీ, తోబుట్టువుగానీ ఇచ్చేది. అవి వాపసు చేసి నన్ను అవమానపర్చకు" అన్నాడు హరినారాయణరావు.

"వద్దు. ఆ నగలు నాకు వద్దు. విధవకు చాలకపోతే అడుగు. నీకిచ్చేది నీ డబ్బే, నాయన డబ్బు. నాది కాదు. నువ్వు కాదనవద్దు" అన్నాడు. ఆమె అందుకంగీకరించింది.

ఆరోజు అక్క పక్కనే కూర్చుని చాలా సేపు పాత సంగతులు ముచ్చటిస్తూ కూర్చున్నాడు. మళ్ళీ ఆ అక్కాతమ్ముళ్లు రేచెర్ల విజయరామారావుగారి దివాణంలో బతికారు. బాల్యస్మృతులతో తమని తామే మర్చిపోయారు. చివరకు ఇంటిని వదిలి







పెట్టి పోనని ఆమెనుండి మరోసారి మాట తీసుకుని ఆమె గది విడిచాడు హరినారాయణరావు.

అతను హాలులోకి వచ్చేసరికి, విమల కొడుకులు, కూతుళ్లతో సోఫాలో కూర్చుని మాట్లాడుతోంది. భర్తను చూసి, "అయినయ్యా, అక్కగారితో మాటలు! సముదాయించి వచ్చారా ఆమెను! మీ పిచ్చిగాని, ఆమె ఎక్కడకు వెళ్తుంది? ఈ ఇల్లు దాటితే ఆమెకు ఆశ్రయమేదీ, అధోగతి తప్ప" అంది విరసంగా.

హరినారాయణరావు నగల మూట ఆమె పక్కన పడేసి, "చాలు. మా అక్క విషయంలో వెంగలితనం ప్రదర్శించవద్దు. ఆమె నాకు సొంత అక్క. సవతి అక్క కాదు. గుర్తుంచుకో. నా తోడబుట్టింది. పెద్దది. నిజానికి నువ్వు అనుభవిస్తున్న ఆస్తికి ఆమె కూడా హక్కుదారు. ఆమె మనసు కష్టపెట్టుకోవడం నీకు మంచిది కాదు. నువ్వింకెప్పుడూ ఆమె విషయంలో తేలిగ్గా మాట్లాడవద్దు. నగల కోసం తన్నుకపోయావుగా. తీసుకో" అని మారుమాట మాట్లాడకుండా తన గదిలోకి వెళ్ళిపోయాడు. నగల మూట ఆమె పక్కన పడేసి.

మర్నాడు అతను పెద్దకొడుకు గోపాలకిషన్‌రావుకిచ్చి అనసూయమ్మకు పదివేలు పంపాడు. అతను అత్తకాడబ్బిచ్చి ఆమె కార్యకలాపాల గురించి విచారించాడు. ఆమె చెప్పింది విన్నాక, "అవునత్తా! మీరు బడుగువర్గాల మహిళలకు కుట్టుపని నేర్పిస్తారు. వాళ్లు అది ఉపయోగించి ఉపాధి కల్పించుకోవాలి. ఆ విషయంలో మీరేం ఆలోచిస్తున్నారు? " అని అడిగాడు.

నిజమే. తను ఆ విషయం ఆలోచించ లేదు. తనూ మరింతమంది నిరుద్యోగులను తయారు చేస్తున్నది. అయితే, గోపాలకిషన్‌రావే అందుకు మార్గం సూచించాడు. "నేనింకా నాలుగు రోజులు ఊళ్ళోనే ఉంటాను. ప్రస్తుతం ఖమ్మం కలెక్టర్ నాకు తెలిసినవాడే. కాలేజీలో నాకు సీనియర్. కొన్ని డిపార్ట్‌మెంటుల్లో సిబ్బందికి యూనిఫాంలు కుట్టిస్తుంటారు. ఉదాహరణకు పోలీసు డిపార్ట్‌మెంటే తీసుకో. కలెక్టర్‌తో మాట్లాడి ఆ కాంట్రాక్టు వీలయితే నీకిప్పించేట్టు చేస్తాను. వట్టిగా శిక్షణనిప్పించినదానివే గాక, వాళ్ళకు ఉపాధి కల్పించినదానివీ అవుతావు నువ్వు. రేపు మనం ఖమ్మం వెళ్దాం. నువ్వా రా. నువ్వు మామయ్య మార్గంలోనే నడుస్తున్నావు. నాకు సంతోషంగా ఉంది" అన్నాడు.

"ఆ పని చేసిపెట్టు బాబూ! నీకెంతో రుణపడి ఉంటాను" అంది అనసూయమ్మ మేనల్లుడిని ఆశీర్వదిస్తూ.

అతను చెప్పినట్టే మర్నాడు అత్తను వెంటబెట్టుకుని వెళ్ళి కలెక్టర్‌తో మాట్లాడాడు. అతనూ ఆమె చేస్తున్న పనిని ప్రోత్సహించాడు. గంధసిరికి తిరిగి వచ్చాక, టైలరింగ్ ట్రైనింగ్ సెంటర్‌ను ఓ రిజిష్టర్డు బాడీగా మార్చింది ఆమె మేనల్లుడి సాయంతో. మరియమ్మే దానికి సెక్రటరీ. క్రైస్తవ స్త్రీలకు ప్రభుత్వ సాయం ఉంటుందో లేదోనన్న అనుమానమొచ్చి ఆమె అసలు పేరు చుక్కమ్మతోనే రిజిస్టరు చేశారు. వాగ్దానం చేసినట్టే కలెక్టరు వాళ్లకు సాయం చేశాడు. మొదటి కాంట్రాక్టు ఆమె సంస్థకే దక్కింది. బడుగువర్గాల మహిళల్లో ఉత్సాహం పెనకొంది. నేర్చుకోవటమే గాక, ఉపాధి అవకాశమూ లభించటంతో వారికి ఆనందమైంది.

అనుకున్నంత వేగంగా కాకపోయినా రోజులు మారసాగాయి. ఈనాముల రద్దు చట్టం 1967 అక్టోబరు 6 నాటికే అమలులోకి వచ్చింది. కొందరు భూస్వాములు తమకు గల అదనపు భూములను రైతులకు తక్కువ ధరలకు అమ్ముకున్నారు.

పట్టణ భూముల గరిష్ట పరిమితి రావడంతో వాటి నిబంధనల నుండి తప్పుకోవటానికి హరినారాయణరావు లాంటి భూస్వామ్య వర్గాలు చట్టాల్లోని లొసుగుని వాడుకుని లాభపడ్డారు. ఈ మధ్యకాలంలో మరియమ్మ మరణం అనసూయమ్మకు ఎంతో దుఃఖాన్నీ, బాధనూ కల్గించింది. ప్రసవంలో గుర్రపువాతం వల్ల కాన్పు సరిగ్గా కాక ఆమె మరణించింది. పుట్టిన పిల్లవాడూ బతకలేదు. ఆ సంఘటన ఆమెకెంతో దుఃఖం కలిగించింది.




"ఏయ్, నీకే చెప్పేది. నావెంట పడకు"

"ఏం, ఎందుకు పడకూడదు? "

"నువ్వెవరు, నేనెవరు? "

"నువ్వు రేణుకవి, నేను నారాయణ్ణి"

"నా పేరు కూడా తెల్సుకున్నావే? "

"నీ పేరేంది! నాకు అన్నీ తెల్సు. మీ నాయన ఎలిమెంటరీ స్కూలు టీచరు మీ అమ్మ చనిపోయింది. మీ స్వంత ఊరు బూర్గంపాడు. అది సరే, నువ్వా వెలమదొరల ఇంటికి రోజూ ఎందుకు వెళ్తావు? "

"ఎందుకు? నీకనవసరం. నన్ను పోనీ"

"నాకు తెల్సు. హరినారాయణరావు రెండో కొడుకు ఎర్రగా బుర్రగా ఉంటాడని వాడిని చూడటానికి వెళ్తున్నావు"

"చంపేస్తాను, ఇంకెక్కువ వాగావంటే"

"అమ్మో! చంపు, చూద్దాం"

అతనప్పటికి నెలరోజుల నుండీ రేణుక వెంటపడ్తూనే ఉన్నాడు. అనసూయమ్మ 'వాడు' అని ప్రస్తావించింది అతన్ని గురించే. తన తండ్రితో మాట్లాడతానని ఆమె చెప్పింది. ఏం మాట్లాడుతుంది? తన వెంటపడవద్దని ఇతనికి తన తండ్రి చేత చెప్పిస్తుందా? చెప్పినా, ఇతను తన వెంటపడటం మానుకుంటాడా? అది ఆమెకు సుతరామూ నచ్చని విషయం. అతనిలోని ఏదో ప్రబలమైన శక్తి తననతని వైపు ఆకర్షిస్తోంది. పైకి అతన్ని తన వెంటపడి రావద్దంది. కానీ, అతను తన వెంట పడటంలో ఏదో వెచ్చదనం ఉంది.

గంధసిరిలో హైస్కూలు గానీ, కాలేజీ గానీ లేవు. పక్కన మూడుమైళ్ల దూరంలో ఉన్న వెంకటాపురం వెళ్ళాల్సిందే. ఎలిమెంటరీ స్కూలు చదువు పూర్తయ్యాక దేవదానం కూతురు చదువు ఆపెయ్యాలనుకున్నాడు. కానీ మరియమ్మ పడనివ్వలేదు. కూతుర్ని వెంకటాపురం పంపించి చదివించాలని పట్టు పట్టింది. అయితే కూతుర్ని వెంకటాపురంలో ఉంచటానికి ఇష్టపడలేదు దేవదానం. పొద్దున బస్సులో వెళ్ళి స్కూలు వదిలాక సాయంత్రానికి బస్సులో ఇంటికి చేరేది. ఆమె స్కూల్లో చదివేటప్పుడు తల్లి మరియమ్మ మరణించింది. దేవదానం మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు. వరుసగా ఏడాది తేడాతో ముగ్గురు పిల్లలు పుట్టారు. ఖర్చులు పెరిగాయి. దేవదానం కూతురు చదువు ఆపెయ్యాలనుకున్నాడు. కానీ, అందుకు అనసూయమ్మ అంగీకరించలేదు. ఆ పిల్ల ఖర్చులన్నీ తనే భరించసాగింది. అలా స్కూలు చదువు తర్వాత, కాలేజీలో చేరింది రేణుక. సెలవుల్లో అనసూయమ్మ దగ్గర పాటలూ, పద్యాలూ నేర్చుకునేది.

ఆమె ఇంటర్మీడియట్ మొదటి సంవత్సరం చదువుతోంది. కాలేజీకి వెళ్లక తప్పదు. రోజులో కనీసం ఒకసారయినా

అతడు ఆమె వెంట పడక తప్పదు. తరచూ గంధసిరి నుంచి బస్సెక్కి వస్తాడు వెంకటాపురానికి. అతడు మాదిగవాడలో ఉండేవాడు కనుక ఆమెకు అతన్ని చూసిన గుర్తులేదు. మొదట్లో ఆమెకు చిరాకు కలిగింది. అతనలా తన వెంట పడటం చూసి ఆమెకు కోపం వచ్చింది. కానీ, తిట్టినా వెంటపడటం మానని అతన్ని చూసి ఆమెలో ఏదో తెలీని ఇష్టం కలిగింది. అతను తన వెంట పడటం చూసిన ఆమె క్లాసుమేట్లు అతనికో చక్కటి ముద్దు పేరు కూడా ప్రసాదించారు 'ఏదు పందని'ని. నల్లటి మనిషి, ఏదు పందిముళ్ళు లేచి నట్లుండే నిక్కబొడుచుకున్న జుట్టు. బలిష్ట మైన శరీరం. ఏదో పాశవిక శక్తి అతనిలో ఉంది.

"భలే హీరోను ఎంపిక చేసుకున్నావే!" అని ఆమె క్లాసుమేట్లు ఆటలు పట్టించే వాళ్ళు.

"నువ్వు నా వెంట పడకు. నా స్నేహితురాళ్లంతా నన్ను ఎగతాళి పట్టిస్తున్నారు" అంది రేణుక.

"అయితే నీకిష్టమే! నాలాంటి మగాడెవడూ వాళ్లవెంట పడటం లేదని వాళ్ళకు అసూయ"

"నేను బాగా చదువుకోవాలి. ఇప్పుడప్పుడే పెళ్ళి చేసుకోను."

"నిన్నిప్పుడు పెళ్ళెవరు చేసుకోమన్నారు? "

"మరి? !"

"పెళ్ళి పక్కన పెట్టు. దాని సంగతి పెద్దవాళ్లు చూసుకుంటారు. ముందు నా ఇష్టాన్ని తీర్చు." అంతే, రేణుక అతన్ని ఉరిమి చూసి వెళ్లిపోయింది గబగబా నడుచుకుంటూ అక్కడి నుండి. కాలేజీ దగ్గర పడటం, మిగతా విద్యార్థులు కూడా కాలేజీకి వస్తుండటం చూసి అతను వెనక్కి తిరిగి వెళ్లిపోయాడు.

నారాయణ తండ్రి శౌరయ్య కొంతకాలం వరంగల్లు దగ్గరున్న అజాంజాహీ మిల్స్‌లో వర్కర్‌గా పనిచేశాడు. అది తన ఊరికి దూరమవటం, ఎదుగూ బొదుగూ లేని నౌకరీ అవటంతో అక్కడ పనిమానేసి స్వంత ఊరు వచ్చి రేచెర్ల విజయరామారావు దగ్గర శేరిదార్‌గా చేరాడు. దొరకు నమ్మకమైన బంటుగా ప్రవర్తించాడు. 1948లో వచ్చిన భూసంస్కరణల ఫలితంగా విజయరామారావు తన పరిమితి ననుసరించి యాభై ఎకరాల మాగాణి భూమిని ఉంచుకుని కమ్యూనిస్టులు పంచగా, తిరిగిరాని భూమిని వదిలేసి, సుమారుగా నూటయాభై ఎకరాలను పటేల్, పట్వారీలను కూడగట్టుకుని, పహిణీ పత్రికలో బినామీ పేర్లకు బదిలీ చేయించాడు. బినామీదార్లందరూ ఆయన నమ్మకస్థులే. ఆ రోజుల్లో ఆయన వీళ్ళెక్కడికి పోతారులే అనుకున్నాడు. కొన్నాళ్ళు వాళ్ళంతా ఆయనకు నమ్మకస్థులుగానే మెలిగారు.

స్వాతంత్ర్యం వచ్చి, స్వేచ్ఛా పవనాలు వీచటం మొదలెట్టాక జనాలకు కూడా తెలివితేటలు మీరాయి. కొంతమంది ఆయనకు పొలం స్వాధీనం చేయటానికి నిరాకరించారు. ఇదివరకటిలా మాలీపటేల్‌ను వాళ్ళపై ప్రయోగించలేకపోయాడు. ప్రజాస్వామ్య యుగంలో ఇంక దొరతనం చెల్లదన్న అవగాహన కలగసాగింది విజయరామారావుకు. క్రమంగా రాజకీయాల్లోకి దిగాడు. ముందుగా కాంగ్రెసు పార్టీ అభ్యర్థిగా సమితి ప్రెసిడెంటు అయ్యాడు. ఆ తర్వాత ఎం.ఎల్.ఏ. అయ్యాడు. విజయరామారావు పార్టీ కార్యకలాపాల్లో తిరుగుతూ తరచూ హైదరాబాద్‌లో ఉండటంతో శౌరయ్య కూడా క్రమంగా స్వతంత్ర్యం ప్రకటించడం ప్రారంభించాడు. విజయరామారావు సుమారుగా

రెండెకరాల మాగాణి, పదిహేను ఎకరాల మెట్టభూమిని శౌరయ్య పేరున, అతని కుటుంబ సభ్యుల పేరున బదిలీ చేయించాడు. పేరుకు భూమి శౌరయ్య పేరునే ఉన్నా, పంట మాత్రం దొర హక్కు భుక్తమయ్యేది. క్రమక్రమంగా దొర అజమాయిషీ కరవడంతో పంటలో చాలాభాగం శౌరయ్య మింగేయసాగాడు. దొర బంటుగా అతనికి ఊరులో బాగా పలుకుబడి ఉండేది. తమ మాదిగ కులంలో పెద్దగా పరిగణించబడేవాడు. ఏం జరిగినా, అతని తీర్పే కులసభ్యులందరికీ శిరోధార్యమయ్యేది.

శౌరయ్య తెలివిగలవాడు. అతనికి ఇద్దరు కూతుళ్ళు, ఇద్దరు కొడుకులు. ఆడపిల్లలు పెద్దపిల్లలవటం వల్ల వాళ్ళకు వివాహాలు చేశాడు కానీ, కూతుళ్ళను కాపురానికి పంపలేదు. అల్లుళ్ళనే ఇల్లరికం తెచ్చుకున్నాడు. ఆ కాలంలో తెలంగాణలో ఇల్లరికం బడుగువర్గాలలో ఆచారంగా ఉండేది. తమకు ఈనాములుగా వచ్చే భూముల్లోనూ, దొర భూముల్లోనూ వంతు వెట్టికి పనివాళ్ళు అవసరమయ్యేవాళ్ళు. అందుకని తమకు తెలియకుండానే శ్రమ విభజన సూత్రాన్ని పాటించేవి బడుగువర్గాలు. పొరుగూళ్ళ నుండి ఇల్లరికానికి తెచ్చుకున్న అల్లుళ్ళకు తమ ఈనాము భూముల్లో వంతు పెట్టేవారు. అలాగే వంతుల వారీగా దొర భూముల్లోనూ, ఇళ్ళలోనూ పనిచేసేవారు. శౌరయ్య ఆ ఆనవాయితీనే పాటించాడు. క్రమంగా అణగారిన బలగం పెరగడంతో 'నీ బాన్చను నీ కాల్మొక్తా' అనే హీనస్వరం లుప్తమయి, ధిక్కారస్వరం ప్రబలమవసాగింది.

శౌరయ్య పంట మీద వచ్చే అయివేజును వెనకేశాడు. ఖమ్మం పట్నం విస్తరించి పక్క గ్రామాల దాకా పాకటం మొదలెట్టింది. భూముల ధరలూ పెరిగాయి. కూడబెట్టిన డబ్బుతో పట్నంలో స్థలాలూ కొంటూ, బిల్డింగు కాంట్రాక్టులు చేపడుతూ డబ్బు వెనకేసుకో ప్రయత్నించాడు గానీ అందులో సఫలం కాలేకపోయాడు. శౌరయ్య పొలాన్ని కొంత అమ్మి తన పేరున కొత్త భూమిని కొన్నాడు. తను బదిలీ చేసిన భూమిలో సగం అన్యాక్రాంతమయినట్లు విజయరామారావుకు చాలాకాలం వరకు తెలియలేదు. తెలిశాక శౌరయ్యను నిలదీసినా ప్రయోజనం లేకపోయింది.

తమ సగం పొలం అమ్మేసినా, పెద్దగా మాట్లాడని విజయరామారావు మాటల నలుసు తీసుకుని మరికొంత పొలం అమ్మేసి కొత్త ఆస్తులు పెంచుకోసాగాడు శౌరయ్య. ఆ తరువాత హరినారాయణరావు జమానాలో శౌరయ్య అవసరాలు అతనికి మరీ ఎక్కువయ్యాయి. తనకు రావల్సిన ఆస్తులను అతను అనుభవిస్తున్నాడన్న విషయం హరినారాయణరావు మర్చిపోయాడు. అయితే శౌరయ్యకున్న తెలివితేటలు కూతుళ్ళ తర్వాత లేక లేక కలిగిన కొడుకులకు అబ్బలేదు. శౌరయ్య చదువుకోలేదు. అణగారిన వర్గాల్లో ఆ రోజుల్లో చదువన్న ప్రస్తావనే ఉండేది కాదు. అగ్రకులాల్లోనూ చదువుమీద ఆసక్తి అంతంత మాత్రమే. నిజాం కాలంలో తెలుగుకు ప్రాధాన్యముండేది కాదు. స్కూళ్ళు అందుబాటులో ఉండేవి కాదు. ఖమ్మం, వరంగల్లు, నిజామాబాద్ లాంటి పట్నాల్లో ప్రభుత్వ పాఠశాలలున్నా వాటిల్లో ప్రాధాన్యమంటూ ఉర్దూకేగానీ తెలుగుకు లేదు. అందువల్ల తెలంగాణలో చదువుకున్నవారి శాతం అల్పం. బడుగు వర్గాలలో అయితే చదువు అనర్థకం అన్న అభిప్రాయం ఉండేది. అందువల్ల శౌరయ్యకు కూతుళ్ళను చదివించాలనే ఆలోచనా కలగలేదు. ఆ కాలంలో అతనికి





## తిమింగలాలు కావాలి

ఓ కొత్త యువరచయిత మార్క్‌ట్వైయిన్‌ను రచయితలకు ఎలాంటి ఆహారం మంచిదని అడిగాడు. హార్వర్డ్ ప్రొఫెసర్ చెబుతున్నట్లుగా చేపలైతే మెదడుకు మంచివట కదా? అనికూడా అన్నాడు.

రచయిత అయ్యేందుకు కావాల్సిన ప్రతిభ, సృజన ఏమాత్రంలేని అతడితో మార్క్‌ట్వైయిన్,'మీకైతే చేపలు చాలవు.. రెండు తిమింగలాలు అవసరమవుతాయి' అన్నాడు నవ్వుతూ.




స్తోమతా లేదు.

కానీ, కూతుళ్ళు కలిగిన పదిహేనేళ్ళకు కొడుకు శంకరయ్య స్వతంత్ర భారతంలో జన్మించాడు. దళిత జనోద్ధరణ భావాలకు ఆలంబనం లభించింది. రాజ్యాంగం చట్టమూ అందుకు ప్రోత్సాహం కల్పించింది. స్వేచ్ఛాపవనాలు అటూ ఇటూగా వీచటం ప్రారంభించటంతో బడుగువర్గాల లోనూ చదువు ప్రాముఖ్యతను గురించిన చేతన ప్రారంభమైంది. అందువల్లనే శౌరయ్యకు కూడా ఆలోచన వచ్చింది. కనుక తన పెద్దకొడుకు శంకరయ్యకు, ఆ తరువాత ఐదేళ్ళకు పుట్టిన నారాయణకు చదువు చెప్పించాలన్న ఆలోచన కలిగింది.

రవాణా సౌకర్యాలు పెరిగాయి. దళితులకు హాస్టళ్ళు కూడా ఏర్పాటు చేసింది ప్రభుత్వం. అందువల్ల పెద్దకొడుకును ఖమ్మంలో హాస్టల్లో ఉంచి చదివించసాగాడు. శంకరయ్య ఇంటర్మీడియెట్ వరకు బాగానే చదివాడు. శంకరయ్య లేకలేక కల్గిన కొడుకు కావడంతో శౌరయ్య కూడా కొడుకు అడిగినంత డబ్బు ఇచ్చేవాడు. శంకరయ్య ఇంటర్మీడియెట్ పూర్తిచేసి డిగ్రీలోకి వచ్చాడు. మనిషి కనునదరుగా ఉండేవాడు. ఊళ్ళో డిగ్రీ చదువుతున్న కుర్రవాడు అతడే. అందువల్ల అతనంటే బంధువర్గంలో ఆదరణ ఉండేది. అభిమానంగా, గర్వంగా అతన్ని చూసేవారు.

డిగ్రీలో చేరాక తమ దళిత హాస్టల్లో ఉండటానికి నిరాకరించాడు శంకరయ్య.

శౌరయ్యకు అంగీకరించక తప్పలేదు. దళితులకు అగ్ర కులస్థులు అద్దెకు గదిని ఇచ్చేంతగా సమాజం ఎదగలేదు. తిరగ్గా తిరగ్గా ఓ ఇంట్లో అతనికి గది అద్దెకివ్వటానికి అంగీకరించారు. ఇంటి యజమాని గోపాల్‌సింగు కమీషను వ్యాపారం చేసేవాడు. మార్కెట్టులో అతనికి దుకాణం ఉంది. ధాన్యం కొనుగోలుకు అతను తరచూ ఊళ్ళకు తిరగాల్సి వచ్చేది. ఇంట్లో భార్య ఒక్కటే. ఏ సాయం చెయ్యటానికీ ఎవరూ లేరు. తమకు పిల్లలు లేరు. నలభయ్యోపడిన అతనికి పిల్లలు కలుగుతారన్న ఆశా లేదు. పిల్లవాడు చురుకుగా కన్పించాడు గోపాల్‌సింగుకు. దళితుడై కూడా పైకి రావటానికి ప్రయత్నిస్తున్న అతనంటే ముచ్చట కలిగింది గోపాల్‌సింగుకు. అందుకే అతనికి గది అద్దెకివ్వటానికి అంగీకరించాడు అతను.

అతని భార్య సంజన ముప్ఫై ఎనిమిదేళ్ళ స్త్రీ. అక్కా అని పిల్చి ఇంట్లో చేరిన శంకరయ్యకు ఆమెకూ అక్రమ సంబంధం ఏర్పడుతుందని గోపాల్‌సింగు కలలో కూడా ఊహించలేదు. భర్తకు ఎప్పుడూ వ్యాపారపు గొడవే. లైంగికంగా కూడా అనమర్థుడే. అందువల్లే తమకు పిల్లలు కలగలేదన్న అభిప్రాయంతో ఉన్న సంజన శంకరయ్యపై వల విసిరింది. కామినీ కాంచనాల ప్రభావం తట్టుకుని నిలబడగల

గడం యోగులకే అసాధ్యమైన విషయం. ఇంక శంకరయ్య అనగా ఎంత?

క్రమంగా శంకరయ్య ఆమెకు అలవాటు పడ్డాడు. చదువు గుంటగట్టి గంట వాయించింది. ఎప్పుడూ ఆమె ధ్యాసలోనే గడిపేవాడు. గోపాల్‌సింగ్ వ్యాపార నిమిత్తం బయటకి వెళ్ళినప్పుడు వారిది ఇష్టారాజ్యమైంది. అతను ఊళ్ళోనే ఉండి, సంజన తన పక్కకు చేరలేని అశక్తతతో ఉన్నప్పుడు అతను గోపాల్‌సింగు పట్ల కోపంతో ఉడికిపోయేవాడు. అలా కొంత కాలమయ్యాక ఆమె గర్భం దాల్చింది. ఆ విషయం తెల్సిన గోపాల్‌సింగు మొదటి సారిగా అనుమానంలో పడిపోయాడు. అతను అంతకుముందే డాక్టరుకు తనను చూపించుకున్నాడు. అతని వీర్యంలో చలన కణాల సంఖ్య అల్పమనీ అతనికి పిల్లలు కలిగే అవకాశం లేదనీ డాక్టరు చెప్పాడు. అయినా ఆ కుర్రవాడికీ, తన భార్యకూ అక్రమ సంబంధం అంటగట్టలేక పోయాడు. తన భార్య ఆ కుర్రవాడికంటే వయసులో ఎంతో పెద్దది. సుమారుగా రెట్టింపు వయసు. అలాంటివాడితో తన భార్య రమిస్తుందని అతను భావించలేక పోయాడు. అయితే అనుమానం తొల చటం ఆపలేదు.

ఆ కారణంగా భార్యతో విరసంగా ప్రవ ర్తించసాగాడు. ఓసారి ఓ చిన్న విష యంలో భార్యతో తగాదా పెట్టుకున్నాడు. తనకు పిల్లలు పుడితే విజయవాడ కనకదు ర్గకు ముడుపు చెల్లిస్తానని తను మొక్కుకు న్నట్టు చెప్పింది ఆమె. "నాకు తీరిక లేదు తర్వాత చూద్దాంలే" అన్నాడు గోపాల్ సింగు.

"నువ్వెప్పుడూ అట్టాగే అంటావు. నీకు తీరిక లేకపోతే నేను, శంకరయ్య వెళ్ళి వస్తాం" అంది ఆమె.

అంతే! మండిపోయింది గోపాల్‌సిం గుకు. చాచి లెంపకాయ కొట్టాడు ఆమెను. ఆమె పెద్దగా అరిచి గోల చేయసాగింది. ఆమె గోల చేస్తున్నకొద్దీ అతనికి మరింత కోపం వచ్చింది. ఒళ్ళు మరచి కొట్టసా గాడు. పక్కగదిలో నుండి ఈ రభస వింటున్న శంకరయ్య బయటికి వచ్చాడు.

"ఏమిటీ, అక్కను కొట్టి చంపుతావా?" అంటూ అడ్డు వెళ్ళాడు, ఆమెను కొట్ట కుండా శంకరయ్య.

"ఇది మాకు సంబంధించిన విషయం. నువ్వు బయటికి వెళ్ళు" అని పెద్దగా అరి చాడు గోపాల్‌సింగ్.

"అతను వెళ్ళడు. నువ్వు నన్ను చంపు తుంటే చూస్తూ ఊర్కునే మొగాడు కాదు అతను" అంది సంజన.

"ఆహా వాడి మగతనం రుచి చూశావ న్నమాట! మీ ఇద్దర్నీ చంపుతాను" అంటూ శంకరయ్యను మెడపట్టుకుని బయటకు గెంటాడు గోపాల్‌సింగ్. "నువ్వింక మా ఇంట్లో ఉండాల్సిన పనిలేదు. నువ్వు రేప టికల్లా నా గది ఖాళీ చెయ్యి" అన్నాడు రోజుకుంటూ.

ఆ మర్నాడు గోపాల్‌సింగ్ దుకాణానికి వెళ్ళాక శంకరయ్య సంజన యోచన చేశారు. ఇంక భర్తకు పరలోక ప్రాప్తి కలి గించటం తప్ప మరి గత్యంతరం లేదని భావించింది సంజన. హత్యా! అని భయ పడిపోయాడు శంకరయ్య.

"తప్పదు... మనం సుఖంగా బతకా లంటే మరి గత్యంతరం లేదు. నా కోసం ఈ మాత్రం చెయ్యలేని నువ్వేం మగాడివి. ఈ కడుపులో బిడ్డకు నువ్వు తండ్రివి. ఆ నపుంసకుడిని కడతేర్చాల్సిందే" అంది సంజన.

మరి గత్యంతరం కన్పించలేదు శంకర య్యకు. ఆమెపై ఆర్తి చావలేదు అతనికి. ఆరోజు రాత్రి ఎనిమిది గంటల సమ యంలో ఇంటికి వచ్చిన భర్తకు కడసారి

భోజనం పెట్టి, శారీరక సుఖం కూడా ఇచ్చింది. అతను ఇంకా పూర్తిగా తన అనుమానం విషయంలో నిర్ధారణకు రాలేకపోయాడు. తనది అనుమానమేమోననుకుని సరిపెట్టుకో ప్రయత్నించాడు. అందువల్ల భార్యతో ఎప్పటిలాగానే ప్రవర్తించాడు. భర్తతోడి సాంగత్యం ఆమెకు ఎప్పుడూ ఏవగింపు కలిగించేదే. కాకపోతే ఆరోజు తప్పలేదు ఆమెకు. అతనికి ఏ అనుమానం రాకూడదు.

భర్త పడుకున్నాక, అర్ధరాత్రి తలుపు తెరిచి వచ్చి శంకరయ్యను నిద్రలేపింది. హత్యా నిర్ణయం జరిగిందిగానీ, నిజంగానే ఆమె అందుకు నడుంకట్టి ఉందని శంకరయ్య నమ్మలేదు. నిద్రలోనుంచి లేచాడు. "అదుగో, ఆ చిక్కుడు పాదు దగ్గర బండ ఉంది పట్టుకురా" అంది.

శంకరయ్య మంత్రముగ్ధుడిలా ఆ బండ తీసుకుని ఆమెను అనుసరించాడు. గాఢనిద్రలో ఉన్న భర్త తలాపి దగ్గరకు తీసుకు వెళ్ళింది అతన్ని సంజన. ఆ బండతో మోదమని సైగ చేసింది. శంకరయ్య కీలుబొమ్మలా అతని తలపై బండతో మోదాడు. గోపాల్‌సింగుకు దెబ్బ తగిలింది కానీ, వెంటనే లేవబోయాడు. మసక చీకటిలో ఏం జరుగుతోందో గుర్తుపట్టలేకపోయాడు. సంజన భర్తను లేవకుండా వెనక్కి అదిమిపెట్టి, "వెయ్యి, మళ్ళీ ఓ దెబ్బవెయ్యి" అని పెద్దగా అరిచింది. శంకరయ్య మరి ఆలోచించలేదు. మళ్ళీ గోపాల్‌సింగు తలపై బలంగా మోదాడు. విస్మయపడిపోయిన గోపాల్‌సింగు అందులోనుంచి తేరుకోకముందే ప్రాణాలు విడిచేశాడు.

అతను చనిపోయాడని నిర్ధారణ అయ్యాక, నట్టింట్లో గొయ్యి తవ్వి గోపాల్ సింగు శవాన్ని పూడ్చి పెట్టారు శంకరయ్య, సంజన. ఆమె ఏ ఆదేశమిస్తే ఆ పని చెయ్యటమే కానీ ఏమాత్రం ఆలోచన చెయ్యలేదు శంకరయ్య. మర్నాడు పొద్దున ఇద్దరూ లేచి, రైల్వేస్టేషనుకు బయలుదేరారు. వెళ్ళబోయే ముందు పొరుగువాళ్ళకు తాము దక్షిణదేశ యాత్రలకు వెళ్తున్నామని చెప్పింది సంజన.

మర్నాడు గోపాల్‌సింగు దుకాణానికి రాకపోయేసరికి అతని గుమాస్తా అడివయ్య ఇంటికి వచ్చాడు. ఇల్లు తాళంవేసి ఉండటంతో పొరుగువాళ్ళనడిగేసరికి వాళ్ళు ఆ దంపతులు దక్షిణదేశ యాత్రలకు వెళ్ళారని చెప్పారు. అంత అకస్మాత్తుగా వాళ్ళు వెళ్ళడమేమిటో అర్థం చేసుకోలేకపోయాడు. అడివయ్య తన యజమాని తనకు చెప్పకుండా ఎక్కడకూ వెళ్ళడు. అయినా చేసేదేం లేక అతను ఊరకుండిపోయాడు.

వారానికోసారి ఇంటికొచ్చే కొడుకు రాకపోయేసరికి, కొడుక్కి ఏమయిందో, ఏ జబ్బున పడ్డాడో అని గాభరాపడిపోతూ ఖమ్మం వచ్చాడు శౌరయ్య. ఇల్లు తాళం వేసి ఉంది. గోపాల్‌సింగు దంపతులు దక్షిణ దేశ యాత్రకెళ్ళారని తెలుసుకున్నాడు. కాలేజీకి వెళ్ళి విచారించగా, శంకరయ్య రెండు రోజులుగా కాలేజీకి రావడం లేదని తెలిసింది. అతనూ వాళ్ళతో దక్షిణదేశ యాత్రకు వెళ్ళాడేమోనని సరిపెట్టుకో ప్రయత్నించాడు. కానీ, తనకు చెప్పకుండా అలా వెళ్ళి ఉండే కొడుకు కాదని మధనపడ్డాడు. ఏమయ్యాడో తెలియక రోజూ గంధసిరి నుండి ఖమ్మం వరకూ వచ్చేవాడు.

నెలరోజుల దక్షిణదేశ యాత్ర చేసివచ్చారు శంకరయ్య, సంజనలు. ఎక్కడకు వెళ్ళినా శంకరయ్యను మనసు తొలచివేస్తూనే ఉంది. మానసిక అశాంతితో అతను వివిధ ప్రదేశాలను, తీర్థస్థానాలను చూసిన ఆనందాన్ని గాని, సంజనతోడి

# మండే గ్రామం



**పె**న్సిల్వేనియా రాష్ట్రంలోని, సెంట్రాలియా అనే ఊరు 1962 నించి నేటిదాక కాలుతూనే వుంది. ఆ ఊళ్ళోని బొగ్గుగని 1962లో అంటుకుని ఇంకా మండుతూనే ఉంది. ఆ గ్రామంలోని 4000 మంది జనాభాని ఇంకో చోటుకి తరలించడానికి అమెరికన్ ప్రభుత్వం 4.2 కోట్ల డాలర్లని ఖర్చు చేసింది. కాని 46 మంది గ్రామస్థులు మాత్రం తమ స్వగ్రామాన్ని విడిచి వెళ్ళడానికి సమ్మతించడం లేదు. వారిని తరలించడానికి ప్రభుత్వం ఒక్కో ఇంటిని తొంభై వేల డాలర్లకి కొనడానికి ముందుకు వచ్చింది. వాటి ఖరీదు అందులో సగమే అయినా వాళ్ళు సరే అనలేదు.

బొగ్గుగని ఎలా అంటుకుందో ఎవరికీ తెలీదు. కానీ ఓ పనివాడు నిర్లక్ష్యంగా వేడి బొగ్గుని ఆ గనిలో వేయడం వల్ల అది అంటుకుందని కొందరు నమ్ముతున్నారు.

సెంట్రాలియాలో పోస్టాఫీస్‌ని మూసేసారు. 17 గృహాల్లోని 46 మంది మాత్రమే. ఆ గ్రామ జనాభా. ఆ గ్రామంలో భూమిలోని పగుళ్ళలోంచి ఎల్లప్పుడూ పొగ వస్తోంటుంది.




అలాంటిచోట్ల నేలమీద గుడ్డుని ఉంచితే నిముషంలో అది ఉడికిపోతుంది. డాలర్ నోట్‌ని ఉంచితే అది నిముషం తర్వాత బూడిదగా మారుతుంది.

కొన్ని శతాబ్దాలపాటు ఆ నిప్పు ఆరదని శాస్త్రజ్ఞుల అంచనా. ప్రభుత్వం కూడా నిప్పుని ఆర్పేందుకు ఎలాంటి ప్రయత్నం చేయడం లేదు.





సౌఖ్యాన్ని గానీ పొందలేకపోయాడు. సంజన జైలులోనుంచి బయటపడిన మని షిలా స్వేచ్ఛగా ప్రవర్తించటం శంకర య్యకు వింత అన్పించింది. తిరిగి తిరిగి వారికి ఖమ్మం చేరక తప్పలేదు. తెచ్చు కున్న డబ్బు కూడా అయిపోయింది. తిరిగి వచ్చాక, శంకరయ్య ఇంటికి వెళ్ళలేదు. ఆమెతోనే ఉండసాగాడు. అయితే గోపాల్ సింగు మాయమైన విషయంలో గుమాస్తా అడివయ్య రాజీపడలేదు. ఇంటికి వచ్చి విచారించాడు. తాము దక్షిణదేశ యాత్ర లకు వెళ్ళామనీ, రామేశ్వరం సముద్రంలో ఈదుతూ తన భర్త ప్రాణాల మీదకు తెచ్చుకున్నాడనీ సంజన ఏడ్చుకుంటూ చెప్పింది. ఆమె ఏడుపు అడివయ్యకు స్వాభావికమనిపించలేదు. ఆపైన ఆ ఇంట్లో శంకరయ్య ఉండడం, వారి ప్రవ ర్తన అతనిలో అనుమానం రేకెత్తించింది.

గోపాల్‌సింగు అడివయ్యను ఆదరంగా చూసేవాడు. అలాంటి యజమాని పోవటం, తనకు అండపోవటం అడివయ్య తట్టుకోలేకపోయాడు. పోలీసు కంప్లె యింటు ఇచ్చాడు. పోలీసులు వచ్చి విచా రించారు. సంజన తన కథనే విన్పిం చింది. శంకరయ్య ఎప్పటిలా కాలేజీకి వెళ్ళకుండా ఇంట్లోనే ఉండిపోవడం, తను సంజనంత ధైర్యంగా గోపాల్‌సింగ్ మర ణాన్ని గురించి నిశ్చయంగా చెప్పకపోవ డంతో పోలీసులకు అనుమానమొచ్చింది. శంకరయ్యను అరెస్టుచేసి, పోలీసు స్టేష నులో మర్యాద చేశాక, అతడు విషయా న్నంతా కక్కేశాడు. పోలీసులు నట్టింట్లో పాతిపెట్టిన గోపాల్‌సింగు శవాన్ని వెలికి తీశారు. సంజనను కూడా అదుపులో తీసు కున్నారు. ఐపిసి 302 కిందా, మరిన్ని సెక్ష నుల కిందా కేసు నమోదుచేసి, కోర్టులో ప్రవేశపెట్టారు.

విషయం తెల్సి శౌరయ్య గొల్లుమ న్నాడు. కొడుకును బెయిలు మీద బయ టకు తీసుకొచ్చే ప్రయత్నం చేశాడు. అయితే అది దారుణమైన హత్యకేసు కనుక, సాక్ష్యాలు శంకరయ్యను దోషిగా రుజువు పర్చేటట్లుండడంతో అతనికి బెయిలు నిరాకరించింది కోర్టు. శౌరయ్య విజయరామారావు దగ్గరకు వచ్చి గోల పెట్టాడు. ఆయన ఖమ్మంలో ఓ మంచి లాయరును శంకరయ్య కేసు వాదించటా నికి కుదిర్చిపెట్టాడు గానీ ప్రయోజనం లేక పోయింది. డబ్బు నీళ్ళలా ఖర్చయింది. తిరిగి తిరిగి వేసారాడు శౌరయ్య. కానీ, జన్మాంత కారాగారశిక్ష నుంచి కొడుకును రక్షించుకోలేకపోయాడు.

సంజనకూ జీవితఖైదు శిక్ష పడింది. సెషన్సు కోర్టులో కేసు నడుస్తున్న కాలం లోనే సంజన ఓ ఆడపిల్లకు జన్మనిచ్చింది. శౌరయ్య ఆ పిల్లను ఇంటికి తెచ్చుకునే ప్రయత్నం చేశాడు కానీ, సంజన తన కూతుర్ని దళితుల కుటుంబంలో పెంచటా నికివ్వ నిరాకరించింది. ఆమె తల్లిదండ్రు లకూ ఆమె పిల్లనివ్వలేదు. పిల్ల జెయిల్లోనే పెరిగింది. చివరకు బ్రెస్టు కాన్సరుతో సం జన జైలుశిక్షను అనుభవిస్తూనే మరణిం చింది. శౌరయ్య కోర్టువారి అనుమతితో ఐదేళ్ళ పిల్లను ఇంటికి తీసుకువచ్చి పెంచ సాగాడు. ఎంతయినా ఆమె తన మనుమ రాలు. ఆ సత్యాన్ని కోర్టు కూడా కాదనలే కపోయింది. సంజన మరణంతో ఆమె తల్లిదండ్రుల ఆ విషయంలో చేతులు కడి గేసుకున్నారు. పిల్లను శౌరయ్యకు అప్పగిం చటాన్ని ప్రతిఘటించలేదు.

శౌరయ్య తన రెండో కొడుకు నారాయ ణను ఖమ్మం పంపి చదివించడానికి ఇష్ట పడలేదు. శంకరయ్య అంత తెలివిగల వాడు కాదు నారాయణ. పైగా చిన్నకొ డుకు కావడంతో ఆ కొడుకంటే ఎంతో ప్రేమ కూడా శౌరయ్య లచ్చుమమ్మలకు.

అందుకే బస్సులో వెంకటాపురం పంపి చదివించారు. నారాయణ ఏడో క్లాసు గట్టెక్కడమే కష్టమయింది. ఎలాగోలా కిందా మీద పడి అది పూర్తిచేశాడు అతను. నారాయణ తొమ్మిదో క్లాసులో ఉండగా శంకరయ్య హత్య కేసుపై జెయిలుకెళ్ళాల్సి వచ్చింది.

పైకి ఎక్కివస్తున్న కొడుకు జెయిలు పాలవడంతో మానసికంగా ఎంతో డీలాపడిపోయాడు శౌరయ్య. డబ్బు కూడా విచ్చలవిడిగా ఖర్చుపెట్టాడు కానీ, సాక్ష్యాలన్నీ తన కొడుక్కు వ్యతిరేకంగా ఉండడంతో అతన్ని రక్షించలేకపోయాడు. చిన్నకొడుకు నారాయణను చదువు మాన్పించి ఇంటిపట్టునే ఉంచుకోవాలనుకున్నాడు. చదువు కొంప ముంచుతుందన్న తరతరాల విశ్వాసం అతన్ని పట్టి పీడించింది. అలాగనీ కొత్తగా వస్తున్న గాలినీ కాదనలేకపోయాడు. ఈ రెండు పవనాల మధ్య చిక్కుకున్న శౌరయ్య నారాయణను చదువు విషయంలో అంత కట్టుదిట్టం చెయ్యలేదు. రెండు, మూడేళ్ళు డింకీలు కొట్టి ఎలాగో టెన్త్‌క్లాసు పూర్తిచేసిన నారాయణ ఇంక చదవనని మొండికేశాడు. శౌరయ్య కూడా బలవంతం చెయ్యలేదు.

తన కాంట్రాక్టు పనులలోకి కొడుకును దించాడు శౌరయ్య. ఇప్పుడు శౌరయ్య పెరుగుతున్న వెంకటాపురం వైపు దృష్టిసారించాడు. పెద్దకొడుకును ఖమ్మం పంపి చదివించటం, అక్కడే అతడు జైలుపాలవటం చూసిన శౌరయ్యకు ఇంక ఖమ్మం అంటే విముఖత కలిగింది. ఖమ్మంలోలాగా పెద్ద పెద్ద పనులు వెంకటాపురంలో దొరక్కపోయినా, దొరికిన చిన్న కాంట్రాక్టు పనులనే వెంకటాపురంలో చేపట్టసాగాడు. ఆ పనుల కోసం నారాయణ వెంకటాపురంలోనే ఉండసాగాడు. వారానికో, రెండు వారాలకో గంధసిరి వచ్చేవాడు. కొడుకును వెంకటాపురంలో ఉంచినా శౌరయ్య అతని విషయంలో ఏమార్చి ఉండలేదు. శంకరయ్య విషయంలోలాగా ఎలాంటి దుర్ఘటన జరగకూడదు.

శౌరయ్య సంపాదన ఇదివరకటిలా లేదు. శంకరయ్య జైలుకెళ్ళటం అతన్ని బాగా కృంగదీసింది. ఏళ్ళు గడుస్తున్నకొద్దీ కొంత రాజీపడగలిగాడు గానీ, పూర్తిగా కోలుకోలేకపోయాడు. అలాంటి సమయంలో తనకు అండగా వున్న విజయరామారావు మరణం అతనికి అశనిపాతమైంది. హరినారాయణరావుతో అతనికంత సాన్నిహిత్యం, సఖ్యత లేదు.

స్కూల్లోనూ, కాలేజీల్లో చేరాక తన చదువు తప్ప మరో విషయం గమనించని రేణుక నారాయణ తమ ఊరివాడేనని తెలుసుకోలేకపోయింది.




**మ**రియమ్మ మరణం అనసూయమ్మకెంతో దుఃఖాన్ని కలిగించింది. నిజానికామె ద్వారానే తనీ లోకాన్ని చూడగలిగింది. ఆమె మరణం వల్ల ముందు కలిగిన ఫలితం టైలరింగ్ సెంటర్ మూలపడటం. అనసూయమ్మ జీవితంలో ఎంతో కోల్పోయింది. ఎంతో విషాదాన్ని అనుభవించింది. కనుకనే ఆమె త్వరగా కోలుకోగల్గింది మరియమ్మ మరణం కలిగించిన దుఃఖాన్నుండి.

నాలుగైదేళ్లలో ఆమె కుటుంబంలో



ఎన్నో మార్పులు వచ్చాయి. పెద్ద మేనల్లుడు గోపాల్ కిషన్‌రావు పెళ్ళి అయింది. అతను అప్పటికే ఎం. బి. బి. ఎస్. పూర్తిచేశాడు. పై చదువులకు భార్యతో సహా అమెరికా వెళ్ళిపోయాడు. అతని తరువాత హరినారాయణరావుకు ఇద్దరు కూతుళ్ళు. పెద్దపిల్ల వసుంధర, రెండో అమ్మాయి సుగుణ. ఇద్దరికీ రెండు సంవత్సరాల తేడా. ఆ ఇద్దర్నీ కూడా మొదట ఖమ్మం, తరువాత హైదరాబాదులో ఉంచి చదివించాడు హరినారాయణరావు. పెద్దమ్మాయికి బి.ఏ. చదువు పూర్తికాగానే పెళ్ళి చేశాడు. అల్లుడు పారిశ్రామికవేత్త. హైదరాబాదులో వాళ్ళు సెటిలయ్యారు. చిన్నమ్మాయి సుగుణ ఎం.ఏ. చదివింది. ఓ కాలేజీలో లెక్చరరుగా ఉద్యోగం చేసుకుంటోంది. ఆమెనో ఇంజనీరుకిచ్చి వివాహం చేశాడు. అతను ఉద్యోగరీత్యా భోపాల్‌లో సెటిలయ్యాడు. అక్కడి బి. హెచ్. ఇ. ఎల్. సంస్థలో అతను ఉద్యోగి. ఉద్యోగం మానేసి ఆమె భర్తతో భోపాల్ వెళ్ళిపోయింది. చివరి కొడుకు శివనాథరావు మణిపాల్‌లో ఇంజనీరింగ్ చదువుతున్నాడు. సెలవులకు ఇంటికి వచ్చిపోతుంటాడు. హరినారాయణరావు కూడా తన మకాం హైదరాబాదుకు మార్చాలనే ఆలోచనలో ఉన్నాడు. రాజకీయపు పనులతో అతనెక్కువగా హైదరాబాదులో ఉండాల్సి వస్తోంది. అయితే, గంధసిరిలోని ఆస్తిని అమ్మివేసి వెళ్ళిపోవాలని అతను ఆలోచన చెయ్యలేదు. తన నియోజకవర్గం గంధసిరి. అక్కడ ఇల్లూ, పొలమూ అమ్మేసి, తన నియోజకవర్గానికి తిరిగి రాకుండా ఉండే వీలులేదు. ఎన్నికలప్పుడయినా తను కనీసం తన నియోజకవర్గానికి రావలసి వుంటుంది.

భర్త గట్టిగా చెప్పి వారించిన తర్వాత విమల అనసూయమ్మ విషయంలో కల్పించుకోవటం మానేసింది. తనేమిటో, తన పిల్లల గొడవలేమిటోగానీ, అనసూయమ్మ అనే వ్యక్తి ఆ ఇంటిలో ఉంటున్నదన్న స్పృహ కూడా లేనట్టు ఆమె ప్రవర్తించేది. అక్కపట్ల కొంత సుముఖంగా ప్రవర్తించే హరినారాయణరావుకు కూడా ఆమె ప్రవర్తన వల్ల విముఖుడయ్యే సంఘటనలు జరిగాయి.

తన ఊరిలో ఆస్పత్రి లేకపోవడం మరియమ్మను ఆసుపత్రికి , తీసుకెళ్ళటంలో జాప్యం జరిగి, సమయానికి చికిత్స అందక ఆమె మరణించిందనే భావన అనసూయమ్మ హృదయంలో నాటుకుపోయింది. తన చిన్నప్పుడు బాలమయ్య భార్య కూడా చికిత్స అందకే చనిపోయింది. ఊరిలో పూజారి రంగాచారి కుటుంబంలో అనూచానంగా వస్తున్న ఆయుర్వేద వైద్యాన్ని అందించేవాడు కానీ ఆయనా ముసలివాడైపోయాడు. జనాలకూ ఆయన వైద్యంలో నమ్మకం పోయింది. డాక్టరీ కోర్సు చదువుతున్న తన మేనల్లుడు గోపాలకిషన్‌రావు గంధసిరిలో ప్రాక్టీసు పెడ్తే బావుంటుందని ఆమె ఆశించింది కానీ, ఆమె ఆశ ఆడియాసే అయింది. తండ్రీ కొడుకుల ఆశలు సముద్రాలు దాటి పయనిస్తున్నాయి. ఆమె కోరికను ఇద్దరిలో ఎవరూ గమనించలేదు.

ఆమె నగల విషయంలో వివాదం వచ్చాక, హరినారాయణరావు అక్క పరిస్థితిని చూసి దిగిపోయాక అనసూయమ్మ ఎవరింటికి వెళ్ళినా, ఎవరితో మాట్లాడినా, ఎవరు ఆమెకోసం వచ్చినా ఇంటిలోని వారెవరూ పట్టించుకోవడం లేదు. హరినారాయణరావు చూసీచూడనట్టు ఉండిపోయాడు. ఆమె ఊరి పెద్దలను కలిసింది. సాలె జంగమయ్య, కాపు వీరాస్వామి, గౌండ్ల రాములు మొదలయిన కులపెద్దలనే కాక క్రైస్తవ పాస్టర్ పాల్ ప్రభాకర్, స్థానిక మసీదు ఇమాం సయ్యద్ హుసేన్,



వేణుగోపాలస్వామి ఆలయ పూజారి రంగాచారి లాంటి మత పెద్దలను కలిసి చర్చించింది. దొరసానమ్మ వచ్చి తమని సంప్రదించటం వారికి సంతోషం కల్గించింది. వారిని కలిశాక ఆమెకో విషయం అర్థమయింది. ఆసుపత్రి అంటే భారీ డబ్బు ఖర్చుతో ముడిపడి వున్న వ్యవహారం కనుక, ఆ విషయంలో స్థానిక ఎమ్మెల్యే ఆసక్తి చూపిస్తే సర్కారువారే ఆసుపత్రి ఏర్పాటు చేయవచ్చు.

ఓరోజు తమ్ముడు సంతోషంగా ఉన్న సమయం చూసి ఆసుపత్రి విషయం ప్రస్తావించింది అనసూయమ్మ.

"తమ్ముడూ! నాకో కోరిక ఉందిరా. నువ్వు అది తీర్చాలి" అంది.

అప్పుడే రెండో కూతురు సుగుణను భోపాల్ కాపురానికి పంపి, హైదరాబాదు నుండి తిరిగి వచ్చాడు హరినారాయణరావు.

"ఏఁవిటో చెప్పు? " అన్నాడతను కనుబొమ్మలు ముడుస్తూ.

"గోపాలుడు పైచదువులకు అమెరికా వెళ్ళాడు. ఆడపిల్లల పెళ్ళిళ్లు చేశావు. నాకు ఎంతో సంతోషంగా ఉంది. నువ్వు ఓ సారి మన ఊరిపై దృష్టి మరల్చాలి. మన ఆనందంలో సమాజానికీ భాగం ఉంది."

"ఏఁవిటో, బావగారి పిచ్చి నీకూ కొంత పట్టుకున్నట్టుంది" అని నవ్వాడు హరినారాయణరావు.

"ఇప్పుడు ఆయన సంగతెందుకులే. ఆమధ్య మరియమ్మ చనిపోయింది, సరయిన సమయంలో చికిత్స అందక. వెంటనే చికిత్స లభించి ఉంటే ఆమె బతికి ఉండేది"

మరియమ్మ ప్రస్తావన రాగానే హరినారాయణరావు ముఖం ముడిచాడు.

మరియమ్మకు జబ్బు చేసినప్పుడు అక్క వచ్చి తన్ను కారు అడిగింది. తను విముఖత ప్రదర్శించినా ఆమె పట్టుబట్టటంతో తను కారు పంపక తప్పలేదు.

వెళ్ళేటప్పుడు ఆమెకు డబ్బేమయినా అవసరమవుతుందేమోనని తను విచారించలేదు. ఆమె నగలు తిరిగి ఇచ్చేసినప్పటి నుంచీ ప్రతినెలా ఆమెకు వెయ్యి రూపాయలు ఇస్తూనే ఉన్నాడు. ఆమె ఖమ్మం చేరగానే కారు తిప్పి పంపింది. హైదరాబాదు నుండి తిరిగి వచ్చాక, మరియమ్మ మరణించిందని తెల్సి, ఇంక అలగాజనంతో సంబంధం తెగిపోయిందని సంతోషించాడు. కానీ, ఇప్పటి అక్క ప్రస్తావన విన్నాక, ఆమె ఇంకా ఆ విషయం మర్చిపోలేదని అతనికర్థమైంది.

అతన్ని ఆలోచనల నుండి మేల్కొల్పుతూ అనసూయమ్మ చెప్పింది.

"మనం సమాజంలో హక్కులతో పుట్టాం. పాతకాలంలో న్యాయమో, అన్యాయమో మన దొరతనాన్ని ప్రజలు భరించారు. ఇప్పటి ప్రజాస్వామ్య యుగంలోనూ సమాజంలో నాయకస్థానం వహించింది మనబోటి దొరలే, పెత్తందార్లే, ఎన్నికలన్నారు. జనాలు మనకే ప్రాతినిధ్యం కట్టబెడుతున్నారు. అవసరం కనుక జనాలతో కలివిడిగా తిరుగుతున్నావు, రాజకీయాలు చేస్తున్నావు. క్రితంసారి ఎన్నికల సందర్భంగా మన ఊళ్ళో పి. హెచ్. సి., హైస్కూలు ఏర్పాటు చేస్తానని వాగ్దానం చేశావు, మరెన్నో వాగ్దానాలు చేశావు. వాటిలో కొన్నింటినయినా నిలబెట్టుకోవాలి. జనమూ ప్రజాప్రతినిధులు తమ కోసం ఏదో చేస్తున్నారని భావించాలి. కనీసం ఆ భ్రమలోనయినా జనాన్ని ఉంచాల్సిన బాధ్యత నీమీద ఉంది. అది నీకే శ్రేయస్కరం."

తన అక్క ఇదివరకటి అమాయకపు మహిళ కాదని అతనికర్థమైంది. ఆమె మాటల్లో తన హితకాంక్ష, తను చేయని

వాటిపట్ల అభిశంసనా ఉంది. ఇప్పుడామె తన నియోజకవర్గంలోని ప్రజ! తన అక్క అని ఆమె మాటలు కొట్టిపారేయటానికి వీలులేదు. అందుకే, జనాలను కలిసినప్పుడు విరిసే చిరునవ్వు అతని పెదాలపై నర్తించింది.

"అదేమక్కా, అలా అంటావు! మున్నేటికి అడ్డుకట్ట వేయించలేదూ? వర్షాకాలంలో వరద ముంపుతో ఎంతగా జనం బాధపడిపోయేవారు. పశువులూ, జనం కూడా కొట్టుకుపోయేవారు. ఈ చుట్టుపక్కలకు లాభం కలుగుతుందనేగా పట్టుబట్టి నేను ప్రభుత్వం మైనర్ ఇరిగేషన్ ప్రాజెక్టు చేపట్టేటట్టు చేశాను. మన గ్రామంలోనూ, ఈ చుట్టుపట్ల గ్రామల్లోనూ పదివేల ఎకరాలు సాగవుతున్నాయంటే అది నా ప్రయత్న ఫలితమేగా!" అన్నాడతను.

"నిజమే. దానివల్ల మనకూ లాభం చేకూరింది. మన పొలాలకూ నీళ్లందుతున్నాయి. పంటలు పుష్కలంగా పండుతున్నాయి. మన ఊళ్ళో ఆసుపత్రి అవసరమూ ఉంది. క్రిందటేడు శివనాథుడికి బేదులు పట్టుకుని, పిల్లవాడు నీరసంగా వాలిపోతే నువ్వెంత తల్లడిల్లిపోయావు. కారు చేతిలో ఉంది కనుక వెంటనే ఖమ్మం తీసుకువెళ్ళాం. పిల్లవాడిని ఆసుపత్రిలో చేర్పించాం. వాడిని దక్కించుకోగలిగాం. అలాంటి అవకాశం ఊరిలోని బీదాబిక్కీకి లేదు."

"కనుక్కుంటాను" అన్నాడు హరినారాయణరావు.

నిజానికి ప్రజాప్రతినిధులకు ప్రజలకోసం ఏదో చెయ్యాలనే ఉంటుంది. ఎమ్మెల్యేలు, ఎంపిలు తమ తమ నియోజకవర్గాలకు అది కావాలి, ఇది కావాలి అని డిమాండ్లు చేస్తూనే ఉంటారు గానీ, నిధుల కొరతవల్ల వాళ్ళు అడిగినవన్నీ సమకూరవు. ప్రభుత్వానికి ప్రాధాన్యతాక్రమం ఉంటుంది. కొన్ని పనులకు రూల్సు ఒప్పుకోవు. ఒకోసారి అధిక పలుకుబడి కలిగిన ప్రజా ప్రతినిధులు ఇతర నియోజకవర్గాలకు రావల్సిన ప్రాజెక్టులూ, సంస్థలూ కూడా తమ నియోజకవర్గాలకు తన్నుకుపోతూ ఉంటారు. నిజానికి హరినారాయణరావుకు ఇప్పుడు ప్రముఖంగా కావల్సింది ఊర్లో పిహెచ్‌సి ఏర్పాటు చేయించటం కాదు. పక్కఊరు సంతపాడులో ఎదిగివస్తున్న రామిరెడ్డిని నిలువరించటం. అతను పార్టీలో తనకు ప్రత్యర్థిగా తయారవుతున్నాడు. అతని బలాన్ని హరించే ప్రయత్నంలో పావులు కదుపుతున్నాడు హరినారాయణరావు. అందుకే అతనికి పి.హెచ్.సి. పట్టలేదు.

అయితే, అనసూయమ్మ పట్టు విడిచే మనిషి కాదు. అతను హైదరాబాదు నుంచి తిరిగి వచ్చినప్పుడల్లా ఆ విషయం ప్రస్తావించేది. చివరకు అక్క పోరు పడలేక గంధసిరిలో పి.హెచ్.సి ఏర్పాటు విషయం ప్రయత్నించాడు. వెంకటాపురంలో ఇప్పటికే ఓ పి.హెచ్.సి ఉంది. అక్కడికి పది పన్నెండు మైళ్ళ దూరంలో ఉన్న గంధసిరిలో పిహెచ్‌సి ఏర్పాటుచేయడం కుదరదని అధికారులు చెప్పారు. "అంతగా మీ ఊరిలో పిహెచ్‌సి ఏర్పాటు చెయ్యాలంటే మీరంతా చందా వేసుకుని ఆసుపత్రి భవన నిర్మాణం ఖర్చూ, అవసరమయ్యే పరికరాల ఖర్చూ భరించగలిగితే

## కొత్తగాలి...

**పిల్లికూన**
**ఆడుకుంటోంది**
**తననీడతో**

–పి. శ్రీనివాసగౌడ్, చీరాల

సిబ్బందిని మేం సమకూరుస్తాం" అన్నాడు వైద్యసేవల సంచాలకుడు.

అదే విషయం హరినారాయణరావు అక్కకు చెప్పాడు. "ఆసుపత్రి నిర్మాణానికీ, ఎక్విప్‌మెంటుకీ లక్ష రూపాయలపైనే అవుతుంది. పంచాయితీ ఉచితంగా స్థలం కేటాయించినా, అంత డబ్బు ఎక్కడిదీ? మన ఊళ్ళో చందాలిచ్చే వాళ్ళెవరు? " అన్నాడు.

"నేను ప్రయత్నిస్తాను. నువ్వెంత ఇవ్వగలవో చెప్పు" అడిగింది అనసూయమ్మ.

"నేనా? ఖర్చుల్లో ఉన్నాను. చూస్తాను. జనం ఇచ్చేదానికి ఇబ్బడిగా ఇస్తాను. సరా? "

ఆమె అడిగితే ఎవరు చందాలిస్తారులే అన్న అభిప్రాయంలో ఉన్న హరినారాయణరావు జనాలకు వాగ్దానం చేసినట్లే అక్కకూ వాగ్దానం చేశాడు. ఊరిలో కుల పెద్దలను వెంటబెట్టుకుని ప్రతి ఇంటికీ తిరిగింది అనసూయమ్మ. పక్క గ్రామాలకూ వెళ్ళారు. సంతపాడుకూ వెళ్ళారు. విషయం తెల్సి సంతపాడు రామిరెడ్డి జనాలు చందాలు ఇచ్చింది పోగా మిగతా డబ్బు తను పెట్టుకుని గంధసిరిలో పి. హెచ్. సి. ఆసుపత్రిని నిర్మింపచేస్తానని ముందుకొచ్చాడు. అది అతని రాజకీయపు ఎత్తుగడ అని ఆమెకు తెల్సు. తీరా చందా డబ్బు అతని చేతిలో పెడ్తే తన ఊరిలో పిహెచ్‌సి కట్టించినా అతన్ని అడిగేవాడు లేడు. కానీ అతన్ని పావుగా వాడుకోవచ్చని అనసూయమ్మకు తెలిసివచ్చింది.

ఓరోజు ఊరి కులపెద్దలనందర్నీ పిల్చి తన ఇంట్లో ఓ సమావేశం ఏర్పాటుచేసింది. ఆ మీటింగుకు తమ్ముడిని కూడా ఆహ్వానించింది. ప్రజాస్వామ్య యుగంలో జనాలతో కలవక తప్పదు ఎమ్మెల్యేకు. హరినారాయణరావు నవ్వుమొహంతో అందర్నీ పలకరించి, వారి యోగక్షేమాలు విచారించాడు. పి. హెచ్. సి. ప్రస్తావన వచ్చింది. అనసూయమ్మ ఆసుపత్రి నిర్మాణానికి సంతపాడు రామిరెడ్డి ముందుకు వచ్చినట్టు చెప్పింది. అతనికా అవకాశం ఇచ్చి జనంలో పేరు తెచ్చుకోవడం ఇష్టపడలేదు హరినారాయణరావు.

"మీరంతా కల్సి ఇచ్చిందానికి రెట్టింపు నేను ఖర్చుపెడతాను. మన ఊర్లో పనికి మీరు వెనకాడకూడదు" అని హరినారాయణ అన్నాక, పెద్దలూ మరింత చందా వెయ్యటానికి అంగీకరించారు. రెండు నెలల్లో డెబ్బైవేల వరకు చందాలు పోగుపడ్డాయి. ఆ డబ్బు అనసూయమ్మ తమ్ముడి చేతికిచ్చింది. అతనెంత ఖర్చుపెట్టాడో ఎవరికీ తెలీదుగానీ ఓ యేడాదిలోపల పి. హెచ్. సి. నిర్మాణం పూర్తయింది. వైద్యశాఖ పేర్కొన్న వైద్య సంబంధ వస్తువులు, పరికరాల్ని ఏర్పాటుచేయడం జరిగింది. ప్రభుత్వం కూడా పిహెచ్‌సికి అవసరమైన సిబ్బందిని నియమించింది.

మరదలు విమల ముఖం ముడిచింది. "ఊరి బాగంతా మీ అక్కకే పట్టింది. ఇందులో మీ జేబుకెంత చిల్లుపడిందేం? " అని భర్తను అడిగింది.

ఊరి పెద్దలకంటే హరినారాయణరావు అధికంగా ఖర్చుపెట్టిందేం లేదు. కానీ, తన్నా పనికి వివశుణ్ణి చేసిన అక్క పట్ల అతనికి కొంత విముఖత కలిగింది. అందుకే, ఆ తర్వాత ఊళ్ళో హైస్కూలు ఏర్పాటు చేయాలని ఆమె అంటే అతనేం మాట్లాడలేదు.

ఊళ్ళో ప్రభుత్వంవారు ఏర్పరచిన ప్రాథమిక పాఠశాల తప్ప హైస్కూలు లేక రేణుకను వెంకటాపురం పంపించవల్సి వచ్చింది. అనసూయమ్మకు ఇంగ్లీషు చదువులు లేకపోయినా, స్వాతంత్ర్యానంతర కాలంలో హైస్కూలు అవసరమెంతో ఆమె గుర్తించింది. అయితే ఇప్పటికే పిహెచ్‌సి

ఏర్పాటు వల్ల చేతులు కాల్చుకున్న ఊరి పెద్దలు కాని, హరినారాయణరావు గాని ఆమె ప్రతిపాదన పట్ల అంత శ్రద్ధ కనపర్చలేదు. ఆమె ఊరి పెద్దలను కలిసి చెప్పింది. "పి. హెచ్. సి. సంగతి వేరు. పిల్లలకు చదువు చెప్పించాల్సిన బాధ్యత ప్రభుత్వానిది. భావితరాలను ఆ హక్కు నుంచి వంచించలేదు ప్రభుత్వం. మీరు స్కూలు కోసం డబ్బు ఖర్చుపెట్టాల్సిన అవసరం లేదు. ప్రభుత్వమే పెడ్తుంది. మీ నుంచి నాకు కావల్సిందల్లా సాయం" అని పిహెచ్‌సి ఏర్పాటు వల్ల ఊరిలో ప్రజలకు ఒనగూడిన మేలును వాళ్ళు కాదనలేకపోయారు. జనాలు వెంకటాపురమో, ఖమ్మమో వెళ్ళాల్సిన పరిస్థితి లేదు. డబ్బు అడగకపోతే ఎంత సాయమన్నా చేయటానికైనా వాళ్ళు అభ్యంతరం తెలుపలేదు.

"ఎందుకమ్మా, దొరవారు తల్చుకుంటే క్షణాల్లో అయిపోతుంది" అన్నారు సాలె జంగమయ్య.

"ప్రభుత్వం ఏ పని చేపట్టాలన్నా ముందు ప్రజలనుండి అభ్యర్థన రావాలి. ఎమ్మెల్యేల చేత మనం పనిచేయించుకోవాలంటే ముందుగా మన ప్రయత్నం మనం చెయ్యాలి" అంది ఆమె.

ఆ తర్వాత ఆమె పెద్దలనందర్నీ కూడగట్టుకుని ఖమ్మం జిల్లా విద్యాధికారికీ, కలెక్టరుకు, విద్యాశాఖ మంత్రికి, ముఖ్యమంత్రికీ గంధసిరిలో హైస్కూలు తెరవాల్సిన అవసరాన్ని గురించి నొక్కిచెప్తూ మహజర్లు పంపింది. అవన్నీ బుట్టదాఖలయ్యాయి.

1977 అక్టోబరులో ముఖ్యమంత్రి జలగం వెంగళరావు ఖమ్మం వస్తున్నారన్న వార్త తెలుసుకుని ఆమె ఆయన్ని కలవాలని నిర్ణయించుకుంది. కొంతమంది ఊరి పెద్దలతోను, స్కూలు పట్ల ఆసక్తి ఉన్న జనాలను తీసుకుని ఆమె ఖమ్మం వెళ్ళింది. ముఖ్యమంత్రి విడిదికి చేరుకుంది

## కొత్తగాలి...

**మారణహోమం సృష్టిస్తోంది**
**మావోయిజం**
**మానవతను కోల్పోతోంది**
**మానవ సమాజం**

**–మేడిచర్ల సూర్యప్రకాశరావు,**
రామరాజులంక,తూ. గో. జిల్లా

గానీ పోలీసువారు తదితర యంత్రాంగం ఆమెను ముఖ్యమంత్రి దరికి చేరనివ్వలేదు.

"మీరు ముఖ్యమంత్రిని కలవాలంటే అపాయింట్‌మెంట్ తీసుకోవాలి. అందుకు అభ్యర్థన రాసివ్వండి. ఆయన అపాయింట్‌మెంట్ ఇచ్చినపుడు కలవవచ్చు" అన్నారు.

"ముఖ్యమంత్రి ప్రజాసేవకుడు. ఆయన్ను కలవాలంటే అపాయింట్‌మెంట్ తీసుకోవాలా? ఇప్పుడు అభ్యర్థన ఇస్తే ఆయన్ను ఎప్పుడు కలవటానికి వీలుపడుతుంది? " అడిగింది అనసూయమ్మ.

"ఏమో చెప్పలేం. మీ అదృష్టం బావుంటే రేపే కలవవచ్చు"

"అదృష్టంమీద భారంవేసి నేను కూర్చోలేను. ఇప్పుడే ముఖ్యమంత్రిని కలవాలి"

"అదేంటమ్మా మొండితనం. మిమ్మల్నిప్పుడు ముఖ్యమంత్రి కల్సే అవకాశం లేదు"

"అవకాశం ఉంటుంది. ఆయన్ని కలవకుండా నేనిక్కడనుంచి వెళ్ళను" అని చెప్పి ఆమె అక్కడికక్కడే నేలమీద కూర్చుండిపోయింది. ఆమెతో వచ్చినవారూ ఆమె పక్కన కూర్చుండిపోయారు. "ముఖ్యమంత్రిని కలవాలి" అని నినాదాలివ్వసాగారు.

పోలీసు సూపరింటెండెంట్ "మీరిక్కడి నుంచి వెళ్ళకపోతే లాఠీఛార్జి చెయ్యాల్సి

## మరీవింత

**న్యూ** ఇంగ్లాండ్ సొసైటీలో జరిగిన ఓ విందులో మార్క్‌ట్వెయిన్ ప్రసంగించిన తర్వాత అక్కడే ఉన్న అటార్నీ విలియం ఎం.ఎవార్ట్స్ తన అలవాటు ప్రకారం కోటుజేబుల్లోకి చేతులు పోనిచ్చి 'ఇలాంటిచోట ఒక వృత్తిహాస్యకారుడు తమాషాగా కనిపించడం వింతగా లేదూ?' అన్నాడు ఒకింత వ్యంగ్యంగా. వెంటనే మార్క్‌ట్వెయిన్ లేచి నిలబడి, 'ఔను, విందులో ఇంతమంది ఉన్నప్పుడు ఓ న్యాయవాది తన జేబుల్లోకే తన




చేతుల్ని పెట్టుకోవడం మరీవింతగా ఉంది' మాటకు మాట బదులిచ్చాడు.

ఉంటుంది" అని బెదిరించాడు. ఆయనకు అనసూయమ్మ తత్వం తెలియదు.

"ప్రజా ప్రతినిధిని కలవటానికి ప్రజలు వస్తే, అది తిరస్కరిస్తూ లాఠీదెబ్బలు ప్రసాదిస్తామంటున్నారు. ప్రజాస్వామ్యంలో జనాలకు లాఠీదెబ్బలే గతి అంటే మేం చెప్పగలిగిందేం లేదు. అలాగే మీ ప్రయత్నం మీరు చెయ్యండి. నేను ఇక్కడ నుండి కదలను. ఆయన్ను కలిసేదాకా నిరాహారదీక్ష చేపడ్తున్నాను" అంది అనసూయమ్మ.

పోలీసు సూపరింటెండెంట్ లాఠీఛార్జికి హుకుం ఇచ్చేవాడే. అంతలో బయట జరుగుతున్న గడబిడేమిటో తెలుసుకురమ్మని ముఖ్యమంత్రి పంపిన పి.ఎస్. పరిస్థితి వివరించడంతో ఆయన ఆమెను లోపలకు పిలిపించమని ఆదేశమిచ్చాడు.

అనసూయమ్మ ముఖ్యమంత్రి ఆసీనుడై ఉన్న గదిలోకి వెళ్ళి అభివాదం చేసింది. ఆ జిల్లాకు చెందిన మరో ఇద్దరు ఎమ్మెల్యేలతో పాటు హరినారాయణరావూ అక్కడే కూర్చుని వున్నాడు. అక్కడ అక్కను చూసి అవాక్కయిపోయాడు అతను.

ప్రతి అభివాదం చేస్తూ "ఎవరమ్మా నువ్వు? ఏం కావాలి నీకు? కూర్చుని చెప్పమ్మా" అన్నాడు ముఖ్యమంత్రి.

ఆమె ఎదుట వున్న సోఫాలో కూర్చుంది. "మాది గంధసిరి గ్రామం. మా ఊళ్ళో హైస్కూలు లేదు. మా ఊరికి దిగువన వున్న సంతపాడు, మర్పల్లి లాంటి గ్రామాల్లోని విద్యార్థులు రోజూ పదిహేను, ఇరవై మైళ్ళు ప్రయాణం చేసి వెంకటాపురంలో చదువుకోవాల్సి వస్తోంది. విద్యార్థులు ఎంతో ఇబ్బందిపడ్తున్నారు. వాళ్ళు చదువుకోవాల్సిన సమయమంతా ప్రయాణంలోనే గడిచిపోతున్నది. అమ్మాయిలను వెంకటాపురందాకా పంపించి చదివించటం ఇష్టంలేని తల్లిదండ్రులు చదువులు మానిపిస్తున్నారు. ఈ విషయంలో ప్రభుత్వానికి మేమెన్నో మహజర్లు పంపాం. కానీ, అవి తమకు చేరాయో లేదో కూడా మాకు తెలియదు" అని విన్నవించుకుంది ఆమె.

ముఖ్యమంత్రి కార్యదర్శి వంక చూశాడు.

"అవును. మహజర్లు అందాయి. వెంకటాపురం గంధసిరికి పన్నెండు మైళ్ళ దూరంలోనే ఉంది. అందువల్ల అక్కడ ప్రత్యేకంగా ప్రభుత్వ సెకండరీ స్కూలు తెరవాల్సిన అవసరం లేదని ప్రభుత్వం భావించింది" అని చెప్పాడు అతను.

"విన్నావుగా అమ్మా! పరిస్థితి! అవునూ, గంధసిరిలో మా ఎమ్మెల్యే హరినారాయణరావుగారు ఉన్నారు కదా! మీరు వారికి అర్జీలు పంపకుండా ఇంతదూరం మమ్మల్ని కలవటానికి ఎందుకు వచ్చినట్టు?"

"హరినారాయణరావు మా తమ్ములుంగారే. వారికెన్నో పన్లుంటాయి. స్కూలు

తెరవటం లాంటి చిన్న విషయాలు వారి దృష్టికి రావు. పైగా వారు మా ఒక్క ఊరికి మాత్రమే ప్రాతినిధ్యం వహించరు. ఆయన నియోజవర్గం పెద్దది. మరెన్నో గ్రామాల సంగతి పట్టించుకోవాలి. తన గ్రామం పక్షం వహిస్తే పక్షపాతం చూపారనే అపవాదు వచ్చే అవకాశమూ ఉంది. కనుకనే వారిని ఇబ్బంది పెట్టకుండా, తమరినే కలుద్దామని వచ్చాం మేము."

నిజానికి హరినారాయణరావుకు గంధసిరిలో స్కూలు తెరవటం ఇష్టం లేదు. అతనిలో ఉన్న దొరతనపు మనస్తత్వం ఇంకా నశించలేదు. స్కూళ్ళూ, కాలేజీలు తెరిస్తే ప్రజలు తెలివిమీరిపోతారు. ఇప్పటికే జనం తమ మాటలు వినకుండా తయారవుతున్నారు. అయినా ఆ విషయం బయటకు చెప్పుకోలేని పరిస్థితి! అయితే, అక్క తనపై నెపమెయ్యకపోవడం చూసి అతనికి కొంత స్వాంతన లభించింది.

"ఏమంటారు హరినారాయణరావు గారూ! మీ అక్కగారు మీ ఊళ్ళో హైస్కూలు తెరవాలంటున్నారు" అని అడిగాడు ముఖ్యమంత్రి.

"పెడితే బాగా ఉంటుంది. వెంకటాపురం కూడా పెద్దదూరంలో లేదు" అంటూ బడితె విరగకుండా, పాము చావకుండా సమాధానమిచ్చాడు హరినారాయణరావు.

"మాకు కావల్సినవారు, ఈ జిల్లాకు చెందినవారు మీరు ముఖ్యమంత్రి అయ్యారు. అందుకు మాకెంతో సంతోషం కలిగింది. గంధసిరి పిల్లల కడగండ్లు తీరతాయని ఆశించాం మేము" అంది అనసూయమ్మ!.

ఆమె మాటల్లో ఆయనకేం ధ్వనించిందో గానీ, "నేను ప్రత్యేకంగా ఓ ప్రాంతానికీ, ఓ వర్గానికీ ప్రాతినిధ్యం వహించే ముఖ్యమంత్రిని కాదు. మొత్తం ఆంధ్రప్రదేశ్ సంక్షేమం నా దృష్టిలో ఉంటుంది. మా ఎమ్మెల్యేగారికి గంధసిరిలో హైస్కూలు ఉండాల్సిన అవసరం కన్పించటం లేదు" అన్నాడాయన ఇంక సంభాషణ ముగించినట్లు.

అయితే అనసూయమ్మ తన పట్టు విడువలేదు. ఆ చుట్టుపక్కల ఉన్న పది పన్నెండు గ్రామాలలో గంధసిరి గ్రామమే పెద్దది, ఎమ్మెల్యేగారి ఊరుకూడ. పది పన్నెండు మైళ్ళు దూరం వెంకటాపురం. గంధసిరికి దిగువన ఉన్న ఊళ్ళ పిల్లలకూ వెంకటాపురమే దిక్కు. ఆ ఊళ్ళ విద్యార్థులు మరికొన్ని మైళ్ళదూరం పయనించాల్సి వుంటుంది. ప్రభుత్వం షెడ్యూలు కులాలు, తెగలవారికి అధిక ప్రాధాన్యమివ్వాలంటోంది. ఆ వర్గాల వారికి పిల్లల్ని అంత దూరం పంపి చదివించే స్తోమత లేదు. బతుకు గడవడమే కష్టంగా ఉంటే, పిల్లల్ని స్కూలుకు పంపటమే గగనం. అలాంటిది దూర ప్రయాణం చేయించి పిల్లల్ని చదివించడటం జరిగేపని కాదు- అంటూ ఆమె వివరంగా గంధసిరిలో స్కూలు పెట్టాల్సిన ఆవశ్యకతను గూర్చి వివరించింది.

"ప్రభుత్వ ఆర్థిక పరిస్థితిని కూడా చూసుకోవాలి కదా, అక్కా! అన్ని ఊళ్ళల్లో హైస్కూలు పెట్టాలంటే కుదిరేపని కాదు" అన్నాడు హరినారాయణ, ముఖ్యమంత్రి మనస్సులోని ఆలోచననుసరిస్తూ.

## కొత్తగాలి...

**పదహారేళ్లపరువం**
**ఓణీ పారేసుకుంది**
**కొత్త సంస్కృతి**
**ఒళ్లు ఆరేసుకుంది**

—చలపాక ప్రకాష్, విజయవాడ



"అవునండీ. మా ఊళ్ళోనూ హైస్కూలు పెట్టాలని ప్రతిపాదన పెట్టారు. ఎలా కుదురుతుంది. నేను నిర్ద్వంద్వంగా చెప్పాను అది సాధ్యంకాని విషయమని" అన్నాడు ముఖ్యమంత్రి.

ఆయన పక్కన కూర్చున్న ఎమ్మెల్యే కూడా ముఖ్యమంత్రిది సరైన నిర్ణయమే అని తల ఊపాడు.

"అదమ్మా, పరిస్థితి! మీరింక వెళ్ళిరండి" అన్నాడు ముఖ్యమంత్రి.



"వెళ్తాను, ముఖ్యమంత్రిగారూ! అయితే, నేను నా ప్రయత్నం ఆపను. ఒక్కమాట గుర్తుంచుకోండి-

'సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః

అప్రియ స్యచ పథ్యస్య వక్తా శ్రోతాచ దుర్లభః' అన్నది ఆమె.

"అంటే ఏమిటమ్మా అర్థం? "

"ప్రజలకు ఏది హితమో ముఖ్యమంత్రికి చెప్ప వెరిచే ప్రజాప్రతినిధులు, ప్రజల అవసరాన్ని కూడా నిర్లక్ష్యం చేస్తారుగానీ, చెప్ప సాహసించరు. అది ఏ ప్రభువుకూ మంచిది కాదు. మీకప్రియమైన విషయమైనా ప్రజలకభీష్టమైతే చెప్పటానికి భయపడని వక్తా, అలాంటి మాటలు వినటానికి సిద్ధపడే శ్రోతా లభించటం దుర్లభమని ఆ రామాయణ శ్లోకానికర్థం" అంది, ఆమె శ్లోకార్థాన్ని ప్రస్తుతానికి అన్వయిస్తూ.

ఆమె మాటలు విన్న హరినారాయణ రావు ముఖం మాడిపోయింది.

ముఖ్యమంత్రి ముఖం విప్పారింది. "ఏం చదువుకున్నావమ్మా!" అని ఆయన అడిగాడు.

"నేను పాతకాలం మనిషిని, అప్పటి వెలమదొరల సంప్రదాయం ప్రకారం మా నాయనగారు నాకు చదువు చెప్పించారు. ఇప్పటి ఇంగ్లీషు చదువు కాదు. కానీ, ఈమాత్రమైనా ప్రజల కడగండ్లు మీకు చెప్ప సాహసించాలంటే, అందుకు మా తమ్ములుంగారు ఇచ్చిన ప్రోత్సాహం, ధైర్యమే కారణం" అంది ఆమె.

ఆమె 'తమ్ములుంగారు' అనటంలో సంప్రదాయం ఉంది, ఎద్దేవా ఉంది. ఆ 'తమ్ములుంగారు' కక్కాలేని, మింగాలేని పరిస్థితి.

"సంతోషమమ్మా! నేను మాట ఇస్తున్నాను. మళ్ళీ మీ అభ్యర్థనను నేను పునః పరిశీలిస్తాను. వీలయినంతవరకు మీ అభ్యర్థనను మన్నించే ప్రయత్నం చేస్తాను. అట్లా అని నూటికి నూరుపాళ్ళు మీరు కోరుకున్నట్లు జరుగుతుందని భావించవద్దు"

ముఖ్యమంత్రి ఆమె పాండిత్యం పట్ల



ప్రభావితుడయ్యాడు. ఆమెలో ఆయనకు భవిష్యత్ రాజకీయ నాయకురాలి లక్షణాలు కన్పించాయి.

వెంగళరావు అనసూయమ్మకిచ్చిన వాగ్దానాన్ని మర్చిపోలేదు. 1978 జనవరి మొదటివారంలో ఆమెకు ఖమ్మం జిల్లా విద్యాశాఖాధికారి నుండి వర్తమానం వచ్చింది. వచ్చి తనను కలుసుకోవల్సిందని, వెళ్ళాక ఆయన చెప్పాడు- "మీ అభ్యర్థన ముఖ్యమంత్రి స్వయంగా పరిశీలించారు. మీరు చెప్పిన విషయాలు హేతుబద్ధంగా ఉన్నాయని ఆయన గ్రహించారు. జి.వో. కూడా విడుదల చేశారు. వీలయినంత త్వరలో మేం గంధసిరిలో హైస్కూలు ఏర్పాటు చేయబోతున్నాం. మీకీ విషయాన్ని స్వయంగా చెప్పమని నాకు తాఖీదు వచ్చింది" అని.

అయితే హైస్కూలు ఏర్పాటయ్యేలోపలే ఎన్నో పరిణామాలు సంభవించాయి. అసెంబ్లీ ఎన్నికల్లో వెంగళరావు వర్గీయుడయిన హరినారాయణరావు ఓడిపోయాడు. ఇందిరా కాంగ్రెస్ టిక్కెట్టు లభించిన సంతపాడు రామిరెడ్డి ఆ నియోజకవర్గానికి ఎమ్మెల్యేగా ఎంపిక అయ్యాడు. తను ఓడిపోవడం ఒక ఎత్తయితే, రామిరెడ్డి గెలవటం మరింత అవమానానికి గురిచేసింది హరినారాయణరావును.

ఏది ఏమయినా హైస్కూలు ఏర్పాటు మాత్రం నిశ్చితమైంది. గంధసిరి పంచాయితీ ఉచితంగా కేటాయించిన స్థలంలో టెంపరరీ షెడ్లలో హైస్కూలు 1978 జూన్‌లో ప్రారంభమైంది. హరినారాయణరావు హైదరాబాద్‌కు మకాం మార్చాడు.

అనసూయమ్మ హైదరాబాద్ వెళ్ళనిచ్చగించలేదు. ఆమె ఉంటున్న భాగం వదిలి, మిగతా దేవిడీకి తాళం వేయించి హరినారాయణరావు కుటుంబంతోసహా హైదరాబాద్ వెళ్ళిపోయాడు.




**దే**వదానంకు తన కూతురు వెంటపడే కుర్రాడెవరో తెల్సుకోవటం కష్టం కాలేదు. అతని రెండో భార్య సువార్త అతనడక్కుండానే వార్తని చేరవేసింది.

"మంచిగనే పెంచుతున్నావయ్యోవ్, కూతుర్ని!" అని ఎద్దేవా చేస్తూ.

"ఏమయ్యింది? " అడిగాడు దేవదానం పెద్దగా ఆశ్చర్యపోకుండా.

సువార్త సవతి కూతురు రేణుక కంటే ఏడెనిమిదేళ్ళు పెద్దది. తనకు లేనివేవి రేణుకకు ఉండటం ఆమెకిష్టం లేదు. తను చదువుకునే అవకాశం లేదు. తమది మరీ దరిద్రపు కుటుంబం కనుక ఈ రెండో పెళ్ళివాడికిచ్చి పెళ్ళి చెయ్యాల్సి వచ్చింది. తన కన్నవారంటే ఆమెకు మంట. ఆ మంటను సవతి కూతురుపై ప్రసరింపచేసేది. కాలేజీ చదువు కాక రేణుక పాటలు, పద్యాలు అంటూ అనసూయమ్మ ఇంటికి వెళ్ళటం కూడా ఆమె సహించలేని విషయం. ఇంట్లో పనిచేయకుండా, ఊర్ని పట్టి తిరగటమేమిటని ఆమె ఫిర్యాదు. తనకు పెళ్ళికాగానే ఏటా కాన్పు రావటం కూడా ఆమెకిష్టంలేని విషయమైంది. ఈ పిల్లలతో తను హాయిగా రేణుకలా తిని తిరుగుతూ కాలం గడిపే అవకాశం లేక పోయిందని ఆమె భావన. రేణుకే కాక కొంపలో అత్తమ్మ చెంచులమ్మ మరో తద్దినం. 'కాటికి కాళ్ళు చాచుకున్నా దేవుడు

# సూపర్ మాన్




**అ**తన్నంతా 'మానవ ఈగ' అని ముద్దుగా పిలుస్తుంటారు. ఫ్రాన్స్ దేశస్థుడు, ముగ్గురు పిల్లల తండ్రి అయిన ఈ సాహసి అలెన్ రాబర్ట్ ఆస్ట్రేలియాలోని 1260 అడుగుల ఎత్తుగల సిడ్నీ టవర్‌ని నిరాధారంగా ఎక్కసాగాడు... కాని 495 అడుగుల ఎత్తు ఎక్కాక అతన్ని పోలీసులు పట్టుకొని కిందికి దింపేసారు. ఆ తర్వాత అతను మలేషియాలో ఉన్న కౌలాలంపూర్‌లోని ప్రపంచంలోని అతి పొడవైన భవంతి అయిన 1483 అడుగుల ఎత్తుగల పెట్రోనాస్‌ట్విన్ టవర్స్‌కి ఎక్కడానికి వెళ్లాడు.

పిలవనంపటం లేదు, ఆ మొండి జీవిని' అని ఆమె అభిప్రాయం. తనేమన్నా రేణు కనంటే, ముసల్ది ఊరికే పోట్లాటకు వస్తుంది. ఆమె మాటల్లోనే తన "మొండి మొగుడు" తన మాటలు వినడు కనుక "ఆళ్ళ రాజ్యం నడుస్తోంది" అనుకుంటుంది ఆమె. ఆమె అభిప్రాయాలన్నీ తనకు తెల్సు కనుక దేవదానమేం పెద్దగా ఆశ్చర్య పోలేదు.

"ఆడు- నారాయణంట -ఆడి ఎంటపడి తిరుగుతోంది. అవ్వ! ఆడి కులమేంది, మన కులమేంది? " అంది సువార్త నోరు నొక్కుకుంటూ.

"నారాయణా? శౌరయ్య కొడుకా? " అన్నాడు దేవదానం ఆశ్చర్యపోతూ.

"అవును. మొన్న నువ్వు చర్చికి రాలేదు. ఎప్పుడూ ట్యూషన్లంటూ ఛస్తుంటావు. ఆరోజు అదీ, ఆడూ చర్చిలో కూర్చుని ఏం ఇకఇకలూ, పకపకలూ, అప్పటికింకా పాస్టరు చర్చిలోకి అడుగుపెట్టలేదు. ఎవర యినా చూసిపోతారని కూడా నీ కూతురికి సిగ్గులేదు. ఇది పడబోవటం, ఆడు దీని భుజాలు పట్టుకుని ఆపటం, అంతా నాటకం. నేనేం ఊర్కోలేదు- ఏందే ఆడితో నీకు మాటలూ- అని అడిగా. 'పాస్టరు ఎప్పుడు వస్తాడని అడిగిండు. జవాబు చెప్పినా. తప్పేంది? ' అంది నీ కూతురు. 'చంపేస్తాను. నా ఎదుట ఇట్టాంటి భాగో తాలు జరగటానికి ఈల్లేదు' అంటి" అని చెప్పింది సువార్త.

ఆ రోజు కూతురు కాలేజీ నుండి తిరిగి రాగానే, దేవదానం కూతుర్ని తిట్టి, "జాగ్రత్త, మళ్ళీ ఆడితో మాట్టాడినట్టు తెలి సిందంటే నీ ఒళ్ళు చీరేస్తాను" అని హెచ్చ రిక చేశాడు.

నారాయణ తన కూతురి వెంటపడటం దేవదానం సహించలేకపోయాడు. రేణుక పైకి చదివి, మంచి ఉద్యోగం సంపాదిం చాలి. అప్పుడే తన కులం, మతంలో మంచి వరుణ్ణి ఎంపికచేసి పెళ్ళి చేస్తాడు. ఏవిధంగా చూసినా నారాయణ తన కూతురికి సరియైన జోడీ అన్పించలేదు. నారాయణ పట్ల అతని మొదటి అభ్యం తరం కులం. వాళ్ళు మాదిగవాళ్ళు. ఎడ మచేతి కులంవాళ్ళు. తమది కుడిచేతి కులం. అస్పృశ్యుల్లో తమది అగ్రకులం. ఆ తక్కువ కులంవాడికి తన కూతుర్ని ఇవ్వ లేడు. బంధువర్గంలో ఆ పనిని ఎవరూ హర్షించరు. ఆపైన వాళ్ళు హిందువులు. అణగారిన వర్గాలయి ఉండీ, విపరీతమ యిన వివక్షకు గురవుతూ ఉండే నిమ్న హిందూ వర్గాల పట్ల అతనికెలాంటి సహ నమూ లేదు. "చీమూ నెత్తురూ లేదు మ నుషుల్లో" క్రైస్తవం తనకు దారి చూపింది. నారాయణ పట్ల అతని మరో అభ్యంతరం -శౌరయ్యది అంత పరువైన కుటుంబం కాదు. అల్లుళ్ళను ఇల్లరికం తెచ్చుకున్నాడు. వాళ్ళస్థాయి జీతగాళ్ళకు పైకి ఎదగలేదు. పెద్దకొడుకు శంకరయ్య హత్యచేసి జెయిలు పాలయ్యాడు. వీడు నారాయణ డింకీలు కొట్టి పదోక్లాసు పాసయ్యాననిపిం చాడు. అదీ కాపీలు కొట్టి పాసయ్యాడు. అల్లరి చిల్లరిగా తిరుగుతున్నాడు. అలాంటి వాడికి తన కూతురునెలా కట్టబెట్టగలడు?

కూతురు రేణుక అంటే దేవదానంకు ఎంతో ప్రేమ. పోయిన భార్య మరియమ్మ సుగుణాలన్నీ పుణికిపుచ్చుకుని పుట్టిన బిడ్డ. సువార్తను తన అవసరానికి పెళ్ళి చేసుకున్నాడుగానీ, ఈమె మరియమ్మకు సాటివచ్చే వ్యక్తి కాదు.

మరియమ్మకు తన మాట శిరోధార్యం. ఒక్క దొరసాని అనసూయమ్మ వద్దకు వెళ్ళవద్దన్నప్పుడు మాత్రమే కాదని తన చేతిలో దెబ్బలు తింది. అయితే, ఆ విష యంలో తనే పొరపాటు పడ్డాడు. తల్లి మాటలు విని వాళ్ళ స్నేహం భగ్నం

చెయ్య ప్రయత్నించాడు. ఆ దొరసాని మరియమ్మంటే ప్రాణం పెట్టింది. అగ్ర కులాల్లోని స్త్రీలలో అరుదయిన మహిళ ఆమె. టైలరింగ్ ట్రైనింగ్ సెంటరుకు వెళ్ళ వద్దని తాము అభ్యంతరపెట్టినప్పుడు, స్త్రీలకు కుట్టుపనిలో శిక్షణ ఇచ్చినందుకు మరియమ్మకు ప్రతి నెలా యాభై రూపా యలిచ్చేది. ప్రభుత్వ కాంట్రాక్టులూ ఇప్పిం చింది. తను ఆ రోజుల్లో కొంత ఆర్థికంగా పుంజుకోవటానికీ, తన తమ్ముడి చదువుకు డబ్బు పంపటానికీ వెసులుబాటు కల్గిం చింది. మరియమ్మ ప్రసవం కష్టమై, ఖమ్మం ఆస్పత్రిలో చేర్పించినప్పుడు ఆమె తన అగ్రకులపు అహాన్ని పక్కనపెట్టి మరి యమ్మ ఆసుపత్రిలో ఉన్న మూడు రోజులూ తనే ఆమెకు సేవచేస్తూ ఉండిపో యింది.

తన తల్లి చెంచులమ్మ కోడలుకు సాయం చెయ్య నిరాకరించింది. "ముసలి ముండను నేనేం చెయ్యగలనురా. దాని కన్నోళ్ళను పిలవనంపు" అంది. తను వాళ్ళకు కబురు పంపాడు. వాళ్ళు వచ్చేట ప్పటికి మరియమ్మ ప్రాణం కడబట్టింది. ఎవరు వచ్చినా దొరసానమ్మకంటే అధికం గా చెయ్యగలిగిందేం లేదు. మరెవరు వచ్చినా అనసూయమ్మ లేకపోతే మరియ మ్మకు స్వాంతన కలిగేది కాదు. అంత స్నేహం వాళ్ళకు! ఆమె కుటుంబంవారు ఇలా ఆమె ఓ అస్పృశ్య బడుగు స్కూలు టీచర్ భార్యకు సేవ చెయ్యటానికి ఖమ్మం వెళ్ళటాన్ని గర్హించారు. ఆమె ఖమ్మం వెళ్ళటం వారెవరికీ అణుమాత్రం ఇష్టంలేదు.

మరియమ్మకు ప్రసవం కాక మహా బాధపడిపోతుంటే, ఏం చెయ్యాలో తోచక తను పాస్టరు దగ్గరకు వెళ్ళాడు. "ఖమ్మం తీసుకువెళ్ళు దేవదానం! ఇక్కడే ఉంచితే ఆమె ప్రాణాలకు వస్తుంది. ఆమెకు సుఖ ప్రసవమవ్వాలనీ, తల్లీ బిడ్డా సురక్షితంగా

## కొత్తగాలి...

**ఒత్తిఒత్తి పలికితే ఒత్తక్షరాలు**
**ఒత్తులేసి వెలిగిస్తే దీపాలు**
**ఒత్తితే చపాతీలు, పూరీలు**
**ఒత్తులు లేకపోతే తమిళాక్షరాలు**

**–అరిపిరాల సువర్ణ,** బెంగుళూరు

ఈ ఉపద్రవం నుంచి బయటపడాలని నేను ప్రార్థిస్తాను. ప్రభువే ఉన్నాడు" అని అన్నాడు ఆయన.

"ఓ రెండు మూడొందలుంటే సాయం చెయ్యి, ఫాదర్! ఐదారు నెలల్లో అప్పు తీరుస్తాను" అని అడిగాడు తను.

"ప్రస్తుతం అంత డబ్బు నా దగ్గర లేదు. మనవాళ్ళెవరయినా సాయం చెయ్య గలరేమో ప్రయత్నిస్తాను. ఖమ్మం మిషను ఆసుపత్రికి ఉత్తరం రాసిస్తాను. అక్కడకు తీసుకువెళ్ళు. వాళ్ళు బాగా చూస్తారు"

చేతిలో చిల్లిగవ్వలేదు. తను అప్పటి దాకా ఆదర్శాల్లో బతికాడు. క్రైస్తవ సామ్రాజ్యం విస్తరించాలనీ, నిరక్షరకుక్షుల యిన బడుగు వయోజనులు అక్షరాస్యులు కావాలనీ తను తపన పడిపోయాడు. తన మేరకు తను కృషిచేశాడు. అందుకు డబ్బు రూపేణా తన పొందిందేం లేదు. ఆ తర్వాత తన స్కూల్లో పనిచేసే మరో టీచరు రమణయ్యను డబ్బు సర్దమని అడి గాడు. అతడు రజకుల కులానికి చెందిన వాడు. తనపట్ల అస్పృశ్యుడన్న భావనే కాక, ఓ రకమైన అవహేళన అతనికి ఉంది. "నా దగ్గర పైసలేడ ఉన్నాయ్! నీకు తెలీంది ఏముంది? " అని నవ్వాడ



తను. "ఆదర్శమంటూ బతికావు. ఉన్న పైసలు కూడ తగలెట్టావు. భవిష్యత్తును గురించి ఆలోచించలేదు. నేను అప్పుపెడ్తే ఎలా తీరుస్తావు? " అన్న భావాలన్నీ అతని మాటల్లో తనకు ధ్వనించాయి. అయితే పైకి ఏ సలహా ఇవ్వలేదు. కష్టంలో సాయమందివ్వక, సలహాలిచ్చేవా ళ్ళంటే తనకు మండిపోయింది.

తను సృజించుకున్న లోకమంతా అలా చెయ్యి వెళ్ళబెట్టాక మరియమ్మ సృజించు కున్న ప్రపంచానికి బయలుదేరాడు.

ఇంక మిగిలింది ఒక్క దొరసానమ్మ సాయమర్థించటమే. తను ఆమె ఇంటికి వెళ్ళగానే, ముంగిట హరినారాయణరావు దొర కన్పించారు.

"ఏంది పంతులూ, ఇట్లొచ్చినావు? " అని అడిగినాడు.

"నా పెళ్ళానికి ప్రాణాల మీదకొచ్చినాది. దొరసానమ్మకు చెప్పిపోదామని వచ్చినాను" అన్నాడు తను.

"అట్లనా? ఆమెకు చెప్పి ప్రయోజన మేంది? ఆసుపత్రికి తీసుకెళ్ళు"

తను మాట్లాడలేకపోయాడు. "అమ్మకు ఓ సారి చెప్పి..." అని చెప్పి తను నీళ్ళు నమిలాడు.

"నే చెబ్తున్నది చెవులబడ్తలేదా? నీ పెళ్ళానికి జబ్బు చేసినాదంటే డాక్టరుకు చూపించాలి గానీ మా అక్క ఏం చేస్తుంది. వెళ్ళు వెళ్ళు" అన్నాడు ఆయన.

తనకేం చేయాలో దిక్కుతోచలేదు. అంతా ఏసుప్రభువు మీద భారంవేసి నడు చుకుంటూ ఇంటిదారి పట్టాడు. పరధ్యా నంలో తన పక్కన కారు ఆగటం కూడా తను గమనించలేదు. తలుపు తీసి, "కారు ఎక్కు దేవదానం! ఎట్లుంది మరియ మ్మకు? " అని అడిగింది దొరసానమ్మ.

ఆమెకు జవాబు చెప్పే స్థితిలో తను లేడు. దిగ్భ్రమలో డోరు తెర్చుకుని ముందుసీటులో కూలబడ్డాడు. కారు బయ లుదేరాకగానీ, తమ్ముడికి ఏం చెప్పిందో కారు తీసుకుని వచ్చిందని అర్థం కాలేదు.

ఇంటికి వెళ్ళాక మరియమ్మ పరిస్థితి చూసి, "ఏందయ్యా దేవదానం! నా చెల్లెలి పరిస్థితి ఇట్లా ఉంటే నాకొక్క కబురు చేస్తివి కాదు. సర్లే పద, దాన్ని ఖమ్మం తీసుకువెళ్దాం" అన్నది ఆమె.

తను నసిగాడు, "పైసలు..." అంటూ.

ఆమె తన మాటలు పూర్తి చెయ్యనివ్వ లేదు. "డబ్బు అదే వస్తది. దాని ప్రాణాల కంటే డబ్బు ఎక్కువ కాదు"

డ్రైవరూ, తనూ మరియమ్మను ఎత్తు కుని తీసుకువచ్చి కారు వెనుకసీటులో కూర్చోబెట్టారు. మరియమ్మ విపరీతంగా బాధపడిపోతోంది. ఆయాసపడుతోంది. దొరసానమ్మ ఆమె పక్కనే కూర్చుని ఆమెకు ధైర్యం చెప్పే ప్రయత్నం చేసింది. "నీకేం కాదే, నేనున్నాను. సుఖప్రసవమవు తుంది. కాస్తంతసేపు ఓర్చుకో. ఎంతసేపు, గంటలో మనం ఖమ్మం వెళ్ళిపోతాం" అంది ఆమె.

ఆమె మాటలతో శారీరకంగా ఉపశ మనం లభించకపోయినా, మరియమ్మకు నైతిక బలాన్నిచ్చాయి. 'తన పక్కన అక్క ఉంది. తన్ను కాపాడుతుంది' అన్న ధైర్యం కలిగింది ఆమెకు.

పాస్టరు చెప్పిన మిషను ఆసుపత్రికి తీసుకువెళ్ళారు తాము మరియమ్మను. ఆయన ఇచ్చిన సిఫారసు ఉత్తరం చూపాడు తను. అయితే చికిత్సలో కొంత కన్సెషను ఇచ్చారు కానీ, అసలు డబ్బు కట్ట కుండా పని జరగలేదు. దొరసానమ్మ డబ్బు చెల్లించింది. ఆ రోజుల్లోనే సుమా రుగా రెండువేల రూపాయలు మందు లకూ, ఆసుపత్రికీ ఖర్చయ్యాయి.

ఆసుపత్రిలో చేర్పించిన మూడు రోజు లకు మరియమ్మ చనిపోయింది. విపరీత

మైన రక్తపోటుకు గురయింది ఆమె. అది మెదడుపై ప్రభావం చూపెట్టింది. ఆ రక్త పోటును అదుపు చేయగలగటం అప్పటి వైద్య విజ్ఞానానికి సవాలయింది. మృతశిశువుకు ఆమె జన్మనిచ్చింది. రక్తపోటు అదుపులోకి వచ్చింది. ఆమె బతుకుతుందనుకున్న తరుణంలో మరియమ్మ చివరిశ్వాస విడిచింది.

ఆ మూడు రోజులూ దొరసానమ్మ తన భార్యను కనిపెట్టుకునే ఉంది. భోజనం చేసేది కాదు. పళ్ళూ పాలూ పుచ్చుకునేది. ఆసుపత్రిలో మరియమ్మ బెడ్‌పక్కనే నేలపై తన చీరె పర్చుకుని పడుకునేది. తను మరియమ్మ పడే బాధను చూసి తట్టుకోలేక బయట తిరిగి వచ్చేవాడు కానీ, ఆమె మరియమ్మ పక్కనే కూర్చుని ధైర్యం నూరిపోసేది.

"బతకాలే. బతకాలన్న ఇచ్ఛ నీకు తీవ్రంగా ఉంటే నువ్వు బతుకుతావు. ఇచ్చే మందులన్నీ పైపై ఉపశమనం కల్గించేవే. మనస్సు ప్రధానం. దాన్ని అదుపు చేసుకో. నీకు నమ్మకమున్న దేవుడిపై మనసు నిలుపుకో. నీకు బాగయితే మనం ఎన్ని పనులు చెయ్యాలి!" అని చెప్పేది.

మరియమ్మకు కొంత నిమ్మళంగా ఉన్నప్పుడు కథలు చెప్పేది. సన్నగా పద్యాలు, పాటలు పాడి విన్పించేది. కానీ ఆ ప్రభువు ఆమెను పిలిపించుకోవాలనుకున్నాడు. పిలిపించుకున్నాడు. మానవమాత్రులు ఆయన ఆదేశానికి బద్ధులై నడవవల్సినవాళ్ళు! మరియమ్మ పోయేముందు, అతికష్టంగా గొంతెత్తి హీనస్వరంతో, "అక్కా నా కూతురు"... అని ఏదో చెప్పబోయింది కానీ పూర్తిచేయలేకపోయింది.

"అయ్యో! నువ్వెందుకు చెప్పావే? రేణుక నా కూతురే. దాని బాగోగులు నేను చూడనూ? అయినా నువ్వెక్కడికి పోతున్నావు! నీకు నయమైపోతుంది. ధైర్యంగా ఉండు" అంది దొరసానమ్మ.

## విశ్రాంతినిస్తే ఉత్సాహం

ఓసారి ప్రఖ్యాత కార్టూనిస్ట్ థామస్ నాస్ట్ ఇంట్లో అతిథిగా మార్క్‌ట్వెయిన్ వచ్చాడు. సుష్టుగా లాగించేసి రాత్రి నిద్రకుపక్రమించాడు కానీ ఆ ఇంట్లో టిక్‌టిక్ ధ్వనులు చేస్తున్న గడియారాలు అతన్ని చీకాకు పెట్టాయి. వెంటనే లేచి ఆ ఇంట్లోని గడియారాలను ఆపేశాడు. ఫలితం మర్నాటి ఉదయం ఆ ఇంట్లో ఎవ్వరూ పెందరాళే నిద్ర లేవలేదు. ఇది మార్క్‌ట్వెయిన్ మహత్యమే అనుకుని అతన్ని అడిగితే 'ఆc.. ఆ గడియారాలన్నీ ఇన్ని రోజులు అవిశ్రాంతంగా పనిచేశాయి. ఓ రాత్రి విశ్రాంతినిస్తే మళ్లీ రెట్టించిన ఉత్సాహంతో పనిచేస్తాయని నేనే ఆపేశాను' అన్నాడు కొంటెగా.



ఆ తరువాత మరియమ్మ ఎక్కువసేపు బతకలేదు. విలపిస్తున్న తనను చూసి, "నాయనా, దేవదానం! నాకూ దుఃఖంగా ఉంది. పుట్టి బుద్ధెరిగాక మరియమ్మలాగా నా మనసుకు దగ్గరగా వచ్చినవాళ్ళెవరూ లేరు. స్వయానా నా చెల్లెలే చనిపోయినంత దుఃఖం కలుగుతోంది నాకు. అయినా మనం చెయ్యగలిగిందేం ఉంది. మన ప్రాప్తమంతే అనుకోవాలి. అపరిహార్యమైనదానికి వగచి ప్రయోజనం లేదు. అందరూ వెళ్ళిపోవల్సిన వాళ్ళే. 'జాతస్యహి మరణం ధృవం!' ముందో, తరవాతో, అంతే. లేచి జరగాల్సింది చూడు"

శవాన్ని ఊరికి తీసుకువెళ్ళటానికి టాక్సీ మాట్లాడి తీసుకువచ్చాడు తను. ఆసుపత్రి ఖర్చే కాక, టాక్సీ బాడుగ కూడా దొరసానే భరించింది.

ఇంటికొచ్చాక, "దానికి అంత్యక్రియలు ఘనంగా జరిపించు. దేనిలోనూ లోపం

చెయ్యకు. అవేమిటో నాకు తెలియదు. అందుకు డబ్బెంత ఖర్చవుతుందో కూడా తెలియదు. ఇదుగో, ఈ ఐదు వందలూ మిగిలాయి నా చేతిలో, ఇంకెంత ఖర్చవుతుందో చెప్పు. నేను సమకూరుస్తాను. ప్రాణమయితే మనం నిలబెట్టలేకపోయాం గానీ, దానికి జరగవల్సిన మర్యాదలన్నీ యధాతథంగా జరిగిపోవాలి. దేనికీ వెనుకాడకు" అని చెప్పి ఆమె వెళ్ళిపోయింది.

ఆమె ఇచ్చిన డబ్బు ఎక్కువే. ఆమె అంత్యక్రియలకంత డబ్బు అవసరం లేదు. ప్రభువు ఒడిలో ఆమెను ఉంచాడు. తన మనసు మూగపోయింది. తన తల్లి చెంచులమ్మ శోకాలు పెట్టి ఏడ్చింది మరియమ్మ గుణగణాలను ఏకరువు పెడ్తూ. చనిపోయిన వాళ్ళందరూ మంచివాళ్లే!

ఆ తర్వాత రేణుకను స్కూల్లో వేయటానికీ, మిగతా ఖర్చుల భారం దొరసానమ్మే వహించింది. తన ఇంటిలో ఉంచుకోటానికి ఆమెకు అవకాశం లేదుగానీ, లేకపోతే రేణుకను తన దగ్గరే ఉంచుకునేది. రేణుక చదువు సంధ్యల విషయంలో ఎంతో శ్రద్ధ చూపింది ఆమె.

రాత్రి భోజనం చేస్తూ అలా ఆలోచనలో పడిపోయిన దేవదానం తల్లి మాటలతో ఉలిక్కిపడ్డాడు.

"ఏందిరో! నువ్వు నీ కూతుర్ని అదుపు చేసుకుంటే మాత్రం కుదర్దు. పిల్ల కాలేజీకి ఎళ్ళి రావాల. ఆడు ఎంటపడకమానడు. నువ్వు ఆ శౌరయ్యతో మాట్లాడు. కొడుకును కట్టడి చేసుకోమను. అచ్చోసిన ఆంబోతులా వదిల్తే కుదర్దని చెప్పు" అంది ఆమె.

"ఆ చెప్తాడులే నీ కొడుకు! ఆయనకంత ధైర్యముంటే ఇంకేం? ఇంట్లో నామీద పడి అరవటం తప్ప ఆయనకేం చాతనవుతది! చివరకు తీసుకెళ్ళి దాన్ని ఆడి చేతిలో పెడ్తాడు" అంది ఈసడింపుగ సువార్త.



"నోర్ముయ్యి! నాకేం చెయ్యాలో తెల్సు" అన్నాడు దేవదానం.

"నేను చెప్పలా, నీకదే చాతనవుతది. నా నోరు మూయిస్తే, జనం నోరు ముయ్యలేవు. కోడై కూస్తాంది లోకం. చివరకు ఆ తక్కువ కులంవోడికి కూతుర్ని కట్టబెడతావు!"

"అట్టెట్ట జరుగుతాదే! మనోళ్ళంతా ఏమంటారు? దాన్ని ఆడికిచ్చి మనువు చేసినావంటే బావిలో దూకి చస్తాను" అంది చెంచులమ్మ ముక్కు చీదుకుంటూ.




“నువ్వు చచ్చినా, నేను చచ్చినా ఆయనకేం పట్టదులే, అత్తమ్మా! అట్ట పెంచినావు కొడుకుని! ఇప్పుడనుకుంటే ప్రయోజనమేంది?” అంది సువార్త, తప్పంతా చెంచులమ్మదే అయినట్టు.

“ఓర్నీయవ్వ! నువ్వెట్టా పుట్టినావే! నీ జిమ్మడ! నీ పాడెగట్ట! నామీదకే కాలు దువ్వుతున్నవు. గయ్యాలోళ్ల కుటుంబం నీది. నేనప్పుడే చెప్పినా. ఆ పాపిష్టోళ్ళ పిల్లను చేసుకోకురా అని. ఆడు నా మాట వినుకోలేదు”

“కాటి కాడికి వచ్చిన ముసల్దానివి నువ్వు నన్ను చావమంటావా? నీ నోట్లో మన్ను పొయ్య! ఎప్పుడు చస్తావో నా పీడ వదలి పోతది. ఆయన నీ మాట వినకపోయినందువల్ల నీకే నష్టమొచ్చినాది! ముసలోడిని కట్టుకుని నేను నష్టపోయినా. రాచ్చసి లాంటి నీకు సేవలు చేసి నా నడుం పడి పోతావుంది గానీ, నీకు చావు రాదు?”

కొత్తగాలి...

## చలిసాయంత్రం నిశ్శబ్దతూనీగలమధ్య అల్లరి కందిరీగ

-పి. శ్రీనివాసగౌడ్, చీరాల

అలా అత్తాకోడళ్ళు అసలు విషయం వదిలేసి ఒకళ్ళకొకళ్ళు దూషించుకోసాగారు. అది రోజూ జరిగే తంతే. దేవదానం ఆ మాటలు పట్టించుకోకుండా భోజనం పూర్తిచేశాడు. అయితే ఆ మర్నాడు వెళ్ళి శౌరయ్యతో మాట్లాడాలి అని తీర్మానించుకున్నాడు.

మర్నాడు తన ఇంటికి వచ్చిన దేవదానంను శౌరయ్య సాదరంగా ఆహ్వానించాడు. దేవదానం అంటే అతనికి గౌరవమే. అస్పృశ్యుల్లో అక్షరాస్యత కలిగిన వారే తక్కువ. అలాంటిది దేవదానం చదువుకుని ఉపాధ్యాయుడయ్యాడు. ఆపైన అణగారిన వర్గాలలోని వయోజనులకు అక్షరాస్యత కలగాలని పాటుపడ్డాడు. తన పెద్దకొడుకు శంకరయ్య హత్యకేసులో ఇరుక్కున్న సందర్భంగా కేసు వాయిదాలకు తనతోపాటు ఖమ్మానికి వచ్చేవాడు. వాడికి శిక్ష పడినప్పుడు తనకు ఓదార్పు మాటలు చెప్పాడు. "యేసు ప్రభువును నమ్ముకో. ఆయన అలా తీర్పిచ్చిండు. నిజానికి మనం సంతోషించాల. కోర్టు పిలగాడికి మరణశిక్ష విధించలేదు. జీవిత ఖైదు విధించింది. పధ్నాలుగేళ్ళు! సత్ప్రవర్తన కలిగి ఉంటే ముందే జైలు నుంచి విడుదల కావచ్చు. నువ్వు ధైర్యంగా ఉండాలి" అని చెప్పాడు.

అలాంటి దేవదానం తన ఇంటికి రావటం చూసి "ఏందిట్లా వచ్చినావు పంతులూ?" అని నవ్వుతూ పలకరించాడు శౌరయ్య.

"చూడు శౌరయ్యా! నీ కొడుకును అదుపులో పెట్టుకో. ఆడిని అచ్చోసిన ఆంబోతులా ఊరిమీద వదిలేసినావు. చదువు సంధ్యలు లేవు. ఆడపిల్లల వెంటపడి వేధించడం మంచిపని కాదు" చెప్పాడు దేవదానం.

మొదటగా ఆ వార్త వినటంతోనే ఖంగుతిన్నాడు శౌరయ్య. తన పెద్దకొడుకు శంకరయ్య ఆడదాని ప్రలోభానికి లోబడే జీవితాన్ని నాశనం చేసుకున్నాడు.

"ఏమయినాది!" అని అడిగాడు ఆశ్చర్యపోతూ.

"నా కూతురు కాలేజీకి వెళ్తుంటే, రోజూ దాని వెంటపడి సతాయిస్తున్నాడంట!"

"అడిని వెంకటాపురంలో పెట్టినానే!"

"ఆడే వెంటపడుతున్నాడంట! నీ కులమేంది, మా కులమేంది? తారతమ్యం తెలుసుకుని మెలగాలి" దేవదానం ఆ మాట అనగానే శౌరయ్యలో అహం పొడచుకు వచ్చింది. మింగ మెతుకు లేదుగానీ కులపు అహంకారమా? పుట్టిన గడ్డలో బతుకు గడవక ఇక్కడకు వచ్చినవాడు తన్ను కులం పేరెత్తి తక్కువగా చూడటమా?

"సర్లే, పంతులూ! కులం పేరెందుకు ఎత్తుతావులే. నేను నా కొడుక్కి చెప్తాను. నువ్వు నీ కూతుర్ని అదుపులో పెట్టుకో" అని సౌమ్యంగానే చెప్పాడు శౌరయ్య.

శౌరయ్య మెత్తదనం అలుసుగా తీసుకుని మరింత పెట్రేగిపోయాడు దేవదానం. "నా కూతురు బుద్ధిగానే చదువుకుంటోంది. అంతగా పొగరు బలిస్తే బలాదూరు ఆడోళ్ళు చాలామందున్నారు. మీ చెప్పులు కుట్టోళ్ళ కులంలోనే చాలామంది ఉన్నారు. కావాల్నంటే ఆళ్ళ ఎంట పడమను"

శౌరయ్యకు తన మాదిగపల్లెలో ఏటా సంక్రాంతికి చిందుభాగవతులు వచ్చి చెప్పే 'జాంబపురాణం'లో తన్ను ఈసడించిన ఓ బాపనాయనకు జాంబవంతుడు 'చెప్పులోనే ఉంది మూలం' అని చెప్పిన మాట గుర్తుకు వచ్చింది.

"చెప్పులు కుట్టెటోళ్ళు మీ మాలదాసర్ల కంటే తక్కువోళ్ళు కాదులే! ఆడ తింటానికి లేక ఈడికొచ్చినావు. బుద్ధిగుండు. నా కులం పేరెత్తకు. చంపేస్తాను" అన్నాడు శౌరయ్య కోపంగా.

"చంపుతావు! ఎందుకు చంపవూ! పశుకళేబరాలు కోసీకోసీ చంపటం మీకు అలవాటయినాది. నీ కొడుకు ఆశ్రయమిచ్చినోడిని చంపిండు. నాలుగు చదువు ముక్కలు చెబ్దామని వచ్చిన నన్ను నువ్వు చంపుతావు. ఈడ చేతులు ముడుచుకు కూర్చునేటోళ్ళు ఎవరూ లేరు" అన్నాడు దేవదానం ఆవేశంగా.

అంతే, శౌరయ్యకు విపరీతమైన కోపం వచ్చింది. దేవదానం గొంతు పుచ్చుకుని కొట్టబోయాడు.

అంతలో అతని భార్య లచ్చువమ్మ "ఏందయ్యా. పంతుల్ని కొడ్తావేంది! వదిలెయ్యి ఆయన్ని. ఇద్దరూ వయసు మీద పడుతున్నోళ్ళు ఇచారించుకోవాల్సింది పోయి కొట్టుకు చస్తుండిరా! జనం నగుతారు. ఏం జెయ్యాల్నో ఆలోచించండి. నీ కులం గొప్ప. నా కులం గొప్పని తగవులాడుకుంటే అయిపోతదా? " అంది.

"అట్ల జెప్పు, నీ మగడికి బుద్ధి!" అన్నాడు దేవదానం, శౌరయ్య చేతిని విడిపించుకుంటూ.

"అదేంది నాకు బుద్ధిచెప్పేది? నీలాంటోళ్ళని ఇంతమందిని చూసినా. పోపో" అన్నాడు శౌరయ్య తన తలమీద వెంట్రుకలను సూచిస్తూ.

"ఆగవయ్యా, నువ్వు" అని మొగుణ్ణి కసిరి, "ఎందుకింత గోల! ఆడికి ఆ

**కొత్తగాలి...**

**కంట్లో నలుసు**
**తడిసిన కలలు**
**విచ్చిన కనులు**

–బొల్లిముంత వెంకటరమణారావు, హైదరాబాద్

పిల్లంటే మనసుండినట్లుంటే ఇద్దరికి లగ్నం జేస్తే పోలా? " అంది లచ్చువమ్మ.

"ఎడం చేతోళ్ళకు నా పిల్లను ఇవ్వను" అన్నాడు దేవదానం భీష్మించుకుంటూ.

"ఏందయ్యా, యేసు మతం పుచ్చుకున్నోడివి కుడిచేతోళ్ళు, ఎడం చేతోళ్ళు అని మాట్లాడతావు! ఏం జెయ్యాల్నో చూడు" అంది లచ్చువమ్మ.

"సరే, నీ కొడుకును మా మతం తీసుకోమను. అప్పుడు పెళ్ళికి అంగీకరిస్తాను" అన్నాడు దేవదానం దిగిపోతూ. ఆమె మాటల్లోని హేతువు అతని ఆవేశాన్ని తగ్గించింది.

"నా కొడుకు ఛస్తే నీ మతం పుచ్చుకోడు. గతిలేనోడు కాదు నా కొడుకు! ఆళ్ళేదో నాలుగు ముద్దలు పడేస్తే మతం మార్చుకునేటోళ్ళం కాదు మేం!" అన్నాడు శౌరయ్య. తన కులాన్ని హీనపరుస్తున్నా దేవదానమంటే అతనికి మండిపోతూనే ఉంది.

"అట్లయితే, నేను నా కొడుక్కి చెప్పుకుంటానులే. నువ్వు ఎళ్ళు, పంతులూ! నువ్వా నీ కూతురికి చెప్పుకో" అని సర్దిచెప్పి పంపేసింది లచ్చువమ్మ దేవదానాన్ని.

అగ్ర నిమ్నకులాల పట్టింపు అగ్ర కులాలలోనే కాదు, నిమ్న కులాల్లోనూ ఎప్పటి నుండో వివాదం రేపే విషయమే. అన్ని కులాలకూ ప్రత్యేక పురాణాలున్నట్లే ఈ

కులాలకూ 'జాంబ పురాణం' ఉంది. మాల లకు మూల పురుషుడు చెన్నయ్య. మాది గలకు మూలపురుషుడు జాంబవంతుడు. జాంబవంతుడు ఆదిముని అని 'జాంబ పురాణం' చెప్తుంది.

మతాలు మారినా కులాలు పోనటువంటి బలవత్తర వ్యవస్థను హిందూ సమాజం సృజించింది. అందుకే దేవదానం తన కూతుర్ని నారాయణకిచ్చి పెళ్ళి చెయ్య నిరాకరించాడు.

ఎక్కువ తక్కువల కులప్రసక్తి వచ్చాక, దేవదానంతో కొడుకు పక్షం వహించి పోట్లాడినా, నారాయణ కూడా అన్న దారి పడ్తాడేమోనన్న భయం వీడిపోలేదు శౌరయ్యకు. నారాయణను వెంకటాపురంలో ఓ కాంట్రాక్టరు దగ్గర పనిలో పెట్టాడు అతను. వెంటనే కొడుకుని గంధసిరికి పిలిపించాడు. తన కనుసన్నలలో ఉంటే కుర్రవాడు ఎలాంటి అకృత్యానికీ పాల్పడే అవకాశం ఉండదని అతడు భావించాడు.




**నా**రాయణ గృహ నిర్బంధం భరించలేకపోయాడు. పిల్లవాడిని కట్టడి చేయటానికి లచ్చువమ్మ ఓ పరిష్కారం సూచించింది. "ఆడికి పెళ్ళి చేసేద్దాం. ఇంక ఆ పిల్ల ఊసు పట్టించుకోకుండా ఇంటి పట్టున ఉంటాడు" అంది.

ఆమె మూడో కూతురు దేవమ్మ ఎప్పటి నుండో తల్లిని సతాయిస్తోంది. తన రెండో కూతురు బంగారిని నారాయణకు చేసుకోమని. ఆ విషయం ఆమె భర్తతో ఓ సారి ప్రస్తావించింది కూడా. అల్లుడు సంతపాడు రామిరెడ్డి దగ్గర జీతగాడుగా పనిచేస్తున్నాడు. అతడికే మింగ మెతుకులేదు. తన కొడుక్కేం కట్నమిస్తాడు. డబ్బు విషయంలో శౌరయ్య ఖచ్చితంగా ఉంటాడు. ఆపైన పొలాల్లో కూలిపనులకు వెళ్లే ఆ పిల్లను తన కోడలుగా చేసుకోవటానికి అంగీకరించలేదు అతను. నారాయణ కూడా ఆ పిల్లను వద్దన్నాడు.

నారాయణ తిరస్కృతికి కారణముంది. బంగారి పదహారు, పదిహేడేళ్ళ పడుచు. నల్లగా ఉన్నా కళగలిగిన ముఖమే. మొదట్లో అతను ఆ పిల్లను చేసుకోవటానికి ఒప్పుకున్నాడు, తల్లి అడిగినప్పుడు. అతని దృష్టిలో ఆడది పక్కలోకి వచ్చే వ్యవస్థే పెళ్లి. అంతకుమించిన పవిత్రతను ఆపాదించే సంస్కారం అతనికి లేదు. ఓ రోజు కూలికి పోతున్న మేనగోడలితో సరాగాలు పోయాడు నారాయణ. ఆ పిల్ల ఛీకొట్టింది.

ఆ పిల్ల రామిరెడ్డి కొడుకు సాంబిరెడ్డికి అలవాటు పడింది. ఆమె వెళ్ళి సాంబిరెడ్డికి చెప్పింది. నాలుగు రోజుల తర్వాత సాంబిరెడ్డి తన మిత్ర బృందంతో కలిసి అతనికి దేహశుద్ధి చేశాడు. తమ పని పూర్తయ్యాక, సాంబిరెడ్డి చెప్పాడు- "అరే, దాని జోలికొచ్చినావంటే బావుండదు. చెప్తున్నా. ప్రాణాలు పోతాయ్" అని.

అది దురన్యాయమనిపించింది నారాయణకు. 'ఆడు దాన్ని వాడుకుని వదిలేస్తాడు. అందుకు తనకేం అభ్యంతరం లేదు. తమ ఇంటిపిల్ల బంగారి! తనూ వాడుకోవచ్చు కదా! అందుకు ఆడి అభ్యంతరమేంది!' అవీ నారాయణ ఆలోచనలు. బంగారి రహస్యం తనకు తెల్సిపోయింది కనుక, ఆ సంగతి పెద్దలకు చెప్తానని బెదిరిస్తే

బంగారి తన తోవకు వస్తుందని భావించాడు నారాయణ. అయితే అతని ప్రయత్నం ఫలించలేదు.

"చెప్పటానికి నువ్వు బతికుంటేగా? " అంది బంగారి.

ఇంక ఈ విషయంలో ముందుకుపోతే తన చావు ఖాయమన్న భయం కలిగింది నారాయణకు.

సాంబిరెడ్డి తండ్రి ఇప్పటికే ఇద్దర్ని చంపి కేసులు మాఫీ చేయించుకున్నాడు. తన్ను హత్య చేయటం సాంబిరెడ్డికి కష్టం కాదు.

"సరే, నీ చావు నువ్వు చావు. నేనిట్లా నీతో అన్నానని ఆడికి చెప్పకు."

"అట్లనే. నువ్వు మా సంగతి మా అమ్మకు, నాయనకు చెప్పకు. నేనూ నీ సంగతి సాంబిరెడ్డికి చెప్పను."

అలా ఇద్దరూ ఒప్పందానికి వచ్చాక ఆ పిల్ల అతనికి 'గుడిసేటిది' అయ్యింది.

స్వేచ్ఛగా తిరిగే విహంగం పంజరంలో పెట్టి బంధిస్తే సహించలేదు. ఓ రోజు తండ్రి ఇంట్లో పెట్టిన రెండువేల రూపాయలు తీసుకుని వెంకటాపురం ఉడాయించాడు నారాయణ. అతనికక్కడ చాలా మంది దోస్తులున్నారు. వాళ్లల్లో ఒకడు షేక్ భాషా. అతను ఆటో నడిపేవాడు. నెల రోజులుగా కన్పించని మిత్రుడిని చూసి మహదానందపడిపోయాడు షేక్ భాషా. "ఏందిరో, ఇన్నాళ్లూ అయిపు లేవు? " అని అడిగాడు. నారాయణ తన బాధ చెప్పుకున్నాడు. ముందు తాను వాడుకున్నాక ఆ తర్వాత రేణుకను షేక్ భాషాకు అప్పగించడానికి అంగీకరించాడు నారాయణ.

అలా మిత్రులిద్దరూ ఒప్పందం చేసుకున్నాక ఓ పథకం వేశారు రేణుకను లొంగదియ్యటానికి. ఆరోజు రేణుక కాలేజీ క్లాసులయ్యాక గంధసిరికి తిరిగి వెళ్లటానికి బస్సు స్టాండుకు బయలుదేరింది. కాలేజీ నుండి సుమారు అరమైలు దూరం నడిచి వెళ్లాలి. ఆటోలో కూర్చున్న నారాయణ రేణుక పక్కన ఆపించాడు.

"ఏందే, మనూరికి ఎళ్తన్నావా? " అని చిద్విలాసంగా అడిగాడు.

చాలా రోజులుగా కన్పించని నారాయణ కన్పించేసరికి ఆనందపడి పోయింది రేణుక. అతనిలో బలీయమైన ఆకర్షణ ఉంది. దానికామె ఎప్పుడో లొంగిపోయింది. తను తెల్సిన వాళ్లెవరూ వెంకటాపురంలో లేరు. తను నారాయణతో మాట్లాడినా ఆ విషయం తండ్రికి తెల్సే అవకాశం లేదు. అతని ప్రశ్నకు "అవును" ని తలూపింది ఆమె.

"నేనూ మనూరికే ఎళ్తన్నాను. బస్సుల్లో ఎళ్ళి బోరుకొట్టినాది. ఆటో మాట్లాడినాను. నాతోరా, ఎళ్దాం" అన్నాడు నారాయణ.

"అమ్మో! నీతోనా? మా నాయనకు తెలిస్తే ఒళ్ళు చీరేస్తాడు" అంది రేణుక

## గుడ్లు

తపాలాశాఖా నత్తనడక సేవలను తిట్టుకోనివారుండరు కదా? ఓసారి ఓహియో నుంచి న్యూయార్క్‌కు మార్క్‌ట్వెయిన్‌కు రావాల్సిన ఓ ఉత్తరం అందడానికి పదకొండు రోజులు తీసుకుంది. 'నా స్నేహితుడు డజన్ కోడిపిల్లల్ని పంపిస్తానని చెప్పాడు. కానీ వాటికి బదులుగా మన తపాలాశాఖ ద్వారా గుడ్లను పంపమని చెబుతాను. అవి మార్గంలో ఎలాగో కోడిపిల్లలు అవుతాయి' అని చురకలంటించాడు.



## కొత్తగాలి...

**పుట్టుకే తలక్రిందులు**
**ఏడ్పే తొలిభాష**
**జీవితమంతా...**
**అదేఘోష**

—తూలుగు రమణారావు, అక్కిరాపల్లి

భయపడిపోతూ.

"ఎట్ల తెలుస్తది! బస్సు స్టాండులో నిన్ను దిగిడిచి నేఎళ్ళిపోతాను. నువ్వు నడుచు కుంటూ మీ ఇంటికెళ్ళు. నువ్వంటే నాకిష్టం. మంచిగ కబుర్లు చెప్పుకునే టైమే దొరకలేదు మనకు"

అది నిజమే. వెంటబడినప్పుడు వీధిలో మాట్లాడుకోవటమే కానీ, కలిసి ప్రేమ కబుర్లు చెప్పుకున్నది లేదు. ఆమె ఆ ప్రలో భానికి గురైంది. ఆటో ఎక్కింది. ఆటో బయలుదేరాక చెప్పాడు నారాయణ. "నక్కల తోటకాడ జాతర జరుగుతున్న దంట! నువ్వది చూసినావా? "

"నాకు తెలీదు".

"అది చూసి ఎళ్లిపోదాం. మంచి సరదా గుంటది."

"అమ్మో! ఆలస్యమైపోతుంది. మా నాయన డొక్క చించుతాడు."

"ఎంతసేపు. అరగంట. బస్సు లేటయి నాదని చెప్పు."

అది సకారణమే. బస్సు దొరక్క ఒక్కో సారి రాత్రి ఎనిమిదింటికి కూడా ఇల్లు చేరిన సందర్భాలున్నాయి. ఇద్దరూ జాత రకు వెళ్లారు. స్టాల్స్‌లో చిరుతిండ్లు, ఐస్‌క్రీ మ్‌లు తిన్నారు. జెయింట్ వీల్ ఎక్కారు. తనెప్పుడూ జీవితంలో అనుభవించని ఆనందం, స్వాతంత్ర్యం ఆమె అనుభవిం చింది. ఇంట్లోనూ తండ్రి మాష్టరే. బైబులు పఠనం, రాత్రిపూట పడుకునే ముందు ప్రార్థన తప్పదు. ఆదివారాలు చర్చికి వెళ్లటం తప్పనిసరి. సినిమాలు, సర్దాలు నిషిద్ధం. బతుకు పైవాడికి తాకట్టు పెట్టినట్టు బతికే కొంపలో ఆమెకే స్వాతంత్ర్యం లేదు. ఆపైన పిన్నమ్మ సూటీ పోటీ మాటలు!

అక్కడ అరగంట కాదు, గంటకు పైగా గడిచిపోయింది. ఆమెకు ఆ స్పృహే లేదు. తీరా బయటికొచ్చాక అలుముకున్న చీకటి చూసి, "ఎంతయింది? " అనడిగింది ఆమె భయపడుతూ.

"ఎంత ఏడు గంటలే" అన్నాడతను నవ్వుతూ.

షేక్ భాషా ఆటోలో సిద్ధంగా ఉన్నాడు. ఆటో ఎక్కాక పోతూంటే ఆమెను దగ్గరకు లాక్కుని ముద్దు పెట్టుకున్నాడు నారా యణ. "ఏందిదీ, నన్ను వదులు" అని ఆమె అంది కాని అతన్ని వదిలించుకునే ప్రయత్నం చేయలేదు.

ఆటో ఊరంతా గంటసేపు తిరిగింది. ఆటోలో కూర్చున్నంతసేపూ అతడు ఆమె ఒళ్ళు తడుముతూనే ఉన్నాడు. ఇద్దరి ఒళ్ళూ వేడెక్కిపోయాయి. ఎందుకోసమో నరాలు జివ్వుమని లాగేశాయి.

ఓ హోటల్ ముందు ఆటో ఆపించాడు నారాయణ. "భోజనం చేసి వెళ్దాం" అన్నాడు.

అతని సాన్నిధ్యంలో మరెంతసేపు ఉన్నా ఆమెకు తనివి తీరేట్టు లేదు. ఆమె కిష్టమైనవన్నీ ఏరి కోరి తిన్పించాడు నారా యణ. అంత సంతోషంలోనూ, ఆలస్యంగా ఇంటికెళ్తే తండ్రేమంటాడోనన్న భయమూ ఉంది ఆమెకు.

భోజనమయ్యాక తాపీగా తన అద్దె గదికి ఆటోని పోనివ్వమన్నాడు. వెంకటా పురం కాంట్రాక్టు పనులు చేసేటప్పుడు ఒక్కోసారి రాత్రిపూట అక్కడే ఉండాల్సి వచ్చేది. అందుకోసం ఓ గది అద్దెకు తీసు

కున్నాడతను. అది ఇప్పటికీ అతని అధీనంలోనే ఉంది. అక్కడ ఆటో ఆగటం చూసి, "ఇదేంటి, ఈడకు తీసుకొచ్చావు!" అని అడిగింది.

అతను ఆటోను పంపించేసి చెప్పాడు. "ఇప్పుడెంతయిందో తెలుసా? తొమ్మిదిన్నర! మనం ఇంటికెళ్లాలన్నా కనీసం ముప్పావు గంట పడ్తది. పదింబావుకు ఎళ్తే మీ నాయన నీ తాట వలుస్తాడు. ఈ రేత్తిరి ఈడుండి రేపెళదాం."

"అమ్మో! నాకు భయం!"

"భయమెందుకే, పిచ్చిదానా! నేను లేనా!"

"అందుకే భయం!"

"బయం లేదు, గియం లేదు. నేను నిన్నేమన్నా తినేస్తానా? పద."

తలుపు తాళం తీసి వాళ్ళు గృహప్రవేశం చేశారు. అతను లైటు వేశాడు. గదిలో పెద్దగా వస్తువులేం లేవు. ఓ చాప, పరుపు, తలగడా, మంచినీళ్ళ కూజా, మరి కొన్ని అమాంబాపతు సామానులు.

"ఈ గది నీదేనా?" అడిగింది రేణుక.

"నాదే. కాంట్రాక్టు పనులు చేస్తుంటాగా. కిరాయికి తీసుకున్నా."

ఆ రాత్రి ఏమవుతుందో ఆమెకు తెలియక పోలేదు. ఆ అనుభవం కోసమే ఆమె శరీరం అర్రులు చాస్తోంది. నారాయణకూ ఎప్పటినుంచో ఎదురు చూస్తున్న అవకాశం దొరికింది. అతనింక క్షణం ఆలస్యం చెయ్యలేదు. లైటార్పి ఆమెను దగ్గరకు తీసుకున్నాడు. ఆమె ప్రతిఘటించలేదు. ఏదో తెలీని మత్తులో ఉన్నట్టు మైమరచి అతనికి సహకరించింది.

మర్నాటికి గానీ ఆమెకు ఒళ్ళు తెలియలేదు. విపరీతమైన భయం వేసింది. నారాయణ ఆమెకు ధైర్యం చెప్పాడు. "నీకు భయమెందుకే. నేను నిన్ను పెళ్ళి చేసుకుంటానన్నాను మీ నాయనతో. నీ కులమేంది, నా కులమేంది అన్నాడు పంతులు. ఇప్పుడు చచ్చినట్టు ఒప్పుకుంటాడు."

"మీ నాయన!"

"ఆయనా ఒప్పుకుంటాడు. చస్తాడా? మనం ఏకమయ్యాక ఎవడు మనల్ని విడదీయగలడు?"

రేణుకకు అతను చెప్పిన మాటలు నిజమేననిపించాయి. ఆమె కాలేజీకి వెళ్లలేదు. అతను ఆమెకు రెండు కొత్త చీరెలు, జాకెట్లు కొనిచ్చాడు. హోటల్లో తిన్నారు. సినిమాకెళ్లారు. ఆమెను కాలు కింద పెట్టనివ్వలేదు నారాయణ ఆ రెండు మూడు రోజులు. పగలంతా ఆటోలో తిరిగి, రాత్రికి వచ్చి గదిలో పడుకునేవారు. జీవితం ఇంత అద్భుతంగా ఉంటుందని రేణుక ఏనాడూ భావించలేదు.

అక్కడ గంధసిరిలో కాలేజీకి వెళ్ళిన కూతురు ఇంటికి చేరకపోయేసరికి గగ్గోలెత్తిపోయాడు దేవదానం. నలుగుర్ని తీసుకుని శౌరయ్య ఇంటిమీది కెళ్లాడు. పెద్ద పోట్లాటయింది.

ఆ తర్వాత శౌరయ్య, దేవదానం కలిసి వెళ్లి ఖమ్మం పట్నమంతా గాలించారు. తెలిసిన వాళ్లనందర్నీ అడిగారు. మర్నాడు చివరి ప్రయత్నంగా వెంకటాపురం కూడా వెళ్దామని గంధసిరికి తిరిగి వచ్చారు. మర్నాడు పొద్దున్నే రాములయ్య, శౌరయ్య ఇంటికి పడ్తూ లేస్తూ వచ్చాడు. "పోలీసోళ్ళు నీ కొడుకును, ఇంకో పోరిని బ్రోతల్ కేసు కింద బుక్ చేసినారు. ఎళ్ళి ఇడిపించుకో" అని చెప్పాడు.

కబురు దేవదానంకి చేరింది. శౌరయ్య, దేవదానంలు ఒకళ్లనొకళ్లు పది తిట్టుకున్నారు. ఎంత తిట్టుకున్నా కన్న మమకారం వదలుకోలేక కాబోయే వియ్యంకులిద్దరూ వెంకటాపురం చేరారు.

జరిగిందేమిటంటే-



తన ఆటోలో నారాయణను, రేణుకను రెండు రోజులు అడిగిన చోటుకల్లా ఉచి



తంగా తిప్పిన షేక్ భాషా మిత్రుడు ఆ పిల్లతో ఖుషీ చేస్తుంటే సంతోషించి ఊరు కున్నాడు. మూడో రోజూ తనకు వాటా పెట్టకుండా తనే ఖుషీ చేస్తానని నారా

యణ అనేసరికి భాషాకి కోపం వచ్చింది.

"ఏందిరో, నా సాయం అడిగినప్పుడు ఆ పోరిలో నాకూ వాటా ఇస్తానన్నావా లేదా? పోస్లే నువ్వు పట్టిన పోరి అని చెప్పి రెండు రోజులు తమాయించుకు న్నాను. ఇంక కుదర్దు. ఈ రేత్రికి ఆ పిల్ల నాదే" అన్నాడు భాషా.

"చంపేస్తాను. అది నాది. దానిమీద చెయ్యి వేస్తివా, నీ ప్రాణం తీస్తాను" అన్నాడు నారాయణ రోషంగా.

ఇక మొదలైంది రణరంగం. నారాయణ గది ముందే ఈ గలాటా జరిగింది. ఆ మాటలన్నీ విన్న రేణుకకు రోత వేసింది. నారాయణ పట్ల ద్వేషం కలిగింది. మిత్రు లిద్దరూ కలియబడ్డారు. ఒకడి ప్రాణం తియ్యాలని మరొకరు ప్రయత్నించారు. చుట్టుపక్కల జనం మూగారు. పిల్లను కిరాయికి తెచ్చుకుని వాటాలు తెగక కొట్టు కు చస్తున్నారని భావించారు. పోలీసులకు ఉప్పందించారు. పోలీసులు ముగ్గుర్నీ తీసుకెళ్ళి లాకప్‌లో పెట్టారు. ఊరికెళ్ళిన సబ్ ఇన్‌స్పెక్టర్ మర్నాడు పొద్దున వచ్చి కేసు విచారిస్తాడన్నారు పోలీసులు.

దేవదానం లాంటి అభాగ్యుడు కాదు శౌరయ్య. నలుగురితో తిరిగినవాడు. వ్యవ హారాలెలా నడపాలో తెల్సినవాడు. పోలీ సులతో వ్యవహారం కనుక డబ్బుకు కాళ్లొ స్తాయని అతనికి తెల్సు. ఆ ఏర్పాటు చేసు కునే అతను గంధసిరి నుండి వచ్చాడు. వట్టిగా డబ్బుతో పని జరగదనీ అతనికి తెలుసు. అందుకే తనకు గాఢ పరిచయ మున్న షుగర్ ఫ్యాక్టరీ యజమాని దుర్గా రావు దగ్గరకు వెళ్లి మొరపెట్టుకున్నాడు. అతను వెంటనే వాళ్లను తీసుకుని కారులో పోలీసుస్టేషన్‌కు వెళ్లాడు. అప్పటికి ఉదయం పదకొండు గంటలయింది. వీళ్ల వెళ్లే సమయానికి ముగ్గుర్నీ పిల్చి ఇంటరా గేషన్ మొదలెట్టాడు సబ్ ఇన్‌స్పెక్టరు సుగుణమణి. దుర్గారావు ఎస్సయ్‌ను పక్కకు పిల్చి మాట్లాడాడు. కేసు పది వేలకు సెటిలయింది.

శౌరయ్యకు తప్పలేదు. పదివేలు సమ ర్పించుకుని, పిల్లల్ని తీసుకుని బస్సులో గంధసిరికి చేరారు. గంధసిరిలో బస్సు దిగాక, "తరువాత మాట్లాడుకుందాం. ముందు నీ కూతురికి బుద్ధి చెప్పు" అని మాదిగవాడకు బయలుదేరాడు శౌరయ్య కొడుకుని వెంటేసుకుని.

"నీతో నాకు మాటలేంది? ఆ గడ్డేదో నీ కొడుక్కు పెట్టు" అని దేవదానం కూతు రితో హనుమానుమిట్టకు బయలుదేరాడు.

దేవదానాన్ని అవమానం, నిస్సహాయత పట్టి పీడించాయి. ఊళ్లో పరువు పోయింది. ఇంటికి వచ్చాక కూతుర్ని చిత కబాదాడు. చిన్నప్పటినుంచి అతను గారా బంగా కూతుర్ని పెంచాడు. ఒక్క తిట్టు తిట్టింది లేదు. కొట్టింది లేదు. తన పరువు బజారుకీడ్చిన కూతుర్ని చంపె య్యాలన్నంత క్రోధావేశం కలిగింది అత నికి.

"దాన్ని చంపేస్తావేందిరో? " అని గొల్లు మంది చెంచులమ్మ.

"నోర్ముయ్యి. నీ అలుసు చూసుకునే అది బరి తెగించింది. నోరు తెర్చినావంటే నీ ప్రాణాలు పోతయ్యి" అనరిచాడు దేవ దానం.

సువార్త కాస్తంతసేపు మహదానందంగా ఆ హింసా క్రీడను తిలకించింది. కానీ రేణుక మాత్రం ప్రతిఘటన లేకుండా ఒళ్లొ ప్పగించడం చూసి, ఆమెకు ఆ ఏకపాత్ర ప్రహసనం బోరు కొట్టించింది.

"చాల్లేవయ్యా కొట్టింది చాలు! చంపేస్తా వేంది పిల్లను! ముందు కావల్సిందేదో చూడు..." అంది.

"ఇంక కావల్సిందేంది! దాని బతుకు అది బుగ్గి చేసుకున్నాది. నాకు తీరని అవ



మానం. మనోవ్యధ మిగిల్చినాది"

"అట్లని చేతులు ముడ్చుకు కూర్చుంటే అయిపోద్దా? ఎళ్ళి, ఆ శౌరయ్యతో మాట్లాడు"

"ఆడితో మాటలేంది? ఆడికి దీన్నిచ్చి చెయ్యమంటావా? "

"మరేం చేస్తవ్! చెడిపోయినదాన్ని ఎవడు కట్టుకుంటాడు? "

"నేను ఆడిని పెళ్లి చేసుకోను" అన్నది ఆ మాటలు వింటున్న రేణుక తెగించి హీన స్వరంతో.

"చేసుకోనిదానివి ఆడితో ఎందుకెళ్ళి నావే? ముయ్యి నోరు" అని ఓ లెంపకా యిచ్చింది సువార్త.

'చెడిపోయింద'న్న మాట శరాఘాతంలా తగిలింది దేవదానానికి. భార్య ఆ మాట న్నాక పరిస్థితి విస్పష్టమైంది అతనికి. తన వివశత్వపు తెలివిడి కలిగింది. చేతికంటిన మైలను కడుక్కోవాలి. ఆడు ఏమంటాడో? దేవదానం మనసు వికలమైంది.

ఇంటికెళ్లాక శౌరయ్య కొడుకును లాంఛనప్రాయంగా తిట్టాడు కానీ, డబ్బు పోయిన దుగ్ధ అతన్ని పీడించింది. అయితే దేవదానం పొగరు అణచినందుకు మనసులో తృప్తి కలగకపోలేదు. లచ్చువమ్మ మాత్రం కొడుకును రెండు దెబ్బలేసింది. "నీకేంరా! మొగోడివి! ఆ పిల్ల బతుకు బుగ్గి చేసినావు కదరా! పరువున్న వాడెవడు కట్టుకుంటాడు దాన్ని" అని గోల పెట్టింది.

"ఏందే నీ గోల! దాని బతుకు సంగతి దాని నాయన చూసుకుంటాడు. నీ కొడుక్కు బుద్ధి చెప్పు చాలు" అన్నాడు శౌరయ్య కసురుకుంటూ.

"ఇంకేం చెప్తవు బుద్ధి! బంగారినిచ్చి పెళ్ళి చేసేద్దాం"

"సరే, అదేం ఇస్తుందో కనుక్కో"

"ఏందిచ్చేది! డబ్బు కాపీనంలో చిన్నోడి బతుకు పాడు చెయ్యకు"

సాయంత్రానికి భార్య సువార్తను, పాస్టర్‌ను వెంటబెట్టుకుని శౌరయ్య ఇంటికి వెళ్ళాడు దేవదానం. ఇంటికి వచ్చిన దేవదానాన్ని పలుకరించలేదు శౌరయ్య. పాస్టర్ని మర్యాద చేసి కూర్చోబెట్టాడు. పాస్టరే విషయాన్ని ప్రస్తావించాడు.

"మీరిద్దరూ సమస్య సామరస్యంగా పరిష్కరించుకుంటే మంచిది. ఏసు ప్రభువూ సంతసిస్తాడు. ఆళ్లిద్దరికీ పెళ్ళి జరిపిస్తే మంచిది" అన్నారాయన.

"మా ఆడది ఆ చెడిపోయిన దానితో నా కొడుక్కు పెళ్ళికి అంగీకరించదు. మా మనవరాల్ని చేసుకుంటున్నాము" అన్నాడు శౌరయ్య.

"చాల్లేవయ్యా చెప్పొచ్చావు! నీ కొడుక్కాదూ దాన్ని చెడగొట్టింది" అంది సువార్త.

"చేసిన పాపంలో ఇద్దరికీ భాగముంది. ఆ పిల్ల చెడిపోయినది అయితే, నీ కొడుకూ చెడిపోయినోడే. మనమంతా పాపం చేసినోళ్ళమే. పాపం చేయనోడు ఎవడో ఆడు ముందు ఆళ్ళని చెయ్యెత్తి చూపాలి. ఇంతయ్యాక నువ్వు నీ కొడుక్కు మనవరాలిని చేసుకుంటానంటే కుదరదు" అన్నాడు పాస్టరు.

ఇంక లచ్చువమ్మ కలుగజేసుకుంది "ఆళ్ళు పిల్లనిస్తామని వస్తే, నేను ఎందుకు వద్దంటాను. మనోడి వల్ల తప్పు జరిగినాది. దిద్దుకుందాం. ఈళ్ళు పిల్లనివ్వరేమోనని నేను బంగారి సంగతి ఎత్తినాను" అంది.

"నీకెందుకు. నువ్వు లోపలికి పో. నేను మాట్లాడుతున్నాగా? " అని కసురుకున్నాడు శౌరయ్య భార్యను.

"న్యాయపు గొంతు నొక్కెయ్యకు, శౌరయ్యా! పిలగాడి తల్లి! బతుకు కష్టం తెలిసిన తల్లి! మాట్లాడనీ ఆమెను"

అన్నాడు పాస్టరు.

లచ్చువమ్మ కొడుకు నారాయణను లోప లినుంచి బయటకు రమ్మని పిల్చింది. అతడు రాగానే, "ఏందిరా, ఆళ్ళు పిల్లనిస్త మంటరు. నువ్వు చేసుకుంటవా? " అని అడిగింది.

జీవితంలో ఓ ఆడది తప్పదు. రేణుక తనకు చక్కటి సుఖాన్నిచ్చింది. ఆమె యిచ్చే సుఖంకోసం అతని శరీరం పెరపె రలాడుతున్నది. అవమానం, తిరస్కారం, తిట్లు అతనంతగా పరిగణించలేదు.

"ఆం చేసుకుంటాను" అన్నాడు నారా యణ.

తను కేసును నీరుగార్చేసిన భార్యపై లోలోపలె మండిపోయాడు శౌరయ్య.

"ఇంకేం, పిలగాడూ ఒప్పుకునె. నేనింక చర్చిలో ప్రకటన చేస్తాను. రేపాదివారం పెళ్ళి చేద్దాం" అన్నాడు పాస్టరు.

"ఏందీ చర్చిలో పెళ్ళా? నేను ఒప్పు కోను. ఎల్లమ్మ గుడిలో పెళ్లి జరగాల" అంది లచ్చువమ్మ.

"అట్లెట్ల కుదుర్తది. క్రైస్తవుల అమ్మాయి పెళ్ళి చర్చిలో జరుగుట న్యాయం" అన్నాడు పాస్టరు.

"మేం మతం పుచ్చుకోలేదు. పాస్టరా యనా! నా కొడుకు పెళ్ళి ఎల్లమ్మ గుడిలో జరగటమే న్యాయం" అంది లచ్చువమ్మ.

"అట్లయిన నాకిందులో సంబంధం లేదు" అని లేచి నిలబడ్డాడు పాస్టరు.

"సరే, ఎళ్ళు! నువ్వొచ్చినావనే నేనింత సేపు మాట్లాడినాను. లేకపోతే ఈ దరి ద్రపు పంతులు కూతురితో నా కొడుకు పెళ్ళేమిటి? " అన్నాడు శౌరయ్య సంతో షంగా.

"డబ్బు వస్తది, పోతది. మతం మనం తెచ్చుకున్నది కాదు. ప్రభువు ఇచ్చినది. ఈ పెళ్ళి జరగవలెనంటే నీ కొడుకు మా మతం పుచ్చుకోవలెను. లేకుంటే పెళ్లి జర గదు" అని బయలుదేరాడు పాస్టరు.

**కొత్తగాలి...** 

**వరి వర్రీ ఔతోంది**
**ధరలో ధర లేదని**
**రైతుకు దడ ఉందని**

—కందాళై రాఘవాచార్య, నిజామాబాద్

దేవదానమూ లేవబోయాడు. సువార్త అతని చొక్కా పట్టుకుని కూర్చోపెట్టింది.

"ఏందీ నువ్వా లేస్తావు? అది ఆయన కూతురా? నీ కూతురా? " అడిగింది సువార్త భర్తను గదమాయిస్తూ.

ఏం చెయ్యాలో తెలియని దేవదానం కూర్చుండిపోయాడు. భర్తతో ఏదీ కాదని ఆమె కాపురానికి వచ్చిననాడే నిర్ధారించు కుంది. వెంటనే భర్త నిరర్థకపు పనులను నిలుపుదల చేయించింది. భర్తవల్ల కాదు కనుక ఇంక తనే మాట్లాడాలని సంకల్పిం చింది. సూక్ష్మబుద్ధి గనుక, ఆ ఇంట్లో తమ పక్షం పలికే మనిషి ఉందని గ్రహిం చింది. అందుకే ఆ పక్షానికే అప్పీలు చేసు కుంది ఆమె.

"అక్కా! ఇంతయ్యాక మేం మతమని పాకులాడితే అయ్యేపని కాదు. ఏ మత మని ఆళ్ళు ఒకటయ్యారు! నీ ఇష్టమొచ్చి నట్టే ఎల్లమ్మ గుడిలో పెళ్ళి చేద్దాం. మా పరిస్థితి నీకు తెలవనిది కాదు. ఆయనది బతకలేక బడిపంతులుద్యోగం, మా చేత నైంది పిల్లకు పెడ్తాం. ఈ పెళ్లి కానిచ్చి మమ్మల్ని గట్టెక్కించి పుణ్యాం కట్టుకో" అంటూ లచ్చువమ్మ చేతులు పట్టుకుంది సువార్త.

"అట్లనే. రంగాచారి నడిగి లగ్గం పెట్టి స్తను" అంది లచ్చువమ్మ.

ఇంక శౌరయ్య ఊర్కోలేకపోయాడు.

"ఏందీ, ఆడోళ్ళు మాట్లాడుకుంటే సరిపో యినాదా? నీ మొగుడికి లోకం సంగతె ట్లాగో తెలియదు. నువ్వన్న వినుకో తల్లీ! మొగోడు ఆడు తప్పు చేశాడని ఎవరూ అనరు. రెండ్రోజులు చెప్పుకుంటారు. ఆనక మానుకుంటారు. మీ పిల్లకు బుద్ధి లేదు. బయటకు పంపేదాన్ని కట్టుది ట్టంగా పెంచుకోలేదు. ఒకేళ అది నా కొంపకొస్తే అదెట్టా నడుచుకుంటాదోనని నాకు బయంగా ఉంది. సరే, ఆ సంగత ట్లుంచు. మేమేమీ ఇవ్వలేనంటే పెళ్లి కుదర్దు. పోలీసోళ్ళకు ఇచ్చిన పదేలూ ముద్దరసుద్ధిగా నా చేతిలో పడాల. ఆ మాటే పొద్దున నీ మొగుడికి చెప్పాను, తరువాత మాట్లాడుకుందామని. 'నీతో నాకు మాటలేంది' అని రొమ్ము విరుచు కుంటూ పొగరుగా ఎళ్ళాడు నీ మగడు. ఆ డబ్బిచ్చాక, నేను మిగతా విషయాలు మాట్లాడతా. అప్పటిదాకా నాకు మీతో మాటల్లేవు" అని లేచాడు శౌరయ్య, ఇంక వెళ్ళిపోండన్నట్లు.

"అదేందన్న! పెద్దమడిసివి! నలుగురికి చెప్పేటోడివి! ఆ పదేలూ అట్లనే ఇస్తం. ఇంక జరగాల్సిందేందో చెప్పు" అంది సువార్త.

"సరే. ముందుగా ఆ పదేలూ నా చేతిలో పడాల. అది తప్పు చేసినది. అందుకు పదేలు ప్రాయచ్చిత్తం కట్టాల. నా కూతుళ్ళొక్కొక్క దానికీ మూడు తులాల బంగారం పెట్టాల. నేను చేసే పెళ్ళి ఇదే చివర్ది. నా పెళ్ళానికీ, నాకూ మంచి బట్టలు పెట్టాల. కట్నం యాభై వేలు ఇవ్వాల. అంత డబ్బు నీ దగ్గరుంటే మాట్లాడు. లేకపోతే ఎళ్ళు అదీ నువ్వొచ్చి నావు కనుక ఇంతసేపూ మాట్లాడినా. నీ మొగుడొస్తే, మెడబట్టి బయటకు గెంటెటో డిని" అని వెళ్ళిపోయాడు శౌరయ్య, భార్య పిలుస్తున్నా విన్పించుకోకుండా.




రోజులు గడచినా సమస్యకు పరి ష్కారం లభించలేదు. శౌరయ్య బిగిసి కూర్చున్నాడు. అతను సుమారుగా లక్ష రూపాయలు అడిగాడు. అంత డబ్బు తనె క్కడనుండి తేగలడు. బూర్గంపాడులో సొంత ఇల్లు అమ్మగా వచ్చిన పదిహేను వేలు బాంకిలో వేసి ఉంచుకున్నాడు. తమ్ముడికి భాగం పోగా అది తనకు మిగి లింది వడ్డీ అది కలిపి ఇరవై వేలకంటే ఉండదు. కానీ, ఆ డబ్బుతో పని గడవదు. అందుకుతోడు మరో సమస్య కూడా తోడైంది. దేవదానానికి రేణుక గర్భవతి అయిందేమోనన్న అనుమానం కలిగింది. రుతుక్రమం ఆలస్యమైంది. పిహెచ్‌సికి తీసుకెళ్ళి డాక్టరుకు చూపించవచ్చు గానీ, డాక్టరు ఏం చెప్తాడోనని భయమేసి ఆమెను ఆసుపత్రికి తీసుకెళ్ళలేదు. ఇంత దౌర్భాగ్యపు పరిస్థితులు అతను జీవితంలో ఎదుర్కోలేదు. కూతుర్ని కాలేజీ మాన్పిం చాడు. జీవచ్ఛవంలా స్కూలుకు వెళ్ళి వస్తున్నాడు. ఆ యేసు ప్రభువు ఒక్కడే తన్ను కాపాడాలి. రాత్రిళ్ళు కూడా నిద్రపో కుండా ప్రభువును పార్థిస్తూ గడిపాడు. పెళ్ళి ఒక్కటే పరిష్కారం కాదు. సమస్యకు వేరే మార్గాలు వెతుక్కోవచ్చు అన్న మన స్థితి ఆ కాలంలో లేదు. తన్ను షేక్ బాషాతో పంచుకోవటానికి నారాయణ

అంగీకరించాడని తెలిసనప్పటినుంచీ రేణుక అతన్ని అసహ్యించుకోసాగింది. ఒకటి రెండుసార్లు నోరెత్తి చెప్పి దెబ్బలు తిందిగానీ, అందువల్ల మరో ప్రయోజనం కలగలేదు. అక్కడ నారాయణ తండ్రి తన పెండ్లి విషయం డబ్బు గుంజాలన్న యావలో జాప్యం చెయ్యటం అతను సహించలేకపోయాడు. తండ్రితో ఒకటి రెండుసార్లు పోట్లాడాడు. తండ్రీ కొడుకులు కొట్టుకునే పరిస్థితి వచ్చేసరికి, వారిని ఆపటం లచ్చువమ్మకెంతో కష్టమైంది. తన డిగిన దానిలో కొంతయినా రాబట్టుకోగలిగితే ఆ పిల్లను తన కోడలుగా చేసుకోవడానికి అతనికి అభ్యంతరం లేదు. కాని డబ్బు రాబట్టటమెట్లా? మొండి కొడుకును దారిలోకి తెచ్చుకోవటమెట్లా? అన్న సమస్యా శౌరయ్యను వెంటాడింది.

చివరకు సమస్య పరిష్కారమయింది. ఊరంతా గుప్పుమన్న వ్యవహారం అనసూయమ్మకూ చేరింది. ఆమెకు వ్యధ కలిగింది. మరియమ్మకు తనేం చెప్పుకోగలదు! అది చనిపోయేటప్పుడు రేణుక భారం తనకు అప్పగించింది. వయసు ప్రభావం తనకు తెలియంది కాదు. తన సాన్నిహిత్యంలో అది శమిస్తుందని తను అనుకున్నది. తన పెంపకంలోనే ఏదో లోపం ఉంది. ఆ పిల్లకు దారి చూపాలి. లేకపోతే తనను తాను సమాధానపర్చుకోలేదు. అనుకుంది కానీ, జీవగత పరిణామంలో సంస్కారం మజ్జాగతమవటానికి తరాలు గడుస్తాయని ఆమె తెలుసుకోలేకపోయింది.

ఓరోజు ఆమె ఇంట్లో పెద్దలనందర్నీ సమావేశపర్చింది. ఊరి పెద్దలకు ఆమె అంటే గౌరవం వుంది. శౌరయ్య తన డిమాండ్లను వివరించాడు. ఆ మీదట అనసూయమ్మ చెప్పింది.

"నువ్వనట్టు దేవదానం కూతురు తప్పు చేసిందే అనుకుందాం. అయితే స్త్రీ అబల

> **కొత్తగాలి...**
>
> వరినారు
> నవ్వుతోంది
> నీళ్లు తగలగానే
>
> –ఆత్రం శశికిరణ్, చొప్పదండి

అని సమాజం అంతా అంగీకరిస్తుంది. ఆ పిల్ల తనకిష్టమై వెళ్ళిందో లేక నీ కొడుకు ఆ పిల్లని బలవంతంగా ఎత్తుకెళ్ళాడో మనకు తెలియదు. ఎత్తుకెళ్ళడాన్ని ఇంగ్లీషులో కిడ్నాప్ అంటారంట! ఆ పని చేశాడని దేవదానం నీ కొడుకు మీద కేసు పెట్టలేదు. ఒకవేళ పెట్టి ఉంటే నీ పెద్దకొడుకు చరిత్ర ఉంది కనుక పోలీసులు అతని మాటలు తేలిగ్గా నమ్ముతారు. ఈ కుటుంబంలో అందరూ అంతే అనుకోవటం నీకూ మంచిది కాదు. కనుక నువ్వు పోలీసు స్టేషన్‌లో చెల్లించిన పదివేలల్లో సగం మాత్రమే అతను నీకివ్వాలి. మీ పిల్లలకోసం చెరిసగం మీరు పెట్టుకోవాలి. అందులో ఐదు వేలు మాత్రమే నీకు వస్తాయి..."

"దొరసానమ్మ చెప్పింది న్యాయంగనే ఉంది" అన్నాడు సాలె జంగమయ్య.

తప్పుకోసం శిక్షగా పదివేలివ్వాలని అన్నావు. ఇలాంటి విషయాల్లో తప్పు జరిగిందని మనం భావిస్తే అది ఒక్కళ్ళ వల్ల జరగదు. ఇద్దరివల్లా జరుగుతుంది. కనుక ఆ పిల్లనొక్కదాన్నే తప్పు చేసిందని వేలెత్తి చూపాల్సిన పనిలేదు. నిజానికి దేవదానం నీ కొడుకు మీద కిడ్నాప్ కేసు పెట్టనందుకు పరిహారంగా నువ్వే పదివేలు ఇవ్వాలి. కనుక తప్పుకింద పదివేలివ్వాలన్నది చెల్లదు"





## కొత్తగాలి...

**మిక్సీలు, గ్రైండర్లూ,**
**వ్యాక్యూంక్లీనర్లు, వాషింగ్‌మిషన్లూ**
**భామలంతా**
**బ్రాయిలర్ కోళ్లు**

*—అయినాల కనకరత్నాచారి, కొణపాడు*

ఆపైన ఆమె చెప్పిన మాటలకు శౌరయ్య పరిస్థితి ఇరకాటంలో పడినట్ల యింది. నువ్వే నీ కూతుళ్ళ ఆడబిడ్డలకు పెట్టలేదంది. తన తండ్రి ఉదారత్వం చూపాడంది. ఆయన తన స్నేహితు డంది. ఆడబిడ్డల ఉసురు పడకూడదంది. ఇంత లౌక్యం అనసూయమ్మ ప్రదర్శించగ లదని అతను ఊహించను కూడా లేదు. "మీ ఇష్టమమ్మా మీరెట్లంటే అట్లనే చెప్పి నానుగంద" అన్నాడు. ఊరి పెద్దల ముందు మరోవిధంగా మాట్లాడే అవకాశం లేదు. వాళ్ళకు కోపం వస్తుంది. ఆపైన మళ్ళీ ఎన్నికల్లో తను సర్పంచిగా నిలబ డాలి. రిజర్వుడు సీటు అయినా, వాళ్ళు తనకు వ్యతిరేకంగా చంద్రిగాడిని నిలబెట్ట వచ్చు. వాడు చిట్లు బిజినెస్సు పెట్టి పైకి వస్తున్నాడు. సర్పంచి పదవి హుళక్కి అయితే పంచాయితీ నిధుల్లో తను నంజు కునేదీ అంతమవుతుంది. శౌరయ్య ముగ్గురు కూతుళ్ళకీ మనవరాలికీ నల్గురికీ నాలుగు అరతులాల బంగారం, ఇంట్లో అందరికీ బట్టలు పెట్టాలని అనసూయమ్మ ప్రతిపాదించటంతో అతను ఊపిరి పీల్చు కున్నాడు.

"పోలీసులకు ఇచ్చిన దానిలో ఐదువేలు, ఆడబిడ్డలకు బంగారం బట్టల బాపతు ఐదువేలూ మొత్తం పదివేలూ రేపటెల్లుం డిల్లో దేవదానం శౌరయ్యకివ్వాలి. అప్పు చేస్తాడో, తల తాకట్టుపెడ్తాడో అతనిష్టం."

"రేపే ఇస్తానమ్మా" అన్నాడు దేవదానం, అనసూయమ్మకు నమస్కరిస్తూ. ఆ ఏసు ప్రభువే ఆమె రూపంలో అవతరించినట్లని పించింది అతనికి.

రేణుకను నా కూతుర్లాగా పెంచాను. ఆమె పెళ్ళికి కట్నం కింద యాభైవేలు నేనిస్తాను. "కట్నం యాభైవేలు నేను నా తమ్ముడికి ఉత్తరం రాసి తెప్పిస్తాను. ఆ డబ్బు వచ్చిందాకా పెళ్ళి ఆగటానికి వీలు లేదు. రెండు మూడు రోజుల్లో పెళ్ళి జరి గిపోవాలి. నామీద నమ్మకముంటే వెంటనే పెళ్ళి జరిపించు శౌరయ్యా!"

"అమ్మ దొరసానో! తఁవరి మాటల మీద నమ్మకం లేకపోవటమేంది? తఁవరు అన్నారంటే జరిగి తీరతాది" ఆ విషయంలో శౌరయ్యకే మాత్రం అపన మ్మకం లేదు. వెలమదొరలు మాటకు కట్టుబడి ఉంటారు.

"రంగాచారిగారూ, ఇంక లగ్నం పెట్టండి. లచ్చువమ్మ కోరినట్లే ఎల్లమ్మ గుడిలోనే పెళ్ళి జరుగుతుంది."

రంగాచారి పంచాంగం సంప్రదించి, వేళ్ళమీద గుణించి "ఎల్లుండి దివ్యమైన ముహూర్తం ఉంది, రాత్రి ఏడు గంటల ఆరు నిమిషాలకు" అన్నాడు.

"ఇంకేం శుభం! ఎల్లుండి అందరూ పెళ్ళికి రావాలి. దేవదానం తరపున నేను మీ అందర్నీ ఆహ్వానిస్తున్నాను" అంది అనసూయమ్మ.

అందరూ లేచి బయలుదేరుతున్న తరు ణంలో రంగాచారి చెప్పాడు. " అమ్మా! నాకు తొంభయ్యేళ్ళు. నేనెక్కువకాలం బత కను. నా కొడుకులకు వేణుగోపాలస్వామి పట్టడు. వాళ్ళు ఉపాధి వెతుక్కుంటూ దేశాలు పట్టిపోయారు. మీ కుటుంబం వారు అనాదినుంచి ఆలయ ధర్మకర్తలు. గుడి శిథిలమయిపోతున్నది. నేను ఇంత కుముందు తమ తమ్ములుంగారికి

విన్నపం చేసుకున్నాను. వారేం మాట్లాడ లేదు. నేను పోతే స్వామి పూజ, కైంక ర్యాలు ఎవరు జరిపిస్తారో తెలియదు. స్వామికి భూమి వందల ఎకరాలు ఉండేది. కబ్జాలయ్యాయి. పైస లేదు. ధూపదీప నైవేద్యాలకే కష్టంగా ఉంది. తమరు పట్టించుకోకపోతే గడవటం కష్టం."

'కబ్జా' ప్రస్తావన వచ్చేసరికి ఆ విష యంలో అనసూయమ్మ తమని నిలదీస్తుం దేమోనని కాపు వీరాస్వామి, గౌండ్ల రాములు వెంటనే జారుకున్నారు. దేవుడి భూమిని ఆక్రమించి, సాగు చేసుకుంటున్న వారిలో వారు ముఖ్యులు. అనసూయమ్మ తనకు చేతనయినది చేస్తానని చెప్పి ఆయన్ని సమాధానపర్చింది.

రేణుక పెళ్ళయింది. పెళ్ళి తనకిష్టమేనా అని అనసూయమ్మ కూడా రేణుకను ప్రశ్నించలేదు. అలా ప్రశ్నించాలని కూడా ఆమెకు తట్టలేదు. అనసూయమ్మ తమ్ముడికి ఉత్తరం రాసింది. తనకు ఓ రెండు లక్షల రూపాయల అవసరం ఉందనీ పంపవలసిందనీ రాసింది. రెండు లక్షల తమ్ముడికి లెక్కలోనిది కాదని ఆమెకు తెల్సు. ఉత్తరం చివరగా "నాయన ఆస్తిలో నాకు భాగం ఉందని పంపినా సంతోషి స్తాను. లేదూ తోడబుట్టిన దానికి తమ్ముడు ఆదరంగా ఇచ్చిన బహుమానమ న్నా సంతోషమే" అని రాసింది.

ఆ ఉత్తరం అందగానే విమల భర్త మీద విరుచుకుపడింది.

"చూశారా? మీ అక్క తక్కువది కాదు. ఆస్తిలో భాగం పెట్టాలట! విధవకు రెండు లక్షలెందుకూ? ఊళ్ళో ఏ దరిద్రుడికో కట్ట బెట్టడానికి పంపకండి. నెలనెలా పంపే ఆ వెయ్యి రూపాయలు కూడా బంద్ చెయ్యండి. అప్పుడుగానీ తెలిసిరాదు ఆమెకు, ఆస్తిలో భాగమడిగే ఆ అహంకారమేమిటో!"

## కొత్తగాలి...

**సన్యాసులు**
**కనిపించట్లేదు కదూ!**
**ఔను**
**సన్నాసులెక్కువవుతున్నారుగా.**

-కన్నోజు లక్ష్మీకాంతం, హైదరాబాద్

"వెయ్యి రూపాయలు ఆమెకోసం పంపడం లేదు. పద్మనాయకుల ఆడపడుచు దీనంగా బతుకు గడపకూడదని పంపుతున్నా. ఆ విషయంలో రెండో మాటకు తావులేదు. రెండు లక్షలెందుకో విచారించాలి. తెలుసుకున్నాక ఏం చెయ్యాలో ఆలోచిస్తాను" అన్నాడు హరినారాయణరావు.

తన ఉత్తరానికి తమ్ముడి దగ్గర నుండి ప్రతిస్పందన లేకపోతే మళ్ళీ ఉత్తరం రాసింది అనసూయమ్మ. "మరియమ్మ కూతురు రేణుక అంటే నాకెంత వాత్స ల్యమో నీకు తెలియంది కాదు. ఆ పిల్ల పెళ్ళి అనుహ్య పరిస్థితుల్లో శౌరయ్య రెండో కొడుకుతో జరిగింది. యాభైవేల కట్నమివ్వాలని భీష్మించుకు కూర్చున్నాడు శౌరయ్య. నేను ఇస్తానని వాగ్దానం చెయ్యటంతో పెళ్ళి జరిగింది. వేణుగోపాల స్వామి ఆలయం శిథిలావస్థలో ఉంది. మనం ఆ ఆలయ ధర్మకర్తలం. దాన్ని బాగుచేయించాలి. అందుకు ఎంతవుతుందో నాకు తెలియదు. కనీసం లక్ష లక్షన్నర పడుతుందేమో. అది నీ బాధ్యత కూడా, స్వామి భూములను కబ్జాచేసిన జనాలు ఆలయ ఉద్ధరణకు చందాలిస్తారని నేను భావించటంలేదు. నువ్వు కాదంటే నాకు తప్పదు. డెభైయ్యేళ్ళు వస్తున్నాయి నాకు. ఇదివరకటి ఓపిక లేదు. శ్రీనాధుడ

## కొత్తగాలి...

**కొండలు**
**భూమి ఎగిరిపోకుండా**
**పెట్టిన బరువులు**

**–అనురాధరామకృష్ణ,** నెల్లూరు

న్నాడు, మనసుతోఁ బుట్టిన మంచి తలంపు లాచరణము నందు నలవికాకున్న జన్మఫలంబేమి? చచ్చుట మేలు అని. చచ్చయినా సాధిస్తాను. స్వామి ఎప్పటిలా చిరునవ్వుతో కళకళలాడుతుండాలని నేను కోరుకుంటున్నాను. వేణుహస్తాలంకృతుడు అయిన స్వామి నిన్ను నీ కుటుంబాన్ని ఆయురారోగ్యాలతో, సుఖసంపదలతో ఆశీర్వదించాలని కోరుకుంటున్నాను.

ఉత్తరం అందాక మళ్ళీ తర్జన భర్జనలయ్యాయి. "ఆ మాలపిల్ల పెళ్ళికి మీరు కట్నమివ్వటమేమిటి? మనమక్కడ ఉండటం లేదు. ఆలయ పునరుద్ధరణ బాధ్యత ఊరి వాళ్ళదే. మీరు గమ్మున ఊర్కోండి. ఇవాళ డబ్బు అడుగుతుంది. రేపు తనకు ఆస్తిలో భాగం పెట్టమని కోర్టుకెక్కుతుంది" అంది విమల.

హరినారాయణరావు ఏం మాట్లాడలేదు. "నేను వారం రోజుల్లో గంధసిరికి వస్తాను. ఏం చెయ్యాలో అప్పుడు ఆలోచిద్దాం" అని క్లుప్తంగా ఉత్తరం రాసిపడేశాడు.

రెండు నెలలు గడిచిందిగానీ హరినారాయణరావు అయిపులేడు. ఇప్పటికే శౌరయ్య రెండుసార్లు వచ్చి వెళ్ళాడు. తమ్ముడు ప్రతినెలా పంపే వెయ్యిలో నాలుగు వందలకంటే ఆమెకు ఖర్చయ్యేవి కావు. మిగతా డబ్బంతా బ్యాంకులోనే ఉంది. అందులోనుండి పదివేలు తీసి అతనికిచ్చి తమ్ముడు గంధసిరికి త్వరలో వస్తాడనీ, రాగానే మిగతా డబ్బు ఇస్తానని ఆమె వాగ్దానం చేసింది. మరో నెల గడిచింది. తమ్ముడి దగ్గరనుండి ఆమెకే ఉత్తరం రాలేదు. నెలనెలా వెయ్యి రూపాయల భరణం వస్తూనే ఉంది. తమ్ముడు డబ్బు పంపడని ఆమెకు నిర్ధారణ అయింది. వేణుగోపాలస్వామిని వేడుకుంది తనకు దారి చూపమని. ఆలయోద్ధరణకు కబ్జాదారులపై ఉద్యమించాలి. ఊరి పెద్దలే కబ్జాదారులు. వారు అందుకు తనకు సహకరించరు. తనకూ ఇదివరకటి ఓపిక లేదు. 'అయ్యో స్వామీ నేను ఎంత అహంకరించాను. నీ కోసం ఏదో చెయ్యాలని అహంకరించాను. నా వల్ల ఏమీ కాదని నిర్ధారణ అయిపోయింది. నా అహం చచ్చిపోయింది. ఇంక నీ ఉద్ధరణ నువ్వే చూసుకో తండ్రీ! శౌరయ్యకిచ్చిన మాట కూడా భగ్నమవుతుంది. నేనేం చేయగలను. అశక్తురాలిని. నన్ను తీసుకెళ్ళిపో తండ్రీ" అని నిరంతరం వేణుగోపాలస్వామి ధ్యానంలో గడిపిందామె.

శౌరయ్య మళ్ళీ వచ్చి నిష్ఠూరంగా మాట్లాడి వెళ్ళాడు. పెళ్ళయిన నెలరోజులకు లచ్చువమ్మ చనిపోయింది. 'కోడలొచ్చిన వేళ' గొడ్డొచ్చిన వేళ అన్న సామెత ఉండనే ఉంది. అప్పటినుండి శౌరయ్యకు కోడలంటే మంటగా ఉంది. "కట్నం డబ్బొచ్చేదాకా దాన్ని పుట్టింటికి పంపెయ్యి. అది నా ఇంట్లో ఉండటానికి వీల్లేదు" అని కొడుక్కు హుకుం జారీచేశాడు. పితృవాక్య పరిపాలకుడయిన నారాయణ భార్యని మామగారింటికి పంపటమే కాదు, తనూ వచ్చి అక్కడే తిష్టవేశాడు. తనకు సౌకర్యాలు సరిగ్గా జరగటంలేదని దాష్టీకం చేసేవాడు. "మీరు ఏ చావైనా చావండి. నాకు మాత్రం మాంసం కూర లేకపోతే ముద్ద దిగదు" అని స్పష్టంగా చెప్పేశాడు.

# ఓ ఆలోచనే పెట్టుబడి





అమెరికాలోని ఒరెగాన్ రాష్ట్రానికి చెందిన జౌసొరెన్‌సెన్ (38) ఓ రోజు ఉదయం ఓ రెస్టారెంట్‌కి వెళ్ళి కాఫీ అడిగాడు. వాళ్ళు కాఫీని ఉపయోగించి పారేసే గ్లాసుతో దాని చుట్టూ నేప్కిన్‌ని చుట్టి ఇచ్చారు. అయితే అది అతని చేయిజారి అతనిమీద కాఫీ ఒలికింది.




రియల్ ఎస్టేట్ బ్రోకర్‌గా అట్టే ఆదాయం లేక ఇబ్బంది పడే అతనికి ఈనాటి టెక్నాలజీతో చేతిలోంచి జారని కాఫీ గ్లాస్‌ని ఎవరూ చేయలేదా? అనిపించింది. ఆ పని తనే ఎందుకు చేయకూడదనుకున్నాడు. కాఫీ గ్లాసులు వేడిగా ఉండడంతో కాఫీగ్లాసు అడుగున ఓ వేలుని, పైన అంచున బొటన వేలిని పెట్టి కాఫీ పట్టుకెళ్ళే అనేకమందిని చూసాడు.

జౌ అనేక రకాల కాగితాలని కాఫీగ్లాస్‌కి చుట్టి అనేక పరిశోధనలు చేశాడు. చివరికి కార్డ్‌బోర్డ్ ఇన్సులేటింగ్ స్లీవ్‌ని గ్లాస్‌కి చుట్టూ బిగుతుగా చుట్టాడు. అప్పుడు దాన్ని పట్టుకుంటే చేతిలోంచి జారలేదు. వేడి కూడా వేళ్ళకి తగల్లేదు. దానికి 'జావా జాకెట్' అనే పేరు పెట్టి తన పేర పేటెంట్ తీసుకున్నాడు. ఓ ట్రేడ్ షోలో జావా జాకెట్‌ని ప్రదర్శించాడు. 'కాఫీ పీపుల్' అనే కాఫీ షాపు వారు 10,000 జాకెట్లకి తక్షణం ఆర్డరిచ్చారు. 'స్టార్‌బక్స్' కాఫీ షాపు ఓనరు కూడా పెద్ద ఆర్డరిచ్చారు.

కాఫీలమ్మే షాపులవారికి అది ప్రయోజనకారిగా కనిపించింది. త్వరలోనే అమెరికాలోని 2500 కాఫీ షాపులకి, 25 మంది డిస్ట్రిబ్యూటర్ల ద్వారా నెలకి 4.5 కోట్ల జావా జాకెట్లని అమ్మసాగాడు. వీటి అమ్మకంతో జౌసొరెన్‌సెన్ త్వరలోనే కోటీశ్వరుడయ్యాడు.



ఇస్తానన్న కట్నం ఇవ్వకుండా అల్లుడు తద్దినాన్ని తమ ఇంటికి తెచ్చిపెట్టిన అన సూయమ్మను సువార్త దుమ్మెత్తిపోసింది. చెంచులమ్మ సణిగింది.

ఇలాంటి విపత్కర పరిస్థితుల్లో వేణుగో పాలస్వామి అనసూయమ్మను కరుణిం చాడు. ఓరోజు పోస్టుమన్ ఆమెకో రిజి ష్టరు కవరు డెలివరీ చేశాడు.

"ఎక్కడనుండి? హైదరాబాదు మా తమ్ముడి దగ్గరి నుండా? " అని అడిగింది ఆమె ఆత్రుతగా.

"లేదమ్మా! తూర్పుగోదావరి జిల్లా సర్ప వరం నుండి. పేరు రామలింగనాయు డంట!" అని ఆమెకాకవరు ఇచ్చి సంతకం తీసుకుని వెళ్ళిపోయాడు.

ఆమెకు గుండెలవిసిపోయాయి, ఏ దుర్వార్త వినాల్సి వస్తుందోనని. సర్పవరం తన అత్తవారి ఊరు. రామలింగనాయుడు తన పెద్దమరిది. కవరు చింపకుండా రెండు క్షణాలు దుర్వార్తను తెలుసుకో కుండా వాయిదా వేసింది. అయితే ఆమె మనసుండబట్టలేదు. చింపి ఉత్తరం తీసింది. పెద్ద ఉత్తరం. మొదటి వాక్యమే ఆమెని అఘాతపర్చింది. "మా అన్నయ్య ఎర్రమనాయుడు క్రితంనెల పదవతారీ ఖున చనిపోయాడు. మిమ్మల్ని చూసిన గుర్తు కూడా నాకు లేదు. అన్నయ్య 'వదిన' అని చెప్పడంవల్లే మిమ్మల్నిలా సంబోధించవల్సి వస్తున్నది" ఇంక ఆమె ఆ ఉత్తరం చదవలేదు. గూట్లో పడేసింది. తన బతుక్కు ఆయనతో జీవితం పంచుకు న్నది లేదు. చివరకు తనకు వైధవ్యం కూడా రాసిపెట్టాడు. ఓ క్షణం పిచ్చి ఎక్కి నట్లయింది ఆమెకు. బోరుమని ఏడ్చింది. నిస్త్రాణగా పడుకుండిపోయింది. కొంత తేరుకున్నాక లేచింది. ఎవరు తన కర్తవ్యం నిర్వహించకపోయినా, తన కర్తవ్యం మాత్రం తను నిర్వహించాలి. విధవ బతుకు బతికినా ఇప్పుడు అది తనకు స్థిర పడిపోయింది.

వెంటనే దొడ్లో బావి దగ్గరకు పోయింది. చివరిసారిగా ముఖానికి పసుపు పూసుకుని తలారా స్నానం చేసింది. గాజులు పగలగొట్టుకుంది. మంగళసూత్రం తనే తెంపుకుంది. ఇప్పటి దాకా బొట్టు పెట్టుకోవల్సి వచ్చేది. ఇంక ఆ పని కూడా లేదు. ఆ తడిబట్టలతోనే లోప లకు వెళ్ళి తెల్లచీరె తీసుకుని కట్టుకుంది. ఆచారం ప్రకారం భర్త చనిపోతే ఆడబి డ్డకు పుట్టింటివారు తెల్లచీరె కొనిస్తారు. తను కట్టుకున్న తెల్లచీరె పుట్టింటివారు అనుగ్రహించిందే. తనకు సొంత డబ్బు ఎక్కడిది? తమ్ముడు నెలనెలా, వదిలేసిన మొగుడు పంపాల్సిన భరణం పంపుతు న్నాడు. ఆమె ఒంటరిది. తన పునిస్త్రీ పరి త్యాగమంతా తనే నిర్వహించుకుంది. ఎంత పరాధీనమైన బతుకు తనది. ఒక్క సారిగా ఆమెకు దుఃఖం ముంచెత్తింది.

ఆ రోజు ఆమె వంట చెయ్యలేదు. వెంకన్న ఇంటి పనులన్నీ చేసి ఎప్పుడో వెళ్ళిపోయాడు. ఆమె ఇంటికి వచ్చేపోయే వారెవరూ లేదు. ముందు వాకిలి బార్లా తెరిచే వుంది. వెళ్ళి నేలమీద గదిలో పడు కునుండిపోయింది ఆమె. ఎప్పుడూ ఆమె ఒంటరే. కాని, ఇప్పటి ఒంటరితనం దుర్భ రమైపోయింది ఆమెకు. భర్త ముఖం కూడా ఆమెకు గుర్తులేదు. కాని భర్త భావన ఆమె మనసులో నిత్యం జాగృతమై ఉండేది. తను చేసే పనుల్లో ఉద్వేగరహి తమైన, నిరాసక్త ప్రోత్సాహాన్నిచ్చేది. భావు కతలో నిర్మించుకున్న ఆమె పీఠం కదిలి పోయింది. ఆమె నేల వరిగిపోయింది. తను బతకాలి కనుక బతికింది. ఇప్పుడు బతకాలన్న ఇచ్ఛ కూడా నశించింది. మనసు నిరామయమైపోయింది.

సాయంత్రం నాలుగింటిదాకా ఆమె

అలాగే పడి ఉంది. అప్పుడు ఆమెకు ఉత్తరం గుర్తుకు వచ్చింది. పక్క గదిలోకి వెళ్లి గూట్లో పడేసిన ఉత్తరం చదవసాగింది.

1962లోను ఆ తర్వాత 1969లోనూ ఇండియన్ డిఫెన్స్ అండ్ ప్రివెంటివ్ డిటెన్షన్ ఆక్ట్ కింద ఎర్రమనాయుడు అరెస్టయ్యాడు. జెయిల్లో నిర్బంధం అనుభవించాడు. 1964లో కమ్యూనిస్టు పార్టీ రెండుగా చీలిపోయింది. 1969లో సిపిఐ (ఎమ్.ఎల్) పార్టీ ఉద్భవించింది. కమ్యూనిస్టు పార్టీ చరిత్రే ఎర్రమనాయుడి చరిత్ర. శ్రీకాకుళం గిరిజన పోరాటం గురించి రాశాడు రామలింగనాయుడు. చారుమజుందార్ 1969లో ఆంధ్రకు రావటం, వర్గశత్రు నిర్మూలనకు వెంకటపు సత్యనారాయణతో కల్సి విభేదించటం, నాగభూషణ పట్నాయక్ ఇలా ఎన్నో విషయాలు నాలుగు పేజీల్లో రాశాడు రామలింగనాయుడు.

ఆ విప్లవ చరిత్రలో ఎర్రమనాయుడి పాత్ర గురించి రాశాడు. "నిజానికి నేను ఇవన్నీ రాస్తున్నాను కానీ, అసలేం జరిగిందో నాకు వివరంగా తెలియదు. అన్నయ్య మితభాషి. ఎక్కువ మాట్లాడేవాడు కాదు. ఆయనప్పుడప్పుడు చెప్పిన మాటలు, నా ఊహ జోడించి రాస్తున్నా" అన్నాడు. అనసూయమ్మకూ ఆ చరిత్ర పట్ల ఆసక్తి కలగలేదు. అతను రాసిన ఒక్క సంఘటన మాత్రం ఆమె దృష్టి నాకర్షించింది.

శ్రీకాకుళం విప్లవోద్యమంలో స్త్రీలూ పాలుపంచుకున్నారు. అప్పుడప్పుడే అందులోనూ వికృతులు ప్రారంభమయ్యాయి. "అన్నయ్యకు కడుపులో తూటా దెబ్బ తగిలింది. పార్వతీపురంలో విప్లవోద్యమ సానుభూతిపరుడయిన ఓ డాక్టరు నర్సింగ్‌హోంలో అతన్ని చేర్చారు. పోలీసులకు ఆయన ఆచూకీ తెల్సింది. ఆయన్ను అరెస్టు చేశారు. రకరకాలైన కేసులు బనాయించి ఏడేళ్ళ జైలుశిక్ష వేయించారు. ఆయన శరీరంలో శక్తి ఉడిగిపోయింది. ఆపైన నక్సలైటు ఉద్యమంపైనా అతనికున్న భ్రమలు తొలగిపోయాయి. శిక్ష అనుభవించాక ఇంటికి వచ్చాడు. 'అసలు తూటా దెబ్బ ఎందుకు తగిలింది?' అని అడిగినా. 'మా నాయకుడు ఓ మహిళా విప్లవకారిణిని (ఆ ఇద్దరి పేర్లూ ఆయన చెప్పలేదు) బలాత్కరించబోయాడు. నేను అడ్డుకున్నాను. మా ఇద్దరికీ ఘర్షణ అయింది. అతను ఆగ్రహంతో మండిపోతూ నాపై తుపాకి పేల్చాడు. మిగిలిన కామ్రేడ్లు అతన్ని అడ్డుకున్నారు. ఏదో ఆవేశంలో చేసిన పని. వాళ్లే నన్ను పార్వతీపురం ఆసుపత్రిలో చేర్పించారు. పోలీసులు మాటువేసి పట్టుకున్నారు. నాకు చికిత్స చేయించాక కేసులు పెట్టారు' అని చెప్పుకొచ్చాడు".

రామలింగనాయుడు రాసిన చివరి రెండు పేజీలూ ఆమె దృష్టినాకర్షించాయి.

"మా నాన్నకు మేం ముగ్గురం మొగపిల్లలం. ఇద్దరు ఆడపిల్లలు. మీకున్నంత వందల ఎకరాల భూమి కాకున్నా మాకూ పాతిక ఎకరాల మాగాణి భూమి ఉంది. మా నాయన చనిపోయేటప్పుడు ఆస్తి పంపకాలు చేశాడు. కూతుళ్ళిద్దరికీ చెరి రెండు ఎకరాలూ ఇచ్చాడు. ముగ్గురు కొడుకులకూ తలా ఏడు ఎకరాలు ఇచ్చారు. అన్నయ్య కమ్యూనిస్టు ఉద్యమంలో ఉండిపోయాడు. అందువల్ల ఆయన ఇంటికి తిరిగి వస్తాడని మేం భావించలేదు. చనిపోయేటప్పుడు నాయన చెప్పాడు. 'వాడు తిరిగివస్తే వాడి పొలం వాడికివ్వండి. లేదూ, మీరిద్దరూ అంటే నేనూ మా తమ్ముడూ అనుభవించండి. అవసరపడితే మీ పొలాలు అమ్ముకోండి.



వాడి పొలం అమ్మటానికి వీలు లేదు. వాడు తిరిగిరాకపోతే మీ తదనంతరం మీ పిల్లలు ఆ పొలం అమ్ముకోవచ్చు!' అని ఆయన వీలునామా కూడా రాశాడు. మాకు పంచిన భూమి ఆయన పిత్రార్జిత మైతే, అన్నయ్యకిచ్చిన భూమి ఆయన స్వార్జితం. ముమ్ముందు మాకు దుర్బుద్ధులు పుట్టి మేం అన్నయ్యకు అన్యాయం చేస్తా మని భావించకపోయినా, ఆయన దూరా లోచనతో చేసిన పని అది. ఆర్నెల్ల క్రితం అన్నయ్య తిరిగి వచ్చాడు. డెబ్బై ఆరేళ్ళ వృద్ధుడు. జవసత్వాలు ఉడిగిపోయాయి. అంతుపట్టని వ్యాధితో బాధపడ్డాడు.

"ఇంత చెప్పాక మీకర్థమై ఉంటుంది. మా అన్నయ్య మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు. నిష్ఠుర బ్రహ్మచర్య జీవితం గడిపాడు. నిజానికి కమ్యూనిస్టులకు సెంటిమెంట్లు ఉండకూడదు. నాయన పోయేముందు అన్నయ్య ఇంటికి వచ్చాడు. 'ఆ విజయరా మారావు మొండివాడురా! కోడల్ని పంపడు. నువ్వు మళ్ళీ పెళ్ళి చేసుకో. నువ్వు సుఖంగా సంసారం చేసుకుంటూ, ఇంటిపట్టున ఉంటే నేను హాయిగా ప్రాణాలు విడుస్తాను' అన్నాడు.



"అన్నయ్య నవ్వాడు. 'ఈ భారతదేశంలో భర్త విడిచిపెట్టిన భార్యకు పునర్వివాహం నిషిద్ధం. ఆ హక్కు- కనీసం మన కులంలో లేదు. నా భార్య పునర్వివాహం చేసుకోలేదు. నేనూ చేసుకోను. ఏమో ఎవరు చెప్పగలరు- ఆమె నా దగ్గరకు వస్తుందేమో' అన్నాడు. నాన్న పోయాక విజయరామారావు గారికి అన్నయ్య ఉత్తరం రాశాడు. ఆయన మిమ్మల్ని పంపనని నిర్ద్వందంగా రాశాడు. అన్నయ్య మళ్ళా ఉద్యమంలోకి వెళ్ళిపోయాడు.

"తిరిగి వచ్చాక ఎక్కువ రోజులు బతకలేదు. మరో పది రోజుల్లో పోతాడనగా అన్నయ్యను అడిగాను. నీ మనసులో ఏమయినా కోరిక ఉంటే చెప్పు, తీరుస్తాం అని.

"అన్నయ్య మా వంక చూసి నవ్వాడు. 'కోరికలా? ఏం లేవు. కానీ, ఒక్కటి మాత్రం నన్ను బాధిస్తోంది. మీ వదిన మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు. అప్పుడెప్పుడో మా బావమరిది హరినాయణరావును హైదరాబాదులో కలుసుకున్నాను. తన అక్కను గాలికి వదిలేసినందుకు అతను నాతో విరసంగా మాట్లాడాడు. నిజానికి అతని



తప్పేంలేదు. నా పిచ్చిలో నేను ఎవరి సంగతి పట్టించుకోలేదు. ఇటు నాన్న, అమ్మల విషయమూ పట్టించుకోలేదు. నా కల పగటికల అయిపోయింది. చాలా భ్రమలు తొలగిపోయాయి..." ఆయాసంతో ఆయన మాట్లాడలేకపోయాడు.

ఆయాసం తగ్గాక మళ్ళీ చెప్పాడు. "నాన్న నాకు ఆస్తి ఇచ్చాడంటున్నారు. అది నేనేం చేసుకోను. మీకిష్టమైతే ఒక్క ఏర్పాటు చెయ్యాలనుకుంటున్నాను..." అని ఆయన ఆగాడు, సందేహిస్తూ.

"ఏమింటో చెప్పు" అని అడిగాం నేనూ, మా తమ్ముడూ.

"మన జిల్లాలో సుక్షేత్రమైన మాగాణి భూమి కనీసం ఎకరం మూడు లక్షలయినా పలుకుతుంది. అంటే ఏడు ఎకరాలకీ కనీసం ఇరవై ఒక్క లక్షలయినా వస్తుంది. అందులో ఒకవాటా మీకూ, మరోవాటా నా భార్యకూ ఇవ్వాలని ఉంది. ఆమె తండ్రి పోయాక తమ్ముడి నిరాదరణకు గురవుతుందో ఏమో నాకు తెలియదు. అభిమానం గల మనిషని నేను విన్నాను. ఎప్పుడో పదేళ్ళ పిల్లగా నాచేత తలంబ్రాలు పోయించుకున్న ఆమే నాకు గుర్తు. ఇప్పుడెలా ఉంటుందో కూడా నాకు తెలియదు. నాకంటే ఆరేళ్ళు చిన్నది. అంటే డెబ్బై ఏళ్ళు వచ్చివుంటాయి. కనీసం ఈ అవసాన సమయంలో ఆమెకు ఆర్థికంగానయినా సాయం చెయ్యాలనుకుంటున్నాను. ఆమె స్వీకరిస్తుందో లేదో నాకు తెలియదు. కనుక నేను కోరేదేమిటంటే నాదని మీరంటున్న పొలం మీరే ఉంచేసుకోండి. ఆ ప్రకారం పట్టాలు రాయించండి. సంతకం పెడ్తాను. మీ వదినకు, నాకు గుర్తులేని నా భార్యకు- ఓ పదిలక్షలు పంపండి. వృద్ధాప్యంలో ఎవరినీ దేబిరించకుండానయినా బతకగలదు. ఆమె స్వీకరిస్తే నేను ధన్యుడనవుతాను. నాకు ఏ నమ్మకాలూ లేవు. స్వర్గం నరకం లేవు. కనీస న్యాయం నా భార్యకు జరిగిందని నేను సంతోషిస్తాను. మీకు నా ఏర్పాటు అంగీకారమైతే, డబ్బు పంపుతూ, నన్ను క్షమించమని ఆమెకు ఉత్తరం రాయండి. అంతకంటే నాకే కోరికలూ లేవు" అన్నారాయన.

"నీకు వదినను చూడాలని ఉందా?" అని అడిగాను.

"ఆయన నవ్వాడు. ఇప్పుడు మరణశయ్య మీద నాకు దుర్లభమైన కోరిక కోరటం తగదు. ఏ ముఖం పెట్టుకుని మీరు ఆమెని రమ్మనగలరు? ఏ ముఖం పెట్టుకుని నేను కోరగలను. అది జరిగే పని కాదు. వదిలెయ్యండి" అన్నాడు.

"ఆయన అన్ని మాటలెప్పుడూ మాట్లాడలేదు. ఆయన కోరిక ప్రకారం పత్రాలు రాయించాం. రిజిష్టరు చేయించాం. రెండు రోజుల్లో పోతాడనగా ఆయనకు మాట పడిపోయింది. మన లోకంలో లేడు. క్రితం నెల పదో తారీకున చనిపోయాడు. ఆయన సిద్ధాంతాలకు కర్మకాండ విరుద్ధం. కానీ, మా నమ్మకాల ప్రకారం యథావిధిగా కర్మకాండ నిర్వర్తించాం. డబ్బు ఏర్పాటు చేసుకోవటానికి ఇన్నిరోజులు పట్టింది. ఆయన పంపమన్న పది లక్షలు డిమాండు డ్రాఫ్టు ద్వారా పంపిస్తున్నాం. మీరు స్వీకరిస్తే ఆయన ఆత్మకు శాంతి కలుగుతుందని మా భావన. ఆయనకు ఆత్మల్లో నమ్మకాలు లేవు. అది వేరే విషయం. మీరు అభిమానపడి తిరస్కరిస్తే మేమేం చెయ్యలేం" ఆ పేజీ తిప్పిన అనసూయమ్మకు అక్కడ పిన్ చేయబడిన పది లక్షల డిమాండ్ డ్రాఫ్టు కన్పించింది.

ఆ ఉత్తరం చదివిన అనసూయమ్మ హృదయం కకావికలమైపోయింది. తన భర్తను గురించిన విషయాలు తెలుసుకో

వాలని జీవితకాలమంతా పరితపించిపో యింది. అతడు మళ్ళీ పెళ్ళి చేసుకొని ఉంటాడని భావించింది. తనలాగానే ఇంత నిష్ఠుర జీవితం గడిపాడని తెలుసుకున్న ఆమె మనస్సు విహ్వాలమైపోయింది. తన కెంత పెద్ద శిక్ష విధించాడో ఆయన అంత శిక్షనూ స్వయంగా విధించుకున్నాడు. తను శీలవంతుడుగా బతికాడు, తనకూ శీల పరీక్ష పెట్టాడు. ఆయన నిజంగానే తన భర్త! ఆ మాటనుకోగానే ఆమెకు గర్వం కలిగింది. తన భర్త పంపిన డబ్బు తను స్వీకరిస్తుంది. భర్త డబ్బు భార్య స్వంతం. అందులో అభిమానానికి తావు లేదు. మెల్లగా ఆమె మనసులోని కల్లోలం శమించి ప్రశాంతమయింది.

మర్నాడు ఆమె డ్రాఫ్టును బ్యాంకులో జమచేసింది. వెంటనే శౌరయ్యని పిలిచి అతనికివ్వాల్సిన నలభైవేలూ అతనికిచ్చే సింది.

ఆ వెంటనే మరో మూడు పనులు చేసింది. రంగాచారిని పిల్చి ఆలయ పున రుద్ధరణ చేపట్టమని, అందుకెంత ఖర్చవు తుందో ఎస్టిమేట్ వేయించమనీ, పని వెంటనే ప్రారంభం కావాలనీ చెప్పింది. "ఆ చూడండి, రంగాచారి గారూ! ఆలయం దరిదాపుల్లో ఓ రెండొందల గజాల స్థలం నాకు కొనిపెట్టండి. ఓ రెండు గదుల పెట్టు ఇల్లు కూడా కట్టించండి. సమీపంలో ఉంటే స్వామిని సేవించుకోవటానికి సులు వుగా ఉంటుంది. నాకూ వయసు మీరిపో తోంది కదా!" అని నవ్వింది.

రామలింగనాయుడికి క్లుప్తంగా ఉత్తరం రాసింది కృతజ్ఞతలు చెప్తూ, "నా భర్త పంపిన డబ్బును నేను స్వీకరిస్తున్నాను. భర్త ఇచ్చింది స్వీకరించటానికి అభిమాన పడటమెందుకు? మీ భార్యాపిల్లలతో మీరంతా సుఖంగా ఉండాలని ఆశీర్వదిస్తు న్నాను" అని రాసింది.

మరో ఉత్తరం తమ్ముడు హరినారాయ ణరావుకు రాసింది.

"తమ్ముడూ! ఇంతకాలం నన్ను భరిం చావు. నెలనెలా డబ్బు పంపిస్తున్నావు. అందుకు కృతజ్ఞతలు. మీ బావగారు నేను శేషజీవితం గడపటానికి సరిపోయే డబ్బు పంపారు. ఆయన క్రితం నెల పదో తారీ కున చనిపోయారట! ఇంక నువ్వు డబ్బు పంపవద్దు. రెండు మూడు నెలల్లో నేను నీ ఇంటిని ఖాళీ చేస్తున్నాను. వేణుగోపా లస్వామి సాన్నిధ్యంలోనే ఓ కుటీరం వేయించుకుంటున్నాను. నీకూ నా మీద అమితమైన ప్రేమ, గౌరవం ఉన్నాయి. అందుకు నా ప్రయత్నాన్ని అడ్డుకునే ప్రయత్నం చేయకు. శేషజీవితాన్ని స్వామి సేవలో గడపాలని అనుకుంటున్నాను. అందుకు సహకరించు. నీ భార్యకు నా కృతజ్ఞతలు అందజేయి. పిల్లల్ని అడిగానని చెప్పు. నీ మనసులో ఏ అపరాధ భావన ఉన్నా అది నాకు బాధ కలిగిస్తుంది. నేని ప్పుడు కాపురానికి వెళ్తున్నాను. నా భర్త డబ్బుతో కట్టించుకున్న కుటీరంలోకి, నీ అక్క సుఖసంతోషాలే నీకు కావల్సిందని నాకు తెల్సు. దీవెనలతో- అక్క"




**అ**క్క ఉత్తరం చేరాక హరినారాయణరా వును అపరాధభావం ముంచెత్తింది.

విమల అంది. "ఇంకేం, వదిలిపెట్టిన మొగుడు చచ్చి డబ్బు పంపాడు. ఇంత

దాకా మనం చేసినదంతా కొరగానిదై పోయింది. ఇన్నాళ్ళూ ఇంట్లో ఉండి అవసరం తీరాక వెళ్ళిపోతూ నిష్ఠూరం వేసింది మనమీద. బుద్ధి పోనిచ్చుకున్నది కాదు."

హరినారాయణారావు సహనం కోల్పోయి పెద్దగా అరిచాడు. "నోర్ముయ్! ఆమె బుద్ధి నీకంటే, నాకంటే గొప్పది. మా ఇంటి అడపడుచు. మొగుడు వదిలేశాడు కనుక పుట్టింట్లో వుంది. నువ్వూ, నేనూ ఆమెకు పెట్టింది లేదు. నిరాడంబరంగా, నిష్ఠురంగా గడిపింది జీవితం. ప్రాణం కాపాడుకోవటం కోసం తిన్నది గానీ, ఒళ్ళు పెంచుకోటానికి కాదు. అదీ మా నాయన సొమ్మే. నేను మా నాయన దొరతనం ఉపయోగించుకుని ఎమ్మెల్లేనయ్యాను. నడిచినంత కాలం నడిచింది. అది అయిపోగానే ఎన్నికల్లో ఓడిపోయాను. ఆమె ప్రజాహితం కోసం ఆలోచించింది. తన స్వంతానికి ఏమీ కోరుకోలేదు. ఆమెలోని నాయకత్వ లక్షణం గొప్పది. అనుకున్నవన్నీ సాధించింది. నిజానికి ఆమె నాకు పోటీగా ఎన్నికల్లో నిలబడి వుంటే నేనెప్పుడో ప్రజాజీవితం నుండి తప్పుకోవాల్సి వచ్చేది. ఆమెకు పదవులక్కర్లేదు. పరమ సాధ్వి మా అక్క! ఆమె పేరు తలవటానికి కూడా నీకు అర్హత లేదు. నాకు చేతనయ్యీ, నీ మాటలు విని ఆమె కోరిక తీర్చలేకపోయాను. ఆమె నగలు కూడా వాడుకున్నాం. నాకు సిగ్గుగా ఉంది. వెలమ దొరలాగా నేను ప్రవర్తించలేదు. పాపిష్టివాడిని!"

ఆ తర్వాత ఒక్కటే ముక్క "నన్ను క్షమించ"మని ఉత్తరం రాశాడు. ఇప్పుడప్పుడే ఆమెకు తన మొహం చూపించలేదు. కాలం వస్తే గంధసిరికి వెళ్తాడు. ఆమె కోరిక మేరకు డబ్బు పంపటం మానుకున్నాడు.

అనుకున్న సమయానికంటే రెండు నెలలు ఆలస్యమైంది. ఆలయ పునరుద్ధరణ, తన ఇంటి నిర్మాణం. ఇల్లు పూర్తవ్వగానే ఆమె పోయిన భర్త ఇంట్లోకి అడుగు పెట్టింది. అతను మొత్తం సమాజానికి తను అనుకున్న పద్ధతిలో స్వాతంత్ర్యమివ్వ ప్రయత్నించి విఫలమయ్యాడు. కానీ, ఆమెకు స్వాతంత్ర్యాన్ని సిద్ధింపచేశాడు. ఆలయ పునరుద్ధరణకు లక్షన్నర ఖర్చయింది. హైస్కూలు పక్కా బిల్డింగ్ నిర్మాణానికి రెండు లక్షలు విరాళంగా ఇచ్చింది. గవర్నమెంటు రెడ్‌టేపు కదిలి భవన నిర్మాణం జరగటానికి రెండేళ్ళు పట్టింది.

రంగాచారి చనిపోయాడు. ఆ స్థానంలో ఓ యువకుడిని పూజారిగా నియమించింది. అతనికి జీతభత్యాలిచ్చింది. ఖర్చులన్నీ పోగా ఇంకా ఆమె వద్ద ఆరు లక్షలున్నాయి. ఆ డబ్బు మీద వచ్చే వడ్డీతో ఆమె బతికింది. పూజారిని బతికించింది. ఇప్పుడామె తన దృష్టినంతా వేణుగోపాల స్వామి మీదే నిలిపింది. ఎక్కువ కాలం ఆలయంలోనే గడిపేది.

శౌరయ్యకు పక్షవాతం వచ్చింది. మంచం మీద నుండి లేవలేని పరిస్థితి. ఇప్పుడు నారాయణదే రాజ్యం. పని చెయ్యటం అతని శరీరానికి పడదు. తండ్రి సంపాదించిన డబ్బు విచ్చలవిడిగా ఖర్చు చేసేవాడు. తిండి, తాగుడు, వేశ్యాసంగమం. అతని వ్యాసంగానికి గంధసిరి పరిధి సరిపోదు. వెంకటాపురంలోనే ఎక్కువ కాలం గడిపేవాడు.

ఇంట్లో పేరుకు భార్య రేణుక. ఆమె స్థాయి పనిమనిషికి పడిపోయింది. తను చెప్పిన మాట కాదంటే ఆమెకు దేహశుద్ధి చేసేవాడు. "తప్పుడు ముం...! నోర్మూసుకుని ఇంట్లో పడి ఉండు. అసలా పిల్ల నాకు పుట్టిందో, ఏనా కొడుక్కు కన్నావో!" అనేవాడు. దేవదానం అనుమానం నిజమే అయింది. ఆమె పెళ్ళి కాకముందే గర్భ

## పువ్వుకాదు.. కత్తులబోను

కీటకాలను ఆరగించే మొక్కల గురించి వినే ఉంటారు. ఇక్కడున్న మొక్క వీనస్ ఫ్లై ట్రాప్ కూడా అలాంటిదే! తూనీగవచ్చి దానిమీద వాలినప్పుడు దాని పూరెక్కలు మూసుకుపోతాయి. ఇక ఆ కీటకం అంతే సంగతులు! మనుగడకు అవసరమైన పోషక పదార్థాల కోసం ప్రకృతి ఈ మొక్కకు ప్రసాదించిన గొప్ప ఏర్పాటు ఇదే.



## కొత్తగాలి...

ఆమె హంసగమన
ఆమె నాట్యమయూరి
ఆమెది కోకిల కంఠం
ఆమెవి లేడికన్నులు
అయ్యో! చెప్పుకోదగిన
మానవలక్షణం ఒక్కటీ లేదా!

—భమిడిపాటి సోమయాజి, హైదరాబాద్

వతి అయింది. పెళ్ళయిన ఎనిమిది నెలలకే ఆడపిల్ల పుట్టింది.

"ఛీ, మాట్లాడకు. నీతో మాట్లాడతా ఉంటే నాకు కంపరం కలుగుతాది" అంది ఆమె.

అంతే, మరో మాట లేకుండా రేణుకను చావగొట్టాడు. మూలుగుతున్న ఆమెను చూసి, "నీ సంగతి నాకు తెలవదా? నేను అడగ్గానే నా పక్కన తొంగున్నదానివి, ఇంకెంతమందితో పడుకున్నావో! మంచోణ్ణి కనుక నిన్ను ఏలుకుంటున్నాను" అన్నాడు.

బయట చావడిలో పడుకున్న శౌరయ్య, "ఆ పిల్లను కొట్టి చంపకురా" అని అరిచాడు.

ఒక్క గెంతులో బయటపడి, "ముసలోడా. నోర్మూసుకు పడుండు. నోరు కూడా పడ్తే బాగుండేది. నీ వల్లే దానికి నోరు పెరిగిపోతా ఉంది. మొన్న అనసూయమ్మను చూడాలంటే దాన్నెందుకు పంపించేవు. ఆ మడిసి దాన్ని సగం చెడగొట్టినాది. ఆ వంక చెప్పి అది ఏనా కొడుకుతో తిరిగి వచ్చిందో. నా పెళ్ళానికి కాపలా కాయరా, ముసలాడా అంటే నువ్వు చేస్తున్నదేంది! నీకు పెట్టే తిండి కూడా దండుగే" అన్నాడు.

"ఆయమ్మనేమీ అనకు, పాపమొస్తాది" అన్నాడు, లేచి కూర్చునే ప్రయత్నం చేస్తూ.

"ఆళ్ళ దొరతనంతోనే మన బతుకు మాదిగపల్లెలో మగ్గింది. ఆ మడిసి సంగతి నా దగ్గర ఎత్తవాకు. ఎప్పుడు ఛస్తాదోగానీ, పీడాబోద్ది" అని జేబులోంచి సిగరెట్టు తీసి, ముట్టించి జల్సా చెయ్యటానికి వెంకటాపురం వెళ్ళిపోయాడు.

అతడికి భార్యమీద అనుమానం. ఆమె ఎక్కడకు వెళ్ళటానికి వీలులేదు. పుట్టింటికీ వెళ్ళటానికి వీలులేదు. అలాంటిది అనసూయమ్మ ఇంటికి వెళ్తే సహించగలిగే మన స్థితి అతడికి లేదు. అగ్రవర్ణాల దాష్టీకం వల్లే తమ కులం అణగారి పోయిందన్న అతని మిడిమిడి జ్ఞానపు ఆలోచనలో సత్యం లేకపోలేదు.

ఇలాంటి సమయంలో శంకరయ్య జైలు శిక్షాకాలం పూర్తి చేసుకుని ఇంటికి వచ్చాడు. సత్ప్రవర్తనకు అతనికి శిక్షాకాలంలో కొంత రెమిషన్ ఇచ్చారు. అన్న రావటం తమ్ముడికి పడలేదు. ఈ రెండేళ్ళ కాలంలో అంతా తన ఇష్టారాజ్యంగా నడిచింది. తన రాజ్యంలో మరో హక్కుదారుడిని ఏ రాజ్యాధినేతా సహించడు.

"ఆడు హంతకుడు. నా ఇంట్లో ఉండటానికి వీలు లేదు" అని పేచీ పెట్టాడు నారాయణ, అన్న ఇంటికి రాగానే.

"అదేందిరా, ఆడు నా పెద్దకొడుకు. ఆడెక్కడికి పోతాడు. ఆడికీ ఈడ ఉండే హక్కుండాది" అన్నాడు శౌరయ్య.

శంకరయ్య స్వభావరీత్యా ఉన్నత భావాలున్నవాడు. బాగా చదువుకుని ఐఏఎస్ పరీక్షకు కూడా కూర్చుందామనుకున్న వ్యక్తి. విధి బలీయమైంది. తను ఆశించకుండానే సంజన వ్యామోహంలో పడిపోయాడు. అది అతని కొంప ముంచింది, జైలు పాలు చేసింది. జెయిలు ఓ పెద్ద పాఠశాల అయింది అతనికి. తను చేసిన పని ఎంత హైన్యమయినదో చేసిన మరుక్షణంలోనే అతనికి అర్థమైంది. పశ్చాత్తాపం వల్ల ప్రయోజనం లేదు. చట్టం కర్కశమైంది. మనిషి స్వభావంతో దానికి

పనిలేదు. అతని బాహ్యాచర్యే దాని పరిగ ణలోకి వస్తుంది. ఫలితంగా అతను పదే ళ్లకాలం జెయిలు జీవితం గడిపాడు. ముప్ఫయిమూడేళ్ల వయసులో ఇంటికి తిరిగి వచ్చాడు. అతనికి ఇంటికి రావటా నికి గూడా మనస్కరించలేదు. కానీ బాధ్య తలున్నాయి. తల్లిపోయినా, మూలపడ్డ ముసలి తండ్రి ఉన్నాడు. అక్రమ సంబం ధంలో పుట్టిన కూతురు ఉంది. ఈ బాధ్య తలను నిర్వర్తించటానికి అతను ఇంటికి తిరిగి వచ్చాడు.

అన్నపట్ల నారాయణ వ్యతిరేకత చూసిన శౌరయ్యా కులపంచాయితీ పెట్టాడు. ఇల్లు రెండు భాగాలుగా పంచారు పెద్దలు. అల్లుళ్ళు తమకూ ఆస్తిలో భాగం రావాలని పేచీ పెట్టారు. శౌరయ్యా అల్లుళ్ళను తిట్టాడు. శౌరయ్యా ఆస్తి పంపకానికి అంగీకరించారు.

అలా చాలాసేపు చర్చలు, తిట్లు, శాపనా ర్థాలు అయ్యాక ముగ్గురు కూతుళ్ళకూ తలా రెండున్నర ఎకరాలు, ఓ అర ఎకరం శంకరయ్యా కూతురు సంగీతకు, మిగిలిన పది ఎకరాలూ కొడుకులు ఇద్దరికీ చెరి సగం అని నిర్ధారించారు కులపెద్దలు.

నారాయణ పేచీ పెట్టాడు. "ఆ హంత కుడి కూతురికి ఆస్తి పంచినోళ్ళు నా కూతు రికీ ఇవ్వాల్సిందే"

"ఓరి, మూసుకోరా నోరు! ఖమ్మంలో స్థలం అమ్మించి నువ్వు వాడుకోలేదంటోరే. అది మేం లెక్క గడితే, నీ కసలు ఆస్తి రాదు."

తరువాత శౌరయ్యా ఎవరి దగ్గర ఉండా లన్న ప్రశ్న వచ్చింది. ఆస్తి తమకు సరిస మానంగా రాలేదు కనుక తండ్రి బాధ్యత తమకు లేదన్నారు కూతుళ్ళు. కొడుకులే తల్లిదండ్రులను చూసుకోవాలి. అది రివాజు. కనుక వాళ్ళను ఎవరూ తండ్రిని ఉంచుకోమని బలవంతపెట్టలేదు. నారా యణ తండ్రిని తన దగ్గర ఉంచుకోన న్నాడు.

"మా నాయన విషయంలో ఇంత వివాదం పడాల్సిన అవసరం లేదు. నాయన నాతోనే ఉంటాడు. ముసలిత నంలో తండ్రిని చూసుకోవటం పెద్ద కొడుకు బాధ్యత" అన్నాడు శంకరయ్యా.

"ఎట్ల చూస్తవురా? నీకయితే పెండ్లాము లేదు. పైగా ఓ కూతురు. ముసలాడినీ, పిల్లనూ సాకటం నీ వల్ల అవుతదిరా? " అన్నాడు సుంకరి.

"ఆడికి నా కూతుర్నిస్తాను మా అయ్యా, ఆడూ ఒప్పుకుంటే" అంది దేవమ్మ.

"ఆ గుడిసేటిదాన్నా! అది రామిరెడ్డి కొడుకు సాంబిరెడ్డికి మరిగింది. అది మా ఇంటి కోడలిగా రావటానికి వీల్లేదు" అన్నాడు నారాయణ.

ఆ మాట అనంగానే దేవమ్మ మొగుడు పోలిగాడు నారాయణ గొంతు పట్టుకు పిసికాడు. "చంపుతా, కొడకా! నా పిల్లమీదే అబాండాలు ఏస్తవు! నీ బుద్ధే ఇంత!" అన్నాడు.

పెద్దలు కలగజేసుకుని విడిపించారు.

"నామాట అబద్ధమేమో దాన్ని పిల్చి అడగండి. మన కుల కట్టుబాటు ప్రకారం అది ఎర్రగా కాల్చిన ఇనప కడ్డీలు పట్టు కుని దాని శీలం రుజువు చేసుకోవాలి. అప్పుడు నేను అంగీకరిస్తాను. అది మా ఇంట్లో అడుగు పెట్టటానికి" అన్నాడు ధైర్యంగా నారాయణ.

ఇప్పుడతనికి సాంబిరెడ్డి భయం లేదు. అతడికి బంగారి అంటే విసుగేసింది. పెళ్ళి చేసుకున్నాడు. కొత్త చిరుతిళ్ళు మొదలె ట్టాడు. ఇప్పుడామె సాంబిరెడ్డికి చెప్పి తనను కొట్టించే అవకాశం లేదు. తనను ధిక్కరించిన బంగారికి శిక్ష విధించాలని అతని మనసు ఉడికిపోయింది.

"ఏమో ఆడి మాటల్లో ఏం నిజముందో.

ఆ పరీచ్ఛ జరిపిస్తే పోతాది" అన్నాడు సమ్మయ్య.

అలాంటి పరీక్షలంటే అందరికీ సంబరమే. పిల్ల పవిత్రమైనదైతే కాల్చిన కొరువులు ఆమెనేం చేయవు. చేతులు కాలవు. శీలం పోగొట్టుకున్న ఆడపిల్ల చేతులు కాల్తాయి అన్నది ఆ కులంలోని మూఢ నమ్మకం, ఎప్పటినుండో వస్తున్న ఆచారం. మరొకరి బాధలో ఆనందం పంచుకునే మూర్ఖపు జనం ఉన్నంతవరకూ అలాంటి మూఢాచారాలు కొనసాగిపోతూనే ఉంటాయి, నిరాటంకంగా.

"ఏదీ, పిలవండి, దాన్ని!" అన్నాడు ఉత్సాహంగా నారాయణ దోస్తు రంగడు.

బంగారి అక్కడే ఉంది. భయంతో బిక్కచచ్చిపోయింది.

అప్పుడు అన్నాడు శంకరయ్య. "ఏ పరీక్షలూ ఆమెకు పెట్టవల్సిన అవసరం లేదు. ఆమెకు ఇష్టమైతే నేను ఆమెను భార్యగా స్వీకరిస్తాను."

బంగారి దీనంగా కృతజ్ఞతలు చెప్పుకుంటున్నట్లు శంకరయ్య వంక చూసింది. చేసుకోబోయే భర్తే శీలపరీక్ష అవసరం లేదనటంతో పెద్దలు ఎవరూ అందుకు పట్టుపట్టలేదు.

నిర్ణయమయ్యాక శంకరయ్య, బంగారిల పెళ్ళి వారం రోజుల్లో జరిగిపోయింది. శౌరయ్య లౌక్యుడు, మాటలు నీటి మూటలని అతనికి తెల్సు. వెంటనే వెంకటాపురంలో ఉండే నోటరీ, కనకారావును పిలిపించి, ఆస్తికి సంబంధించిన పత్రాలు రాయించాడు.

పంపకాలయిన రెండేళ్ళలో శౌరయ్య మరణించాడు. శంకరయ్య తన వాటాగా వచ్చిన పొలంలో వ్యవసాయం మొదలు పెట్టాడు. జీవితంలో ఎప్పుడూ నాగలి పట్టిన వాడుకాదు. కానీ ఏ పనీ నేర్చుకోక రాదని అతనికి తెల్సు. చదువుకున్నవాడు కనుక త్వరలోనే వ్యవసాయంలో సులువు మెలవులు తెల్సుకోగలిగాడు. నారాయణ జల్సాగా తిరగటం మరిగినవాడు. అందుకే తన పొలం కూడా చెయ్యమని కౌలుకిచ్చాడు అన్నకు.

తండ్రి భావించినట్టు ఖమ్మంలో స్థలం అమ్మిన డబ్బునంతా అతడు ఖర్చు పెట్టలేదు. వెంకటాపురం బ్యాంకులో సగానికి పైగా దాచుకున్నాడు. అన్న వచ్చాక వాటాలంటారని అతనికి తెల్సు. పంపకాల విషయంలో తన మాట చెల్లకపోవటం గమనించాక, మాదిగవాడలోని జనాలను మచ్చిక చేసుకోవటం ప్రారంభించారు. తండ్రి మూలపడ్డాక, గ్రామ సర్పంచిగా తను నిలబడ్డాడు. డబ్బు పారించాడు. తాగించాడు, తినిపించాడు. ఫలితంగా సర్పంచి అయ్యాడు. చంద్రుడు కూడా ఎన్నికలలో నిలబడ్డాడు కానీ, నారాయణ పోటీకి తట్టుకోలేకపోయాడు. కులపెద్దల్లో ఒకడుగా చెలామణి కాసాగాడు నారాయణ.

శౌరయ్య పోయాక, మొదటి సంక్రాంతి వచ్చింది. వ్యవసాయ ఆధారిత గ్రామాల్లో పంట ఇంటికి చేరి, మళ్ళా వ్యవసాయపు పనులు చేపట్టే వరకూ ఉన్న తీరిక సమయాల్లో ఆయా కులాలకు చెందిన ఆశ్రిత కులాలవారు లేక సంచార గాయకులు గ్రామ ప్రజలని తమ ఆట పాటలతో అలరించేవారు. చిందోళ్ళు- చిందు భాగవతులు. ఆ గ్రామానికి వంతుల ప్రకారం విచ్చేసి 'మిరాసీ' హక్కుల ప్రకారం 'త్యాగం' పేరిట కొంత నగదు, ధాన్యం అడుక్కుంటారు. చిందు భాగవతుల కుటుంబాలు తమ ప్రాంతాలలో ఉన్న గ్రామాలను పంచుకుంటారు. వంతుల వారీగా ఒక్కో కుటుంబం ఏడాదికొక్కసారి తమవంతుకు వచ్చిన గ్రామాన్ని సందర్శించి, ఆట పాటలతో వారిని అలరించి,

వచ్చిన 'త్యాగం'లో సగభాగం తాము స్వీక రించి, మిగిలిన సగభాగం తమకు ఆట పాటల ప్రదర్శనలో సహకరించిన కుటుం బాలకు పంచుతారు.

ఆ క్రమంలో ఆ యేడు గంధసిరి మాది గవాడ అలరించే వంతు సంతయ్యకు వచ్చింది. అతను సంక్రాంతికి ముందే గంధసిరి వచ్చాడు. మాదిగ కుల పెద్ద లను కలిశాడు. 'మిరాసీ' హక్కుల ప్రకారం ఆ యేడు తను ఆడతానని చెప్తాడు.

"ఎన్ని ఆడుతావురా? " అనడిగాడు నారాయణ.

"జాంబపురాణ మెట్లనో ఉంటాది. ఆపైన తవరేది ఆడమంటే అది ఆడ్తాం" చెప్పాడు సంతయ్య.

"భారత, భాగవత కతలేమీ ఆడరా? " అడిగాడు సమ్మయ్య.

"అట్లనే ఆట్నీ ఆడతాం" అయితే, కుటుం బానికి బస్తా ధాన్యం ఇవ్వమని అడిగాడు సంతయ్య 'త్యాగం' కింద. అందుకు పెద్దలు అంగీకరించలేదు.

"నీకూ మాకూ కుదర్దులే. ఇయ్యేటికి మీ చిందోళ్ళ బాగోతం మాకొద్దు" అన్నాడు సత్తెయ్య.

అలా కులపెద్దలు తిరస్కరించారని సంతయ్య నిరాశ పడలేదు. అది మామూలే. తాము పెద్దింటోళ్ళమని భ్రమించే ఈ మనుషులను ఎలా లొంగదీ సుకోవాలో అతనికి తెల్సు. పెద్దలకు ఎవరి పనులు వాళ్ళకున్నాయి. సంతయ్యకు కబు ర్లాడుతూ కూర్చుంటే కుదర్దు. సంతపాడు రామిరెడ్డి పెద్ద మీటింగు పెట్టాడు. అందుకు జనాన్ని తరలించాలి. ఏర్పాట్లు చూసుకోవాలి. ఆ పనిమీద సత్తెయ్య వెళ్ళి పోయాడు. సమ్మయ్యకు కూతుళ్ళు, అల్లుళ్ళు పండగకు ఇంటికొస్తారు. వాళ్ళకు బట్టలు కొనాలి. అందుకు వెంకటాపురం వెళ్ళాలి. గంధసిరి షాపుల్లో ధరలు మండి పోతాయి. ఆపని మీద అతడు వెళ్ళాడు. పనిలేని సర్పంచి నారాయణ మిగిలాడు. అతనికి సంతయ్యనుంచి తెల్సుకోవలసిన విషయాలు చాలా ఉన్నాయి. అందుకే ఆగిపోయాడు.

"రా, దొరా! ఓ చుక్కేసుకుంటూ మాట్లా డుకుందాం" అన్నాడు సంతయ్య. సర్పం చిని సంతోషపెట్టి తన అభీష్టం నెరవేర్చు కోవాలని సంతయ్య ఉద్దేశమని నారాయణ గ్రహించాడు. ఇద్దరూ కల్లుపాక చేరారు. బాటిళ్ళు పుచ్చుకుని, పకోడీలు తింటూ ఇద్దరూ మాట్లాడుకోసాగారు.

"ఈసారి ఎల్లమ్మ కతలో ఏషం ఎవరు కడ్తారు? నీ పెద్ద కూతురు చచ్చిపోయినా దట కదా!" అడిగాడు నారాయణ.

"ఔ దొరా! మాయదారి రోగం. డాక్టర్లకు చూపించినా భూత వైద్యం చేయించినా. ఏదీ పనిచెయ్యలేదు. చచ్చి ఊరుకున్నది" చెప్పాడు సంతయ్య.

"అది మంచి పసందయిన పిల్లరా! నేన దంటే చచ్చిపోయేవాడిని అనుకో. మంచి పుటుక! దాన్ని ఆడిపాపను చేసి మంచిపని చేసినావు"?

"ఏం లాబం! దానికి భూమ్మీద నూక లేవు. చెల్లిపోయినాది"

సంతయ్య తన పెద్ద కూతుర్ని ఆడేపాప లేక జోగితగా తయారుచేశాడు. చిందుభా గవతుల వృత్తిలో జోగిత నిర్వహించే పాత్ర పెద్దది. ఆమె వల్లే చాలా భాగం తమ జీవితం గడిచిపోతుంది. జోగితను చేసే అమ్మాయిని ముందుగా కత్తికిచ్చి వివాహం చేస్తారు. ఈ తర్వాత ఆమె ఎవ రితోనయిగా సంభోగంలో పాల్గొనవచ్చు. ఆమె పవిత్రతకేం లోపం ఉండదు. ఇలా ఊరూ వాడా తిరిగి ప్రదర్శనలిచ్చేటప్పుడు, ప్రదర్శనలయ్యాక కోరుకున్న వాడితో ఆమె సంభోగిస్తుంది. ప్రదర్శన జరుగుతున్నన్ని నాళ్ళు ఆమెకా స్వేచ్ఛాసంభోగం తప్పదు.

"ఈసారి ఎల్లమ్మ వేషం ఎవరిచేత వేయిస్తున్నావు? " అడిగాడు నారాయణ.

ఎల్లమ్మ వేషం అందరూ వేసేది కాదు. జోగిత మాత్రమే వెయ్యాలి. తన బృందంలో ఆడిపాప లేకపోతే గడవదు. అందుకే అతను తన రెండో కూతురు మంగమ్మను కూడా జోగితను చేశాడు. ఆ పిల్లకు పద్నాలుగేళ్ళుంటాయి. జోగిత చెయ్యటమంటే పట్టుబట్టలు కట్టుకోవటం, పూలు బుక్కా పెట్టుకోవటమనుకున్నది ఆ పసిది. ప్రదర్శనలిచ్చే కుటుంబం కనుక, ఆమెకు ప్రదర్శల్లోని పాత్రలన్నింటిలో పాల్గొనే నేర్పుంది. సంభాషణలు జమా యించి చెప్పగలదు. కీచు గొంతులో పాటలు పాడగలదు.

"ఇంకెవరు మా చిన్నది మంగమ్మను జోగిత చేసిన. ఈ ఊర్లో అదే ఎల్లమ్మ వేషం కడ్తది" అన్నాడు సంతయ్య.

"క్రితంసారి నువ్వు బాగోతానికొచ్చిన ప్పుడు చూసినా. పదేళ్ళుంటాయేమో. కను నదరుగానే ఉంది. నేనప్పుడే అనుకు న్నాను. దాన్ని ఆడేపాపని చేసినావంటే బాగుపడిపోతావని"

"తంవరి దయ ఉండాలేగానీ, అదెట్ట ఏషం కడ్తదో నువ్వే చూస్తవు. పోరి సిన్న దేగానీ, పెద్దోళ్ళు కూడా దానికి సాటిరారు. నువ్వే దానికి కన్నెరికం చేయాల."

"నువ్వు దాన్ని జోగిత చేశానని చెప్పిన ప్పుడే నేనది నిర్ణయించుకున్నాను"

"మరి నా సంగతేంది. మీ వోళ్ళకి చెప్పి నాకు బస్తా ధాన్యమిప్పించు"

"నాకొదిలెయ్! నీకు లాభం గలిగేట్టు చూస్త"

సంక్రాంతి వారం రోజులుందనగా సంతయ్య నాలుగు కుటుంబాలతో వచ్చాడు. మాదిగపల్లె జనం సాయంతో కూడలి మధ్య పందిరి వేయించి ఓ స్టేజీ తయారు చేయించాడు. ప్రదర్శనలు చూసి మాదిగవాడంతా సంతోషంతో మునిగిపో యింది. కొంతమంది మాలలు కూడా ఆ ప్రదర్శనలు తిలకించారు. నారాయణ జోగితతో అమర సుఖం అనుభవించాడు. జనం వెళ్ళాక స్టేజీ పక్క షెడ్డులో జోగిత ననుభవించినవాడు, ఓ రోజు ఆమెను తన ఇంటికే తీసుకొచ్చాడు.

"ఛీ, ఛీ! ఇదేంది? నా ఇంట్లో ఇట్టాంటివి సాగటానికీల్లేదు. పో, మరేడయినా పెట్టుకో" అంది రేణుక ఈసడిస్తూ.

నారాయణకు మండిపోయింది. ఎప్పటి నుండో ఆమెపట్ల విరసం పేరుకు పోయింది అతనిలో. అతను తన్ను షేక్ బాషాతో పంచుకుంటానికి ఒప్పుకుని, తనకు గాలం వేశాడని తెలిసినప్పటినుండి ఆమె అతని పట్ల విరసం ప్రదర్శించింది. తాను తప్పు చేసిందన్న అపరాధ భావ నతో ఉన్న ఆమెకు నారాయణను కట్టుకోక తప్పలేదు. పెళ్ళయినా ఆమె సమాధాన పడలేదు. నారాయణకు పెళ్ళామంటే భోగ్యవస్తువు. వస్తువుకు మనసుండే పని లేదు. పెళ్ళయాక అనురాగ, సరాగాలు ప్రదర్శించాల్సిన అవసరం కన్పించలేదు అతనికి. బలాత్కారంగా అనుభవించటం ఆమె అంకెకు రాకపోతే దేహశుద్ధి చేసి చెరచటం అతని దినచర్య. తాగిన మైకం లోనూ ఆమెను కొట్టేవాడు. పెళ్ళాం తనకు బానిసలా ప్రవర్తించక పోవటానికి కారణం తను పెద్ద కులంలో పుట్టిందన్న భావన అని అతడి ఉద్దేశం. ఆ భావనను అనసూ యమ్మ ప్రజ్వలింప చేసిందని అతను భావించాడు. ఆ కారణంగా ఆమెను హింసించటమే పనిగా పెట్టుకున్నాడతను. ఇవాళ తనకిష్టమైె జోగితను ఇంటికి తెచ్చు కుంటే భార్య సహించక ఈసడించుకోవ టంతో అతనికి ఆగ్రహం కలిగింది.

అంతే, చూరలో ఉన్న చర్నాకోల తీసి ఆమెను ఇష్టమొచ్చినట్లు బాదాడు. ఆమె

అరిచి గోల పెట్టింది. జోగిత అతన్ని ఆ ప్రయత్నంనుండి విరమింప ప్రయత్నం చేసింది గానీ, అతన్ని ఆపటం ఆమెవల్ల కాలేదు. ఈ గోల జరుగుతూ ఉంటే, విన్న పక్క భాగంలోని అతని అన్న, వదిన బయటకు వచ్చారు.

"ఏంరా, ఆ పిల్లనట్లా చావగొడ్తున్నావెందుకు?" అనడిగాడు శంకరయ్య.

"నీకెందుకు బే, నా పెళ్ళాం అది. కొడ్తాను, చంపుతాను" అన్నాడు నారాయణ పిచ్చి ఆవేశంతో ఊగిపోతూ,

"పెళ్ళాం చావగొట్టుకొవటానికిరా? సిగ్గు లేదూ?"

"నువ్వేందయ్యా చెప్పేది. హంతకుడూ నీతులు చెప్పేటోడే"

"నువ్వేం తక్కువోడివా? మనుషులను చిత్రహింస పెట్టే యమకింకరుడివి. పదవే, చెల్లీ, వాడు దుర్మార్గుడు నీ పుట్టింటికి వెళ్దువుగాని, రా" అంది బంగారి.

"పీడా పోయింది. పోవే ముం..." అని భార్యను పట్టుకుని వీధిలోకి గిరవాటు వేశాడు. ఏడుస్తున్న కూతుర్ని కూడా ఆమె మీదకు విసిరేశాడు నారాయణ. "ఎళ్ళండి, దాంతో పాటు మీరూ చావండి" అని అన్నా వదినలను కూడా బయటకు నెట్టి, జోగితతో పాటు ఇంట్లోకి దూరి, తలుపులు బిడాయించుకున్నాడు.

"పద, ఆమెను దేవదానం ఇంట్లో దింపి వద్దాం" అన్నాడు శంకరయ్య, రేణుకను లేపుతున్న భార్యతో.

"అర్ధరాత్రి ఇప్పుడేం దింపుతాం. రేప్పొద్దున నేను దిగెట్టి వస్తాలే" అది బంగారి.

"వద్దు వాడి సంగతి నీకు తెలియదు. ఇప్పుడే తీసుకువెళ్ళి దిగబెడ్దాం" అన్నాడు శంకరయ్య.

"ఇంత బయపడేటోడివి నువ్వు హత్య ఎట్ట చేసినవయ్యా" అంది బంగారి.

ఆ మాట ఎవరన్నా అతనికి ఉలికిపాటు కలుగుతుంది. తమ్ముడూ, అతని అల్లరి చిల్లర స్నేహితులూ ప్రత్యక్షంగానో పరోక్షంగానో అతన్ని 'హంతకుడని' అంటూనే ఉంటారు. శిక్ష అనుభవించినా, తనకా పాపం జీవితాంతం విడవదన్న భావం అతనికి కలిగింది. ఇవాళ భార్య కూడా ఆ మాట అనేటప్పటికి అతను మరింత ఉద్విగ్నుడయ్యాడు. అయినా, అతనిలో వివేకం నశించలేదు.

"సరే, ఆమెను, పిల్లను మన ఇంటికి తీసుకెళ్ళు. నేను వెళ్ళి ఎల్లమ్మ గుడిలో పడుకుంటాను" అని, భార్య ఏదో చెప్పబోతున్నా వినకుండా వెళ్ళిపోయాడు శంకరయ్య.




**సం**క్రాంత్రి చిందు భాగవతుల ప్రదర్శనలు, సంబరాలయి సంతయ్యను సంతృప్తిగా పంపేసేదాక తీరుబాటు లేకుండా గడిపాడు నారాయణ. జోగిత ఇచ్చిన సుఖంతో అతను పరవశించిపోయాడు. ఇప్పుడతను జోగితలాంటి స్త్రీలకూ తన భార్యకూ మధ్య ఉన్న భేదాన్ని గ్రహించాడు. తన భార్య ఎప్పుడూ తనకు మనస్ఫూర్తిగా తన శరీరాన్ని అర్పించుకోదు. జోగితగానీ, అతను సందర్శించుకునే వేశ్యలుగానీ అతన్ని మురిపిస్తారు. అది మరింత వలపు ప్రదర్శించి, మరింత డబ్బు గుంజుకునే ప్రయత్నమని అతను అర్థం చేసుకోడు. తన మొగతనం పట్ల అలరి ఆ





స్త్రీలు తమను అర్పించుకుంటారని అతని భావన. భార్యకు అతని డబ్బు అక్కర్లేదు, కాస్తంత అనురాగం, ప్రేమ కావాలి. అందుకతనికి తీరుబాటు లేదు.

పండుగ అయిపోయి, భాగవతులు వెళ్ళిపోయాక, అత్తింట ఉన్న భార్యకు కబురు పెట్టాడు, ఇంటికి రమ్మని.

"నేను ఆడకెళ్లను" అని రేణుక మొండికెత్తింది.

"ఏందేవ్! మొగుడి దగ్గర కెళ్ళనంటవు. నిన్నూ నీ కూతుర్నీ మేపే సత్తా మాకు లేదు. మాకూ పిల్లలున్నారు. పీడా విరగడవుతుందని అంత కర్సు చేసి పంపితే, మళ్ళా పెద్దమ్మలా నా ఇంటికి తగలడ్డావు. ఆ ముసల్ది ఒకతె. మనవరాలు అంటే గారాబం. దాని వత్తాసుతోనే నువ్వు మొగుడి దగ్గరకు వెళ్ళనని మొరాయిస్తున్నావు. ఎప్పుడు చస్తదో ఆ ముసల్ది" అని



నోరు పెట్టుకుని సెలగిపో యింది సువార్త.

"ఏందే కూస్తున్నావు! నేను చావల్నా? నీ జిమ్మడ! నీ కట్టె లేచిపోవా! నీ ఇల్లు బూడిద కాను" అని నోటికొచ్చినట్లు చెరిగిపోసింది చెంచులమ్మ.

"తప్పమ్మా! భర్త ఎలాంటి వాడయినా సహనంతో మార్పు తెచ్చుకోవాలి. పద దిగెడ్తా" అన్నాడు ఆమె తండ్రి దేవదానం.

రేణుకకిక తప్పలేదు. భోజనం చేసి, తండ్రి పెట్టిన కొత్త చీరె కట్టుకుని పిన్నమ్మకు, తండ్రికి, నాయనమ్మకు నమస్కరించి యమపురికి బయల్దేరింది.

భార్య కోసమే కాలయముడిలా కాచుకు కూర్చున్నాడు నారాయణ. అతనికి రేణుక అంటే విసుగు పుట్టింది. ఆమెను వదిలించుకోవాలి. అందుకు తన సావాసగాళ్ళతో కల్సి పథకం వేశాడు. భార్యను తీసుకు వచ్చిన మామను పలకరించలేదు. ఆమె గడపలో అడుగు పెట్టగానే, "ఆగు అక్కడ" అని గర్జించాడు.

ఆమె బిత్తరపోయి ఆగిపోయింది.

"ఎవడినడిగి నువ్వు కాలు బయట పెట్టినావే? "

"నువ్వే కదయ్యా, నన్నూ, నా బిడ్డనూ బైటికి గెంటినావు"?

"గెంటితే, నువ్వా హంతకుడి ఇంటికెళ్తావా? ఆడితో రంకు చేస్తున్న సంగతి నాకు తెలియదనుకోకు"

"తప్పయా! బావయ్యంటే అన్న నాకు!"

"నువ్వు అన్నతోనూ పడుకునేటి గుడిసేటి లం...వే" అంటూ ఆమె జుట్టు పట్టుకుని ఈడ్చి చావబాదటం మొదలుపెట్టాడు నారాయణ.

అడ్డం వచ్చిన దేవదానంను పక్కకునెట్టాడు. వసారా స్తంభం తగిలి నుదురు చిట్లి, "అమ్మో! నా కొడుకు చంపేస్తున్నాడురో" అని గోలపెట్టాడు దేవదానం.

వ్యవసాయపు పనులు లేవు గనుక తీరుబాటుగా ఉన్న చుట్టుపక్కల జనం మూగారు. పక్కింటి అన్న, బంగారి కూడా వచ్చారు.

"ఏందిరా పెళ్ళాన్ని అట్టా చావనూకుతున్నావు? " అడిగాడు సమ్మయ్య.

"పెళ్ళాం రంకు చేస్తే ఏ మగోడూరుకుంటాడు. నువ్వూరుకో" అన్నాడు రంగడు.

"రంకేందిరా, తప్పుడు కూతలు కూయకు" అన్నాడు సమ్మయ్య.

"ఇంట్లో చోటిచ్చినోడినే చంపినోడు ఆడు! ఆడ్నే అడుగు నిజమేదో తేల్తది" అన్నాడు నారాయణ, అన్న వంక వేలెత్తి చూపెడుతూ.

"ఛీ, నీ దుష్టబుద్ధికి అంతులేదు" అన్నాడు శంకరయ్య తమ్ముడిని ఈసడించుకుంటూ.

"చంపుతా, కొడకా! నా పెళ్ళాన్ని మరిగి నన్నే అంటవుబే! ఆరోజు నువ్వు దాన్ని నీ ఇంట్లోకి తీసుకెళ్ళి, నీ పెళ్ళాం ఎదటే దాన్తో కులకలా? " అన్నాడు నారాయణ కోపంతో ఊగిపోతూ, అన్న గల్లా పట్టేసుకుని.

బంగారికి మండిపోయింది. మరిది చేతులమీద కొట్టి, మొగుడిని విడిపిస్తూ, "ఏందిరో, దర్మాత్ముడు నా మొగుడి మీదనే చెయ్యేస్తున్నవే... జోగిత్తో రంకు



సాగించటానికి, నీ పెళ్ళాన్ని గొడ్డును బాది నట్టు బాది, ఇంట్లోనుండి గెంటేస్తే, దాన్ని నేనే నా ఇంటికి తీసుకెళ్ళినాను. నా మొగుడెల్లి ఎల్లమ్మ గుడిలో తొంగున్నాడు. ఆడు ఇంట్లో లేనేలేడు. తప్పుడు కూతలు కూస్తే పురుగులుబడి ఛస్తవు" అంది బంగారి.

"దానికి ఎవరు సాచ్చికం? ఎల్లమ్మదేవే చెప్పాల" అన్నాడు రంగడు.

"అవును. ఎల్లమ్మే సాచ్చికం పలుకు తాది. కొరువులు పట్టుకుని అది తమ పతివ్రతేనని నిరూపించుకోవాలి" అన్నాడు సాంబిగాడు.

"కొరువులు పట్టుకుంటే చేతులు కాల్తాయి. అది ఎల్లమ్మ చెప్పిన సాక్ష్యమ వుతుందా? మూఢనమ్మకాలు, మూర్ఖపు మనుషులు!" అన్నాడు శంకరయ్య విసుగ్గా.

అయితే ఆచారం, కట్టుబాట్ల నమ్మకంలో పెరిగిన మనుషులకు హేతువు పట్టదు. మూర్ఖులని పెద్దలనూ విరోధం చేసుకు న్నాడు శంకరయ్య.

"తప్పు చేసినోడివి. నీకు మాట్లాడే హక్కులేదు. నువ్వు నోర్మూసుకో" అన్నాడు తమ్ముడు అన్నని.

కులపెద్ద సమ్మయ్యకూ అనుమానమొ చ్చింది. 'అన్న ఇషయంలోనే ఆడు తప్పుప డుతున్నాడంటే ఏందో ఉంది కత! ఆడు మనిషిని చంపి జైలు కెళ్ళొచ్చినోడు. నిప్పు లేక పొగరాదు. తప్పు చేయనోళ్లని ఎల్లమ్మ తల్లి కాపాడతాది' అనుకున్నాడు.

"అట్లనే. సాయంత్రం శీలపరీచ్చ కేర్పాటు చెయ్యండి" అని వృద్ధుడు తాఖీదు ఇచ్చాడు.

దేవదానం నిర్వీర్యంగా నిలబడి జరుగు తున్న అక్రమాన్ని చూస్తూ ఉండిపో యాడు. ఆ ఊళ్ళో తన కులపు వాళ్ళు తక్కువ. ఉన్నవాళ్ళకూ తను క్రైస్తవుడని పడదు. ఏంచేయాలో తోచలేదు అతనికి. 'ఏసు ప్రభువునే శిలువ వేశారు! మనుష లెంత? ... ప్రభూ నా బిడ్డను కాపాడు' అని మొక్కుకున్నాడు అతను.

మరికాస్త సేపు అక్కడ ఉండటానికి శంక రయ్యకు కంపరం కలిగింది. ఇంటికీ వెళ్ళ బుద్ధి కాలేదు. సీదా పొలానికి వెళ్ళిపో యాడు. జనాలు కూడా ఇళ్ళకు పోసా గారు.

"ఇంకేటి, ఈడ నిలబడ్డావ్! ఫో, సాయంత్రం ఎల్లమ్మ గుడికి రా. నీ కూతురు రంకుతనమేదో బయటపడ్తాది" అని బయటకు నెట్టాడు నారాయణ దేవ దానాన్ని. ఎండ నెత్తిన మాడుతుంటే, నెత్తిన గుడ్డ కప్పుకుని బోరున విలపిస్తూ ఇంటిదారి పట్టాడు దేవదానం. ఏడుస్తున్న రేణుక కూతురును చంకనేసుకుని తన ఇంటికి తీసుకుపోయింది సమ్మయ్య భార్య వెంకటమ్మ.

సాయంత్రం మాదిగవాడ జనమంతా ఎల్లమ్మ గుడికి తరలి వెళ్ళారు. పక్కన మున్నేరు అమాయకంగా పారుతోంది. ఆ ఊరి జనానికి ఆ తల్లి కలుష హారిణి. గంగామాత. మాదిగవాడ పెద్ద ముత్తయి దువులు రేణుకను పొదవి పట్టుకుని ఎల్లమ్మ గుడికి నడిపించారు. నారాయణ, రంగడు, సాంబిగాడు వాళ్ళ వెంట వెళ్ళారు. గుడి దగ్గర వేదిక నొకటి ఏర్పాటు చేశారు. క్వింటాలు కట్టెలను మండించి, అందులో ఇనప కడ్డీలను పెట్ట డమే తరువాయి.

రేణుక బలి పశువులా నడవసాగింది. ఆమె మనసు జరగబోయే ఆపదమీద లేదు. తనకు అనసూయమ్మ నేర్పిన - సీత అగ్ని ప్రవేశం- పాటమీద లగ్నమై ఉంది. లంక నుండి తిరిగి వచ్చిన సీతను చూసి అన్నాడు రాముడు.

"అనుజుడా తమ్ముడా ఓయి లక్ష్మణుడ!

కుక్కముట్టిన కుండ కుదరదు మాకు!
మా తల్లి కౌసల్యా వద్ద కేతెంచి!
అలాగు కాకుంటె అంబుజేక్షణ!
ఈ మూడు లోకాల వారెల్ల జూడ!
జోలైన గట్టుకుని బిక్షంబు యెత్తు!"

సీత విన్నవించుకుంది. 'ఆ పాపపు రావణుని చెరలోన పది నెలలు ఉన్నాను. వాడిని నేను చూడలేదు. అనరాని మాటలను, వినరాని మాటలను పలుక వచ్చునా? " ఎవరు వింటారు సీతమ్మ అరణ్య రోదన!

కట్టెలకు నిప్పు అంటించాడు రంగడు. ఇనుప కడ్డీలు నిప్పులో పెట్టాడు సాంబిగాడు.

రేణుక సీతమ్మ వెతలకు చలించిపోయింది. 'వాయునందనుడు కట్టెలను పేర్పించాడు. పావకుడు భగభగా మండిస్తున్నాడు కట్టెలను. తొలకరి మెరుపులా సీత కదలి వచ్చింది. లక్ష్మణుడు ఆమె పరిస్థితి చూసి గడగడా వణికాడు. అతని చూసి-

"హడలకుమా లక్ష్మణ, జడుపేల నిపుడు!
మిమ్మన్న మాటలు అనుభవంబయ్యో!
చేసిన పాపమ్ము వండిన చల్ది!
కురువకపోమయ్య కొద్ది కాలమునకు"

ఆ శీలపరీక్ష అందరికీ చోద్యమయింది. ఎన్నాళ్ళకెన్నాళ్ళకు! జనం ఒకళ్ళనొకళ్ళు తోసుకుని చూడసాగారు. శంకరయ్య కంపరం నిండిన మానసంతో చూస్తున్నాడు. పితృస్వామ్య వ్యవస్థ వేళ్ళూనుకుంటున్న క్రమంలో శీలం ఆడదానికే గానీ, మొగాడికి అక్కర్లేదన్న భావం ప్రబలింది. సీతకే తప్పనిది, రేణుకనగా ఎంత? స్త్రీ మనోభావాలనూ, వేదననూ పట్టించుకునేదెవరు? శీలం శారీకమైందని రూఢీ అయింది. మనసు ఎవరూ తెల్సుకోలేరు గనుక శీలం మనస్సుకు సంబంధించిది కాదు. శంకరయ్య గుండె బరువెక్కింది.

అప్పుడెవరో అరిచారు. "దొరసానమ్మ వస్తోంది, తప్పుకోండి, తప్పుకోండి" అంటూ.

అనసూయమ్మ వచ్చింది. సన్నటి మనిషి. తెల్లటి చీరె, నుదుటిన తిరుచూర్ణపు రేఖ. వేగంగా నడుచుకుంటూ వచ్చింది ఆమె. వృద్ధాప్యం ఆమెను అవనతం చెయ్యలేదు. ఆమె ముఖంలో ఏ ఆందోళనా ద్యోతమవలేదు.

వస్తూనే అనసూయమ్మ కులపెద్ద, వృద్ధుడూ అయిన సమ్మయ్యను పలకరించింది.

"ఏర్పాట్లన్నీ అయినయ్యా, సంతయ్యా!" అని.

"అయినయ్యి, దొరసానీ! తఁవరు వచ్చారు. మాకు ఆనందమయింది" అన్నాడు.

"రంకుతనం, జారతనం శిక్షించదగినవే. రేణుకకు శీలపరీక్ష పెట్టి మంచిపని చేశారు"

ఆమె మాటలు విన్న నారాయణ నివ్వెరపోయాడు. ఆమె వచ్చిందంటేనే ఆందోళన కలిగింది అతనికి. రేణుక అంటే అపరిమితమయిన వాత్సల్యం ఆమెకు అని అతనికి తెల్సు. అందుకే ఏం మాయమాటలు చెప్పి ఆమె తన యత్నాన్ని భగ్నం చేస్తుందోనని భయపడ్డాడు.

"అవునమ్మా! మా కులాచారం. ఏనాటి నుండో వస్తున్నది. పిల్ల శీలవతి అయితే ఎల్లమ్మ కాపాడతది"

"అవును. ఎల్లమ్మ కాపాడుతుంది. ఎందుకు కాపాడదూ! అయితే, ఒక్కమాట! రేణుక మండే కొరువులు పట్టుకుని తన పాతివ్రత్యం నిరూపించుకుంటుంది. ఆమె నవి కాల్చకపోతే పతివ్రతే కదా! అప్పుడు ఆమె పతివ్రత కాదని దోషారోపణ చేసిన వ్యక్తి దూష్యుడు అవుతాడు. అన్యాయంగా



అపనింద వెయ్యటం, నీలాంటి కులపెద్ద ఎలా సహిస్తాడు? "

"మంచిగ చెప్పినవు, తల్లీ! అన్యాయంగా ఎవరూ నింద ఎయ్యగూడదు"

"ఆమెను కొరువులు కాల్చకపోతే నారాయణ కొరువులు పట్టుకోవాలి" అంది అనసూయమ్మ.

"అట్ల ఆనవాయితీ లేదమ్మా!" అన్నాడు సమ్మయ్య బలహీనంగా.

"దొరసాని చెప్పింది సత్తెమే. ఆడూ కొరువులు పట్టుకోవల్సిందే" అన్నాడు సత్తెయ్య.

అప్పుడు వచ్చాడు శంకరయ్య, లోపలకు జొరబడి.

"ఆనవాయితీ మర్చిపోయారు, పెద్దాయనా! వాడు నా మీద నిందలేశాడు. ఆమెను కొరువులు కాల్చకపోతే, నారాయణ ఆ తర్వాత నేనూ కొరువులు పట్టుకుంటాం. మాలో దోషి ఎవరో తేల్తుంది" అన్నాడు.

"అవును. ఇద్దరూ పట్టుకోవాల్సిందే" అన్నాడు రంగడు. శంకరయ్యను శిక్షించాలనే ఉత్సాహంతో, తన మిత్రుడికీ శిక్ష పడుతుందన్న సత్యం మరిచాడతను.

పిల్లగాళ్ళ మాటలు ఎట్లా ఉన్నా, తన వయసువాడు సత్తెయ్య కూడా అనసూయమ్మ మాటను సమర్థించటం చూశాక సమ్మయ్యకు ఆ ప్రతిపాదన న్యాయమేనన్పించింది. అయినా సందేహంగానే, "ఏమంటావురా, నారాయణా? " అని అడిగాడు.

మండుతున్న ఇనప కడ్డీలు చేతులను కాల్చకుండా ఏ దేవుడూ, దయ్యం ఆపలేరని నారాయణకు తెల్సు. నిప్పు ముట్టుకుంటే కాల్చక వదలదు. ముందు రేణుక కొరువులు పట్టుకుంటుంది. దాని చేతులెలాగో కాల్తాయి. ఇంక తను కొరువులు పట్టుకోవాల్సిన అవసరం ఉండదు. ఇంత ఆలోచన చేశాక, "అట్లనే, పెద్దయ్యా!" అన్నాడు.

"మరో మాట!" అన్నది అనసూయమ్మ.

"ఏంది, సెలవియ్యి, దొరసానీ!" అన్నాడు సత్తెయ్య.

"దోషారోపణ చేసింది మామూలు మనిషి కాదు. ఊరికి సర్పంచి. పెద్దమనిషిగా చెలామణి అవుతున్న వ్యక్తి. రేణుక పతివ్రత అని తేల్తే అతను ఆ పదవిలో ఉండటానికి వీల్లేదు. అది ఊరికి అరిష్టం! అతడా పదవికి రాజీనామా చెయ్యాలి. చెయ్యకపోతే మీరు బలవంతపెట్టి రాజీనామా చేయించాలి"

"అట్లెట్ల, అది వేరు. ఇది వేరు" అన్నాడు నారాయణ.

"ఏరేంది, కిష్ట! అమ్మ చెప్పినాది సత్తెమే" అన్నాడు చంద్రుడు. తనకు ప్రత్యర్థిగా డబ్బు వెదజల్లి, తాగించి, తినిపించి తన్ను సర్పంచి కాకుండా చేసినప్పటినుండి అతనికి నారాయణంటే కడుపు మంటగా ఉంది.

"ఊరికి అరిష్టమైతే, ఆడు సర్పంచిగ ఎట్లుంటాడు? " అంది సమ్మయ్య భార్య వెంకటమ్మ.

"దాని చేతులు కాలకపోతేకదా అప్పుడు చూసుకుందాం" అనుకున్నాడు నారాయణ. అందువల్ల ఆ ప్రతిపాదనని గట్టిగా వ్యతిరేకించలేదు. మౌనం వహించాడు.

రేణుకను ముందుకు నడిపించారు అతివలు. ఆమె అనసూయమ్మ వచ్చిన సంగతి కూడా గ్రహించే స్థితిలో లేదు.

రేణుక వెంట వచ్చిన స్త్రీలు ఆమెను వేదిక వద్దకు తీసుకువెళ్ళారు. మంట జాజ్వల్యమానంగా మండుతోంది. కొరువులు కణకణ నిప్పులయ్యాయి.

"పట్టుకోవే తల్లి! కొరువులు!" అంది వెంకటమ్మ.

"అదేందమ్మా! పవిత్రమైన అగ్రిహోత్రు

డిని అలాగే స్పృశింపచేస్తావా? ముందుగా స్నానంచేసి శుచిగా రావాలి. తడి బట్టలతో వచ్చి పావకుడికి మొక్కి అప్పుడు కొరువులు పట్టుకోవాలి. అప్పుడే అగ్నిదేవుడు తన మహిమను తెలియబరుస్తాడు" అంది అనసూయమ్మ.

"అవును. అదే ఆనవాయితీ" అంది మరో వృద్ధురాలు.

"రామ్మా! నువ్వు కూడా పిల్లను దీవించు. అగ్గిదేవుడు మహిమను చూపిస్తడు" అని అనసూయమ్మను ఆహ్వానించింది సమ్మయ్య భార్య వెంకటమ్మ.

సన్నగా చినుకులు ప్రారంభమయ్యాయి.

"ఈ అకాల వర్షమేంది? " అన్నాడు సమ్మయ్య, ఆకాశం వంక చూస్తూ. పెద్దగా మేఘాలేం లేవు. రెండు చినుకులు పడిపోతుందేమో అనుకున్నాడు.

"వాన పెద్దదవుతదేమో. నిప్పులు ఆరిపోవచ్చు. ఏటిలో మునగక్కర్లేదు. కొరువులు పట్టించండి" అన్నాడు నారాయణ.

"అదేం మాట! ఎల్లమ్మకు కోపమొస్తుంది. అంతా కట్టుబాటు ప్రకారం జరగాల్సిందే" అంది అనసూయమ్మ.

ఆమెకేమాత్రం తొందర లేదు. ఆమె ఎవరి కోసమో ఎదురు చూస్తున్నది. చంద్రుడి వంక ప్రశ్నార్థకంగా చూసింది. అతడు తల ఊపాడు.

అనసూయమ్మ ముందుకు వచ్చింది. సమ్మయ్య భార్య, అనసూయమ్మ రేణుకను మున్నేరుకు నడిపించారు. కల్మషహారిణి పవిత్రంగా పారుతోంది. "మనుషుల పాపాలను హరించే గంగమ్మ తల్లీ! నా బిడ్డను కాపాడు" అని నమస్కరించింది అనసూయమ్మ. ముగ్గురూ ఏటిలోకి



దిగారు. మూడు మునకలు మునిగారు. వెంకటమ్మ రేణుక ముఖానికి పసుపు రాసింది. నుదుట కుంకం దిద్దింది.

ఏటి బయటకు వచ్చారు ముగ్గురూ. వారి చీరెలనుండి నీళ్ళు కారుతున్నాయి. రేణుకను వేదిక దిశగా నడిపించారు. చినుకులు పెద్దవయ్యాయి.

"రండి, తొందరగా! మంట చల్లారిపోతాది" అనరిచాడు నారాయణ.

రేణుక మనస్సు సీత ఇక్కట్టును ఊహిస్తోంది.

"గుండమ్ముకెదురుగా సీతయేతెంచె
ముమ్మారు ప్రదక్షిణము చేసి నిలుచుండె
దోసెడు ముత్యాలు గుండాన బోసి
ముందు శ్రీరాములను హృదయమున దలచి
కొలనులో జొచ్చినట్లు అగ్నిలో జొచ్చె
కణకణ నిప్పులూ కుంకమ్ము లాయె
పరిచున్న నిప్పులూ పన్నీరు ఆయె
దాసిన నిప్పులూ చందనంబాయె
మండేటి నిప్పులూ వడగళ్ళు ఆయె"

వేదిక వద్దకు వచ్చారు ముగ్గురు. ఇనప కడ్డీలు ఎర్రగా మండుతున్నాయి.

జనమంతా ఉత్సుకతతో, శ్వాస బిగబట్టి ఆ దృశ్యాన్ని చూస్తున్నారు.

"ప్రదక్షిణం చెయ్యాలి. మూడుసార్లు అగ్నిహోత్రుడి చుట్టూ ప్రదక్షిణం చేసి, నా బిడ్డ కొర్రులు పట్టుకుంటుంది". అంది అనసూయమ్మ.

నారాయణకు అసహనంగా ఉంది. అయినా ఏం మాట్లాడలేకపోతున్నాడు. యధావిధిగా మూడు ప్రదక్షిణాలు చేశారు రేణుకను తీసుకుని. అంతలో వర్షం ఒక్క పెట్టున దబదబా కొట్టింది. వేదికమీద నిప్పులు ఆరిపోయాయి. ఇనప కడ్డీలు చల్లబడ్డాయి. వాన కురుస్తున్నా, జనం లెక్క పెట్టలేదు. అలాగే నిలబడిపోయారు.

ఆకాశగంగ రేణుకను రక్షించింది. మున్నేరు సంతోషంగా పారుతోంది. అగ్ని దేవుడు తను ఆమెను పరీక్షించాల్సిన అవసరం లేదని చల్లబడ్డాడు.

రేణుకకేమీ తెలియదు. వర్షం కురుస్తున్నా ఆమె మనసు పావక పవిత్ర సీత మీదే లగ్నమయింది.

దబదబా కురిసిన వాన అంతలోనే వెలసిపోయింది.

"మళ్లీ కట్టెలు వేసి మండించరా, రంగడూ! ఇదేటి వానో! సరిగా సమయాని కొచ్చింది" అన్నాడు నారాయణ.

"అక్కర్లేదు. ఎల్లమ్మ దేవికి ఈ పరీక్ష నిర్వహించటం ఇష్టం లేదు. అందుకే ఈ అకాల వర్షం కురిపించింది" అంది అనసూయమ్మ.

"ఎల్లమ్మదేవి లేదు! మహత్యం లేదు! ఆమె మాయమాటలు చెప్తా ఉంది" అన్నాడు నారాయణ. తన ప్రణాళిక ఇలా చప్పగా వ్యర్థమవటంతో ఆగ్రహించిన అతని బుర్ర పోయింది. ఏం మాట్లాడుతున్నాడో కూడా మర్చిపోయాడు.

"ఏందిరా, నారాయణ! ఎల్లమ్మదేవికి మహోత్మ్యం లేదా? తప్పుడు కూతలు కుయ్యకు" అన్నాడు సమ్మయ్య.

"అమ్మమీద నమ్మకం లేనోడివి, మరెందుకురా ఈ పరీచ్ఛ పెట్టింది? " అంది బంగారి ముందుకొస్తూ.

"అడట్లా అనలేదు. దొరసానమ్మ మాయ మాటలు చెప్తాందనే అనుండి. మళ్ళా పరీచ్ఛ పెట్టాల్సిందే. లేకపోతే అమ్మకు కోపమొస్తాది" అన్నాడు రంగడు నారాయణకు వత్తాసుగా.

"అవసరం లేదు. ఉరిశిక్ష వేసిన వ్యక్తి, ఒకసారి తీసినప్పుడు మరణించకపోతే, మళ్లా తీయాల్సిన అవసరం లేదని న్యాయస్థానమే ఎప్పుడో తీర్పిచ్చింది. ఆ పిమ్మటే చచ్చిందాకా ఉరి వెయ్యాలని చట్టం

మార్చారు. ఇప్పుడు ఆ పిల్లకు మళ్లీ పరీక్ష పెట్టాల్సిన అవసరం లేదు. ఎందుకంటే మనం ఆ మాట ముందు అనుకోలేదు!" అన్నాడు శంకరయ్య.

అక్కడ జమయిన స్త్రీలందరూ కూడా నినదించారు. "మళ్లా పరీచ్చ అవసరం లేద"ని!

"నా బిడ్డ పతివ్రత! అగ్నిదేవుడంత పవిత్రమైంది!" గుమిగూడిన జనాలకు ప్రకటించింది అనసూయమ్మ. జనం పొంగిపోయారు.

"ఎంత రొష్టు పెట్టిండే బిడ్డను, పాపిష్టోడు" అంది వెంకటమ్మ.

"ఆడిచేత కొర్రులు పట్టించండి" అంటూ ముందుకు వచ్చింది రంగడి పెళ్ళాం. రంగడిని పక్కకు తోస్తూ.

రేణుక ఇహలోకంలో లేదు. అశరీర వాణి.

"సీత పతివ్రతయని సిద్ధముగ బల్కె।

దుందుభులు మ్రోగెను తుంబురులు పాడె।

రంభ ఊర్వసులప్పుడు నాట్యములు జేసె।

పుష్ప వర్షము గురిసె నా పృథ్వి యందు..."

నారాయణ వణికిపోయాడు. "మాయ చేసింది అనసూయమ్మ. వాన కురిపించింది. నేను కొర్రులు పట్టుకునే పనిలేదు. అది తన శీల పరీక్ష జరుపుకోలేదు" అన్నాడు నారాయణ.

"చంపుతా నా కొడకా! ప్రతిదానికీ పెళ్లాన్ని గొడ్డును బాదినట్టు బాదుతుండవు. మేం చూడలేదనుకుంటివి రే! అరేయ్, సాంబిగా! నిప్పుల్లో మళ్లీ కట్టెలు వెయ్యి. కొరువులు పెట్టు దాన్లో" అని ఆదేశమిచ్చాడు సమ్మయ్య.

"అవును. ఆడూ పట్టుకోవాలి" అంది బంగారి.

"వద్దులే, సమ్మయ్యా! నా బిడ్డ పతివ్రత కనుక దాని చేతులు కాలవు. వాడు దుష్టుడు. వాడి చేతులు కాలటం తథ్యం! ఎంత పతితుడయినా నా బిడ్డకు మొగుడు. వాడి చేతులు కాలితే నా బిడ్డ ఓర్చుకోలేదు. వాడిని క్షమించి వదిలెయ్యండి" అంది అనసూయమ్మ.

"ఆడిని చమించాల్సిన పనిలేదు. ఆడూ కొర్రులు పట్టుకోవాల్సిందే" అంది సాంబిగాడి భార్య.

స్త్రీలోకం ఒక్కటై ఆమె మాటలకు మద్దతు పల్కారు.

అప్పుడు వచ్చింది అనసూయమ్మ నిరీక్షిస్తున్న పోలీసు జీపు. అందులో నుండి పోలీసు ఇన్‌స్పెక్టరు, నలుగురు జవాన్లు, చంద్రుడి మిత్రుడు నర్సయ్య దిగారు.

దిగుతూనే నర్సయ్య, "అదుగో అడే! మూఢనమ్మకంతో పెళ్లాన్ని సతాయిస్తుండు నా కొడుకు. శీలపరీచ్చంట! ఆ పోరి చేతులు కాల్చటానికి సిద్ధమయిండు" అన్నాడు సబ్ ఇన్‌స్పెక్టరుకు నారాయణను చూపిస్తూ.

పోలీసు జీపు చూడగానే నారాయణకు ముచ్చెమటలు పోశాయి. మెల్లగా మంద వెనక్కి జారుకుని, పారిపోసాగాడు మున్నేటికి అడ్డంగా పడి. జనం గమనించేలోపలే క్షణంలో ఏటిని ఈది ఆవలి గట్టుకు చేరాడు.

"పట్టుకోండి, ఆడిని" అని ఆదేశమిచ్చాడు కులపెద్ద, సమ్మయ్య.

జనం ఏటిగట్టున పరుగెత్తారు.

"అక్కర్లేదు సమ్మయ్యా! వాడిని వదిలెయ్యండి. మీకు కావాల్సింది మా కులమింటి కోడలు పాతివ్రత్యం తెల్సుకోవటమే. అది పరీక్షకు సిద్ధమైంది. నా బిడ్డ సీత, సావిత్రి, అనసూయలాంటిది. ఈ దుష్కృత్యాన్ని చూడలేక ఎల్లమ్మదేవి వర్షం కురిపించి అది ఋజువు చేసింది.



అతడెట్లాంటి వాడయినా వదిలేయండి, వాడిని వాడి పాపానికి. సర్పంచి పదవి నుండి మాత్రం తొలగించండి. అదయినా ఊరికి అరిష్టం కనుక! వాడిని శిక్షించటానికి ఆ దేవుడే ఉన్నాడు" అంది అనసూయమ్మ.

"ఎందుకు దొరసానీ! వాడెక్కడికి పోతాడు. వాడిని అరెస్టు చేస్తాం" అన్నాడు పోలీసు ఇన్‌స్పెక్టరు.

"అక్కర్లేదు. చంద్రుడు తన ఫిర్యాదును వాపసు తీసేసుకుంటాడు. మీకు శ్రమ ఇచ్చినందుకు మమ్మల్ని క్షమించాలి" అంది ఆమె.

నారాయణపై కేసు పెట్టటమంటే, అమాయకులయిన కుల పెద్దలు సమ్మయ్య, సత్తెయ్యలు లాంటి వాళ్లను కూడా అరెస్టు చేయాల్సి ఉంటుంది. ఓ స్త్రీ హింసను కట్టుబాటు పేరుతో ప్రోత్సహించిన ఆ వృద్ధులను కోర్టుల చుట్టూ తిప్పటం ఆమెకు ఇష్టం లేదు. ఇన్‌స్పెక్టరు ఆమెపై గౌరవంతో తన జవాన్లను తీసుకుని జీపెక్కి వెళ్ళిపోయాడు.

తన్ను పోలీసు కంప్లెయింట్ ఇవ్వమని చెప్పి, దొరసాని ఇలా మాట్లాడుతుందేమో అని అయోమయంలో పడిపోయాడు చంద్రుడు. "అదేంది, దొరసానీ..." అని అభ్యంతరం చెప్పబోయాడు.

"నీ లక్ష్యం నెరవేరింది కదరా! నువ్వే కాబోయే సర్పంచివి" అన్నది అనసూయమ్మ.

చంద్రుడికి సంతృప్తి కలిగింది. అనసూయమ్మ కూడా ఆ గిరిధారికి శతసహస్ర నమోవాకాలర్పించింది. పోలీసులు రావటం ఆలస్యం చేసినా, తన వేణుగోపాలుడు ఆలస్యం చెయ్యలేదు. అకాల వర్షం కురిపించి శిష్ట రక్షణ చేశాడు.

శంకరయ్యకు తను జెయిలులో పఠించిన భగవద్గీత శ్లోకం జ్ఞప్తికి వచ్చింది. "యత్ర యోగీశ్వరః కృష్ణో, యత్ర పార్థో ధనుర్ధరః। తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మ తిర్మమ॥"

అనసూయమ్మ దగ్గరకు వచ్చి, "నిన్ను చూసి నా జన్మ ధన్యత చెందినట్లయిందమ్మా!" అన్నాడు ఆమెకు మొక్కుతూ,

అనసూయమ్మ నవ్వింది, "లేరా, పిల్లగాడా! నేనెవర్ని? అంతా ఆ వేణుగోపాలుడే చూసుకున్నాడు. మనం నిమిత్తమాత్రులం!" అంది.

దేవదానం వచ్చి, అమాంతం ఆమె కాళ్ల మీద పడ్డాడు. "ఏసుప్రభువును కన్న మేరీ మాతవు నువ్వు. నా బిడ్డను రక్షించావు" అన్నాడు.

"ఏసుప్రభువుకు విన్నవించుకో. ఇంక బిడ్డను నా దగ్గర ఉంచుకుంటాను. ఆ వేణుగోపాలుడికీ, ఏసు ప్రభువుకూ అభ్యంతరం ఉండదు" అంది సువార్త చేతిలోని రేణుక బిడ్డను తన చంకనేసుకుంటూ అనసూయమ్మ.

రేణుక ఇంకా సమాధినుండి మేలుకోలేదు. ఆమెను కుడిచేత్తో పొదవి పట్టుకుని నడిపించింది అనసూయమ్మ ఇరవై ఒకటో శతాబ్దంలోకి.

సన్నసన్నగా చీకటులు ముసురుకుంటున్నాయి. దూరంగా వేణుగోపాలస్వామి ఆలయం నుండి గంటలు విన్పిస్తున్నాయి. ధ్వజ స్థంభానికి వేలాడుతున్న ఆకాశదీపం మినుకుమినుకుమంటూ వెలుగుతోంది.

జనం ఎవరి దారి వారు పట్టారు.

శీల పరీక్ష అందరికీ తప్పదు. ఎవడి శీలపరీక్ష వాడే జరుపుకుంటాడు. కాలచక్ర సంవర్తనంలో అందరి శీలాలూ పరీక్షింపబడతాయి. ఎవరి శీలాన్నయినా పరీక్షించటానికి మానవమాత్రులెవరు?

'అమ్మ'స్మృతిలో–రచయిత ©

ఇదీ వేదం

# బాల్యవివాహాలను వేదాలు ప్రోత్సహించాయా?

-సంధ్యావందనం లక్ష్మీదేవి

**భా**రతదేశం సంస్కృతీ సంప్రదాయాలకు పెట్టింది పేరు. భారతీయ సంస్కృతికి, జీవన విధానానికీ ఎప్పుడో వేలాది ఏళ్లక్రితం చెప్పబడిన వేదాలే ఆధారభూతాలు. వేదాలను నమ్మేవారు.. నమ్మనివారు కూడా తమకు నచ్చినట్లు, తమకు కావాల్సిన పద్ధతుల్లో వీటికి విపరీత వ్యాఖ్యానాలు చెప్పుకుంటూ పబ్బం గడుపుకున్నారనడంలో సందేహం లేదు. అతి కొద్దిమంది మాత్రమే వీటి విలువను గుర్తించి నిజాయితీగా సమాజ సేవకు వినియోగించుకుంటున్నారు. కొందరు స్వార్థపరుల పుణ్యమా అని వేదాలపేరుతో ఎన్నో ప్రక్షిప్తాలు ప్రచారంలోకి వచ్చి ద్వంద్వ ప్రమాణాలను బోధిస్తున్నట్లు నిరూపితమవుతున్నాయి. ఈ కారణంగానే ఆధునికకాలంలో ఇవి తీవ్ర ఉదాసీనతకు లోనవుతున్నాయి. 'వేదాల్లోనే అన్నీ ఉన్నాయిష...' అంటూ గురజాడలాంటి సంస్కర్త వెక్కిరించాడంటే వీటిని ఏ స్థితికి దిగజార్చారో ఇట్టే అర్థమవుతుంది. స్వార్థప్రయోజనాల కోసం కొందరు వేదాలు చెప్పాయంటూ అనేక అనాచారాలను, దురాచారాలను ప్రచారం చేస్తూ లాభపడ్డారు. నిజానికి వేదాలు చక్కని జీవనవిధానానికి పట్టుగొమ్మలు. మనం రక్షించుకోదగ్గ అపురూప సంపదలు. చాలామంది అనుకున్నట్లుగా ఇవి ఏ మూఢనమ్మకాలనూ ప్రోత్సహించలేదు. ఏ అనాచారాలనూ ప్రతిపాదించలేదు.

**అసలు వేదాలు ఏం చెబుతున్నాయి?**

తరతరాలుగా కొనసాగిన స్త్రీ పురుష అసమానతలు, మహిళల నిరక్షరాస్యత, బాల్యవివాహాలు, బహుభార్యాత్వం, వేశ్యావృత్తి, కన్యాశుల్కం, వరకట్నం, సతీసహగమనం, పరదా దురాచారం మొదలైన వాటన్నింటినీ ఇవి ఖండించాయి.

ఈ నిజాల్ని సమాజానికి తెలియనీయకుండా, తమ ప్రాబల్యాన్ని కాపాడుకునేందుకు పలువురు పండితప్రకాండులు, ధనవంతులు తమవంతు కృషిచేశారు. వేదంపేరుతో మనుషుల మధ్య విభజనలు సృష్టించారు. మహిళను కట్టుబానిసను చేశారు. తమ ప్రయోజనాలకోసం కొన్ని అంధ విశ్వాసాలకు ఆజ్యం పోశారు. రుషుల పేరుతో చెప్పిన శ్లోకాలు ఎలా ఉన్నాయో చూడండి..

**అష్టా వర్షా భవేద్ గౌరీ, నవ వర్షాచ రోహిణీ!**
**దశవర్షా భవేత్కన్యా తత ఊర్ధ్వం రజస్వలా!!**

అంటే-

బాలికకు ఎనిమిదో ఏట గౌరి, తొమ్మిదో ఏట రోహిణి, పదో సంవత్సరంలో కన్య ఆ తరువాత రజస్వల అన్న నామమేర్పడుతుంది.

అలాంటిదే మరోటి-

**మాతాచైవ పితాతస్యా జ్యేష్టో భ్రాతాతథైవచ!**
**త్రయస్తే నరకం యాన్తి దృష్ట్వా కన్యా రజస్వలామ్!!**

కన్యకు పదో సంవత్సరం వరకూ వివాహం చేయకపోతే, రజస్వలగా వ్యవహృతమయ్యే ఆ బాలికను చూచిన తల్లిదండ్రులు, ఆమె అన్న నేరుగా నరకానికి పోతారని రాశారు.

**అసలు వేదం ఏం చెప్పింది?**

వేదం 'బ్రహ్మచర్యేణ కన్యాయువానం విందతే పతిం' అని (అధర్వణవేదం 11-3-5-18) ఘోషించింది. అంటే- బ్రహ్మచర్యాన్ని పాటించి, ఉత్తమ విద్యలు నేర్చుకున్నాక కన్య తన గుణకర్మ స్వభావాలకు అనుకూలమైన వ్యక్తిని వివాహం చేసుకోవాలని.

వేదాలు మనకు చక్కని దిశానిర్దేశం చేశాయి. కాని ధర్మశాస్త్రాలను గుప్పిట్లో పెట్టుకొన్న కొందరు అదే శాస్త్రం పేరుతో సమాజాన్ని పక్కదారి పట్టించారు. ఇది క్షమించరాని నేరం.

25 సంవత్సరాలకు పురుషుడు, 16 సంవత్సరాలకు స్త్రీలు పూర్ణ యవ్వన వంతులవుతారని, అది వివాహానికి సరైన సమయమని వేల సంవత్సరాలకు పూర్వం చరక సుశ్రుతాది మహర్షులన్నారు.

మహిళలకు మహోపకారం చేసిన మహర్షి మనువు. ఎలాగంటే-

**త్రీణి వర్షాణ్యు దీక్షేత కుమారీరుతు మతీ సతీ!**
**ఊర్ధ్వంతు కాలాదే తస్మాద్ విందేత సంధృశం పతిమ్!!**



అన్నాడాయన. అనగా కన్య రజస్వలయిన మూడేళ్ల తరువాత వివాహం చేసుకోవాలి. ఈ ప్రమాణాల ద్వారా బాల్య వివాహాలు వేద సమ్మతం కాదని ఖచ్చితంగా తెలుస్తుంది. ఇవి ప్రగతి నిరోధక చర్యలుగా ఏనాడో మన పెద్దలు ఉపదేశించారని మనం గుర్తించాలి.

1937 సంవత్సరంలో ఆంగ్లేయుల పాలనలో కేంద్ర విధానపరిషత్‌లో 'హర విలాస్ శారద' పేరిట బాల్య వివాహాలను నిరోధించే చట్టం చేయించారు. దీన్నే శారదా చట్టంగా వ్యవహరిస్తారు. దీనివలన భారత జాతికి కొంత మేలు జరిగింది.

వేదాలు ఏనాడో నిషేధించిన బాల్య వివాహాలను సంప్రదాయమనే పేరుతో ఇప్పటికీ మారుమూల గ్రామాల్లో జరిపిస్తున్నారు. అదేమని ప్రశ్నిస్తే అది మా కులాచారమనీ, మతాచారమనీ వాదిస్తున్నారు. యుక్త వయస్సు వచ్చిన స్త్రీ పురుషులకు వివాహం జరిగితే ప్రయోజనం వుంటుంది కాని చిన్న పిల్లలకు జరిగితే కాదు. వారికి కలిగే సంతానమూ అనారోగ్యంగా, బలహీనంగా పుట్టి నిత్యం వ్యాధులతో బాధపడుతుంది.

వైద్యశాస్త్రాన్ని అనుసరించినా, విజ్ఞాన శాస్త్రాన్ని విశ్వసించినా, వేదాన్ని అంగీకరించినా, రాజ్యాంగ సూత్రాలను పరిగణనలోకి తీసుకున్నా బాల్యవివాహాలు నిషిద్ధం. యుక్తవయసులో చేయడం సమంజసం.

**సర్వే భవంతు సుఖినః**

---

# చతుర కత

**జి**గురుమూర్తి అని పిలువబడే జి. గురుమూర్తి నాకు మిత్రుడు అని చెప్పలేను కాని పరిచయస్థుడు అని మాత్రం చెప్పగలను. జిల్లా పరిషత్తు కార్యాలయంలో కవర్లకు జిగురు అంటించే చిరుద్యోగిగా జీవితం ప్రారంభించి ఆఫీస్ సూపరింటెండెంట్ స్థాయికి ఎదిగి ముప్పది ఐదేళ్లు పనిచేసి పదవీ విరమణ చేసేడు. తను కొత్తగా కట్టుకున్న ఇంటికి కరెంటు వేయించుకుందామని సంబంధిత పత్రాలను విద్యుచ్ఛక్తి కార్యాలయంలో సమర్పించి అలా తిరుగుతూనే ఉన్నాడు.

ఒకనాడు ఒక లైన్ ఇన్‌స్పెక్టర్ వచ్చి "రెండు వేలు ఖర్చులకింద అవుతాయి" అని అన్నాడు.

"నేను లంచం ఎందుకివ్వాలి? ఇవ్వనుగాక ఇవ్వను!" అన్నాడు జిగురుమూర్తి.

"లంచం అని ఎవరన్నారండీ? ఖర్చులు" అన్నాడు లైన్ ఇన్‌స్పెక్టరు.

"అవ్వ పేరే ముసలమ్మయ్యా! అనాస పనాస అన్నా పైనాపిల్ అన్నా ఒక్కటే! లంచం అన్నా ఖర్చులన్నా ఒకటే!" అన్నాడు జిగురుమూర్తి.

శభాష్! నీతీ నిజాయితీగల ఉద్యోగి, రిటైరైనా సరే అలా ఉండాలి! ఇలాంటివాళ్లు నూటికొక్కడు- కాదు వెయ్యికి ఒక్కడున్నా చాలు- ఈ దేశం బాగుపడుతుంది.

"బాగా బుద్ధి చెప్పారండి జిగురుమూర్తిగారూ! ఎట్టి పరిస్థితుల్లోనూ లంచం ఇవ్వకండి. ఏదో మన పని అయిపోతుందని ఆఫీసుల చుట్టూ ఎంతకని తిరుగుతామని అలసత్వం కొద్దీ చాలా మంది డబ్బులిచ్చేస్తుంటారు. మీరు ఇస్తున్నారు గనుక మేం పుచ్చుకుంటాం అని వాళ్లంటారు. వాళ్లడుగుతున్నారు గనుక మేం ఇచ్చుకుం

# పదండి ముందుకు!



టున్నాం అని ఇస్తున్న వాళ్లం టారు. ఇద్దరూ అవినీతిని ప్రోత్స హిస్తున్నవాళ్లే! మీలాంటివాళ్లు వెయ్యిమందికి ఒక్కడుంటే చాలు! అవినీతిని అంతం చెయ్యొచ్చు" అని జిగురుమూర్తిని ప్రశంసించాను.

"ఇంకో వారంలోగా కరంటు కనక్షన్ ఇవ్వకపోతే ఎసిబి అధి కార్లకి తెలియజేస్తాను" అన్నాడు జిగురుమూర్తి.

"తప్పకుండా అలాగే చేయండి. ఎట్టి పరిస్థితుల్లోనూ లంచం ఇవ్వకండి" అని ప్రోత్స హించేను.

వారంరోజులైనా కనక్షన్ రాలే దని జిగురుమూర్తి ఫోన్ ద్వారా తెలియజేసేడు.

"అవినీతి నిరోధకశాఖ అధికా ర్లకి తెలియజేయడమే సరైన మార్గం. పదండి ముందుకు!" అన్నాను మహాకవి శ్రీశ్రీ లాగ.

'ఎసిబి వలలో కరంటు ఉద్యోగి' అనే సంచలన వార్తలు పత్రికల ద్వారాను, ఎలక్ట్రానిక్ మాధ్యమాల ద్వారాను త్వరలోనే చూడబోతున్నాననే ఉత్సుకతతో ఎదురు చూస్తున్నాను.

పదిహేను రోజులైనా ఏ వార్తా లేదు.

జిగురుమూర్తి నే చెప్పిన సలహా పాటించబో తున్నాడో లేదో తెలుసుకుందామని ఒకనాటి సాయంకాలం వాళ్లింటికి వెళ్లేను. ఇంట్లో లైట్లు వెలుగుతున్నాయి.

"రండి, కూర్చోండి" అని సాదరంగా ఆహ్వానిం చేడాయన.

"అయితే మీరు ఆమ్యామ్యా ఇవ్వకుండానే కరంటు వచ్చేసిందన్నమాట. మీరు బెదిరించే స రికి దెబ్బకు దెయ్యం జడిసింది!" అన్నాను.

"లేదండీ! ప్రతి పురుషుని విజయం వెనుకా ఒక స్త్రీ ఉంటుందనే సూక్తి ప్రకారం మా శ్రీమతి సలహా పాటించేను" అన్నాడాయన.

"మంచిదే! మీ శ్రీమతికి మీరింత గౌరవం ఇస్తున్నారంటే మీ ఆదర్శ దంపతుల జంటను అభినందించాల్సిందే! అదే ఏ టీవీ వాళ్లో అయితే ఇద్దరికీ పట్టుబట్టలున్న ఓ గిఫ్ట్ హాంపరో ఇచ్చే వారు!" అన్నాను.

"అబ్బే అదేం లేదండీ! మా శ్రీమతి ఇచ్చిన సలహా ఏంటంటే- మనం ఇప్పుడున్న ఇల్లు, స్కూల్ మేస్టర్లకి బదిలీలు పదోన్నతుల ఉత్త ర్వులు జారీ చేసినప్పుడు సంపాదించిన సొమ్ముతో కట్టిందే కదండీ! ఆ కరంటు ఉద్యోగికి రెండువేలూ పారెద్దురూ! అని" అన్నాడాయన.

కరంటు ఉద్యోగిగా రిటైరైన నాకు లైవ్‌వైర్ ముట్టుకోకుండానే కరంటు షాక్ తగిలింది!

**-బులుసు-జీ-ప్రకాష్**



# కాలాతీతం

ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక



# ఫాదర్స్ అండ్ సన్స్

పందొమ్మిదవ శతాబ్ది ప్రథమార్ధం లోని తరాల అంతరాన్ని ప్రతిభావంతంగా చిత్రించిన నవలయిది. తండ్రులు ఉదార వాదులు. లేదా సంస్కరణాభిలాషులు. పిల్లల్లో మాత్రం నిహిలిజం (శూన్యవాదం) బీజాలు నాటుకుంటున్న కాలమది.

నికొలాయ్ పెత్రోవిచ్ కిర్సానొవ్ పెద్ద భూస్వామి. రెండువందలమంది అర్ధబానిసల(సెర్ఫ్‌ల)కు యజమాని. కాని సంపదతో పాటు సంస్కారం కూడా ఉండటం వల్ల అందరూ అతణ్ణి గౌరవిస్తారు. బానిస విధానానికి బద్ధవ్యతిరేకి అయిన నికొలాయ్ మనుషుల మధ్య ఉచ్చనీచాలను అంగీకరించడు. సమాజంలో వస్తున్న మార్పులను అర్థం చేసుకోగల విజ్ఞత అతనికున్నది. కొంతమంది అతణ్ణి రాడికల్ (అతివాది) అని కూడా అంటారు. తన ఎస్టేట్‌లోని సెర్ఫ్‌లకు విముక్తి ప్రసాదించి, ప్రస్తుతం కౌలుదార్లవద్ద అద్దెలు వసూలు చేసుకోలేక కాస్త ఆర్థిక యిబ్బందుల్లో వున్నాడు నికొలాయ్. కొన్నాళ్లక్రితం భార్య మరణించడంతో, ఒక కూలీ పిల్ల ఫేనెచ్కాతో కలిసివుంటున్నాడు. ఒక కొడుకు కూడా పుట్టాడు యిటీవలే. ఆమెను వివాహం చేసుకోవటానిక్కూడా అతడు సిద్ధమే గాని, పరువు మంట కలుస్తుందని, బంధువుల్లో ముఖ్యంగా అన్న పావెల్ బాధపడతాడని ఆ ప్రయత్నం విరమించుకున్నాడు. పెద్దకొడుకు అర్కాదియ్ తండ్రి సుగుణాల్ని అందిపుచ్చుకున్న ఇరవైఏళ్ల యువకుడు.

1859 మే నెలలో, యూనివర్శిటీలో గ్రాడ్యుయేషన్ పూర్తిచేసుకుని మిత్రుడు యెవ్‌గెని వసీల్యెవిచ్ బజారొవ్‌తో కలసి యింటికొచ్చాడు అర్కాదియ్. బజారొవ్ వైద్య విద్యార్థి. ఆలోచనల్లో నిహిలిస్టు. అంటే ఏ విలువల్నీ అంగీకరించడు. "సెంటిమెంటనేది వట్టి బోగస్, నాకు దేన్ని గురించీ భ్రమలు లేవు" అంటాడు. ప్రముఖ రష్యన్ రచయిత పుష్కిన్ సాహిత్యం, దేశభక్తి, రాజకీయాలు, ఉదారవాదం, ప్రకృతి ఆరాధన, ప్రేమ-అలా దేన్నైనా ఎద్దేవా చేస్తాడు. అయితే ఆలోచనలకన్నా ఆచరణ ముఖ్యమని మాత్రం అంగీకరిస్తాడు. అతని ప్రతి మాటలోనూ, అసమానతలపట్ల, రష్యన్ వర్గ వ్యవస్థపట్ల కోపం ప్రతిధ్వనిస్తుంది. "కాలం చెల్లిన భూస్వామ్యం నశిస్తే తప్ప కొత్త సమాజం ఆవిర్భవించదు" అంటాడు. ఈ అనుకోని అతిథివల్ల యింటివాళ్లు చాలా యిబ్బం

దులు పడతారు. అయితేనేం, అర్కాది య్‌కు అతడు ఆరాధ్యుడు. ఫేనెచ్కాకూ, చంటిపిల్లాడికి మాత్రం మంచి మిత్రుడు.

పావెల్ రహస్యంగా ఫేనెచ్కామీద కన్నే స్తాడు. పశ్చిమదేశాల సంస్కృతిని జీర్ణించు కోవటం వల్ల సుఖలాలసత కూడా పెరి గింది. సహజంగానే బజారొవ్ రాడికల్ భావాలతడికి నచ్చవు. అవకాశం దొరికిన ప్పుడల్లా ఇద్దరూ ఒకర్నొకరు కాస్త ఘాటు గానే విమర్శించుకుంటారు.

తన అతిథి ఎక్కడ బాధపడతాడోనని నికొలాయ్‌కు బెంగ.

అక్కడికి అరవై మైళ్ల దూరంలో ఉన్న తన తల్లిదండ్రులను చూసి వస్తానంటాడు బజారొవ్. మిత్రుణ్ణి విడిచి వుండలేని అర్కాదియ్ కూడా వెంట బయల్దేరుతాడు.

అదో చిన్న నగరం. ఒకనాడు గవర్నర్ యిచ్చిన విందులో అన్నా ఒదిన్‌త్సోవాను కలుస్తాడు అర్కాదియ్ బజారొవ్. 'నిహిలిజం' గురించి విన్న అన్నా, అతణ్ణి తన యింటికి తీసుకురమ్మని అర్థిస్తుంది.




అతడి విప్లవ భావాలు ఆమెలో అశాంతి సృష్టి స్తాయి. అక్కడే అన్నా చె ల్లెలు కాత్యా కూడా పరిచయ మవుతుంది.

అన్నా చాలా సంపన్ను రాలు. ఎన్నివేలమంది కష్టఫలాన్ని ఈమె అనుభవిస్తున్నది? ఆ జీవిత పద్ధతినే అస హ్యించుకుంటాడు బజారొవ్. అయితే ప్రేమతత్వాన్ని అర్థం చేసుకోవడం అసం భవం. తనకు తెలియకుండానే అన్నాను గాఢంగా యిష్టపడతాడు బజారొవ్. అర్కా దియ్ మనసు నొచ్చుకుంటాడు. ఆప్తమి త్రునికి కూడా తను ప్రేమించిన అమ్మాయే కావాలా? నిజానికి కాత్యా అతణ్ణి యిష్టప డుతుంది. కాని ఆమె వైపైనా చూడడు అర్కాదియ్.

బజారొవ్ కూడా అన్నాను ఆకర్షించిన మాట నిజమే. కాని ఆమె తమ పరిచ యాన్ని కేవలం స్నేహంగా మాత్రమే పరి గణిస్తుంది.

స్నేహితుల మధ్య ఎడం పెరిగింది. అర్కాదియ్ మీద బజారొవ్ ఆలోచనల ప్రభావం తగ్గింది.

చాలారోజుల తర్వాత తల్లిదండ్రులను చూసినందుకు బజారొవ్ సంతోషించాడు. కాని తననింకా చిన్నపిల్లాణ్ణి చేసి వాళ్లు చూపిన ముద్దూ మురిపెం విసుగు తెప్పిం చింది. వాదోపవాదాలెన్ని చేసినా అర్కాది య్ తండ్రీ, పెదనాన్నా మెరుగు. అన్నా జ్ఞాపకం మాత్రం యింకా తనకు నిద్రలే కుండా చేస్తున్నది.

అక్కడ నికొలాయ్ మంచితనమే అతని పట్ల శాపంగా మారింది. కొద్దిగా తనకోసం వుంచుకొని, మిగతా పొలమంతా బానిస లకిచ్చేశాడు. ఆదాయం లేదు. పైకి చెప్పుకోలేడు గాని ఇల్లు గడవటం కష్టంగా వుంది. ఈ యిక్క ట్లన్నీ సరిపోనట్టుగా పావెల్, బజారొవ్‌ల మధ్య నిత్యం మాటల తూటాలు పేలుతూనే వున్నాయి. 'నిహిలిస్టు' భావాలతో అంగీకరించినా, లేకపోయినా యింటికొచ్చిన అతిథిని అవమానించట మెందుకు? పోనీ, అతడైనా, వయసులో పెద్దవాడైనా తన అన్నపట్ల కాస్త మర్యా దగా వుండొచ్చుగదా? ఒకసారి ఫేనె చ్కాతో మాయమాటలు చెబుతున్న పావెల్‌ను చూసి, కోపం అణుచుకోలేని బజారొవ్ అతణ్ణి "డ్యుయెల్"కు ఛాలెంజి చేస్తాడు.

ఇద్దరూ పిస్తోళ్లతో తలపడాలి. పావెల్

# ఇవాన్ తుర్గెనేవ్ (1818-1883)

ఇవాన్ తుర్గెనేవ్ తల్లిదండ్రులు రాజ వంశీకులు. తల్లి చాలా పెద్ద ఎస్టేట్‌కు యజమానురాలు. తన వద్ద వున్న వంద లాదిమంది సెర్ఫ్(అర్ధబానిస)లను జంతు వులకన్నా హీనంగా చూసేదావిడ. ఈ అమానుషత్వాన్ని భరించలేని ఇవాన్‌కు ఇల్లు నరకప్రాయమైంది. 'మొత్తం మీద చదువే నన్ను రక్షించింది' అని రాసుకు న్నాడు. మొదట మాస్కోలోనూ, తరు వాత సెయింట్ పీటర్స్‌బర్గ్, బెర్లిన్‌లలో విద్యాభ్యాసం కొనసాగింది. యూరోపి యన్ సంస్కృతితో బాగా ప్రభావితుడై తిరిగి వచ్చి, ఇరవైమూడో ఏట ప్రభుత్వో ద్యోగంలో చేరి తల్లి ఇష్టానికి వ్యతిరేకంగా రచనా జీవితాన్ని ప్రారంభించాడు.

తుర్గెనేవ్ ఆజన్మ బ్రహ్మచారి. చిన్నత నంలో చూసిన బానిస విధానం మీద ఏవ గింపు కలిగింది. తల్లిమీద తిరుగుబాటు ప్రకటించి, ఒక బానిస బాలికతో సంబంధం పెట్టుకుని, ఆమెకు పుట్టిన కూతురికి చదువు చెప్పించి పెళ్లి కూడా చేసాడు. పారిస్‌లో ఉన్న కాలంలో ప్రఖ్యాత ఫ్రెంచ్ రచయిత గుస్తాఫ్ ఫ్లోబేర్(మదాం బావరీ రచయిత)తో స్నేహం చేసిన తుర్గెనేవ్ తొలిసారిగా, 1852లో ప్రచురించిన 'ఎ స్పోర్ట్స్ మాన్స్ స్కెచెస్'తో రచయితగా గుర్తింపు తెచ్చుకు న్నాడు. ఇందులో సెర్ఫ్‌ల జీవితాలను

కూడా తక్కువేమీ తినలేదు. వయసు మళ్లినా గురి బాగేనే వుంది. తప్పించుకో గల నేర్పూ వుంది. డ్యుయెల్‌లో చిన్న గాయం మాత్రమే అవుతుంది. బజారొవ్ అతడికి వైద్యసాయం కూడా అందిస్తాడు. మనుషుల మధ్య సంబంధాలింత దిగజారి నందుకు నికొలాయ్ చాలా మనస్తాపం చెందుతాడు.

గాయం నుండి కోలుకుంటున్న దశలో పావెల్ తన తొందరపాటుకు పశ్చాత్తాపడ తాడు. కొన్నేళ్లక్రితం తానూ ఒక స్త్రీని ప్రేమించి, పెళ్లి చేసుకొనే ధైర్యం లేక పోగొట్టుకున్నాడు. ఆ బాధనుండి తనింకా కోలుకోలేదు. నికొలాయ్ కూడా ఫెనే చ్కాను దూరం చేసుకునే ప్రమాదం లేక పోలేదు. త్వరగా ఆ అమ్మాయిని పెళ్లి చేసుకొమ్మని తమ్ముడికి సలహా యిస్తాడు.

"అన్నా ఎవర్నీ ప్రేమించదు. కాని తనను యిష్టపడిన కాత్యానెందుకు చేసుకో కూడదు? " అనుకుంటాడు అర్కాదియ్. ఒకనాడు వెళ్లి ప్రపోజ్ చేస్తాడు. ఆమె వెంటనే అంగీకరిస్తుంది. ఈ పరిణా మంలో అతడు బజారొవ్ ఆలోచనా విధానంతో తెగదెంపులు చేసుకున్నట్టే. అవును తను 'నిహిలిస్టు' కాడు. మరికొన్నా ళ్లకు తండ్రిలాగే తయారవుతాడు. మంచి భూస్వామి. మంచి భర్త. మంచి పౌరుడు. ప్రగతిశీల భావాలంటే యిష్టం. కాని అనుకున్నవన్నీ ఆచరణలో పెట్టలేడు. అదే బజారొవ్‌కూ తనకూ వున్న ముఖ్య మైన తేడా.

ఆతిథ్యమిచ్చిన నికొలాయ్ కుటుంబానికీ, మరీ ముఖ్యంగా తన మిత్రునికీ కృతజ్ఞ తలు చెప్పి శెలవు తీసుకుంటాడు బజా రొవ్. అన్నా జ్ఞాపకాలింకా తిరగబెడు తూనే వున్నాయి. కాని సెంటిమెంట్లను నమ్మని తనకు ప్రేమేమిటి? తన స్వగ్రా

అత్యంత వాస్తవికంగా చిత్రించటంతో వివాదం కూడా చెలరేగింది. దీనికితోడు, గొగోల్ (మృతజీవుల రచయిత) మరణించినప్పుడు రాసిన సంతాప వ్యాసం (ఆబిట్యుయరీ) ప్రభుత్వానికి కోపం తెప్పించింది. శిక్షగా 18 నెలలపాటు అతణ్ణి తన ఎస్టేట్‌కు వెళ్లకుండా నిషేధం విధించారు.

1855 నాటి రూడిన్, ఎ నెస్ట్ ఆఫ్ జెంటిల్‌ఫోక్ (1858)లతో తుర్గెనేవ్ ఖ్యాతి మరింత విస్తరించింది. పందొమ్మిదవ శతాబ్ది ప్రపంచ సాహిత్యంలోనే అనర్ఘరత్నంగా భాసిల్లే నవల 'ఫాదర్స్ అండ్ సన్స్' 1862లో 'ది రష్యన్ మెసెంజర్' పత్రికలో సీరియల్‌గా ప్రారంభమైంది. 'ఏ అధికారాన్ని, విలువల్ని అంగీకరించని ఒక తాత్విక ధోరణి' అయిన 'నిహిలిజం' అనే పదానికి ప్రాచుర్యం వచ్చింది ఈ నవలతోనే.

బానిస విధానంలోని అమానుషత్వాన్ని కళ్లకుకట్టినట్టుగా చూపిన ఈ నవలను రష్యన్ 'అంకుల్ టామ్స్ కేబిన్' అంటారు.

ప్రపంచవ్యాప్తంగా అనేకమంది రచయితలను ప్రభావితం చేసిన ఈ నవల గురించి చెహోవ్ ఇలా రాసాడు- "ఫాదర్స్ అండ్ సన్స్ ఒక అద్భుతమైన నవల. బజారోవ్ (కథా నాయకుడు) వ్యాధి ఎంత నేర్పుతో వర్ణించబడిందంటే, అది చదివినప్పుడు నాకు నీరసం వచ్చింది. ఆ వ్యాధి అతని నుండి నాకు సోకిందా అనిపించింది. ఇక బజారోవ్ మరణం గురించి ఎలా అర్థం చేసుకోవాలి? అతని వృద్ధ తల్లిదండ్రుల సంగతేమిటి? ఇంత ప్రతిభావంతంగా రాయడం ఒక్క తుర్గెనేవ్‌కే సాధ్యం". అతడి ఇతర నవలలు: స్మోక్; వర్జిన్ సాయిల్.

మానికి తిరిగి వెడతాడు. తండ్రికి డాక్టరుగా ప్రాక్టీసు బాగానే వుంది. అక్కడే మెడికల్ అసిస్టెంట్‌గా కాలం వెళ్లబుచ్చితే సరి. సమాజ వ్యవస్థ గురించి, ఆర్థిక అసమానతలు, బానిస విధానం గురించి దేశంలో తీవ్రమైన చర్చ జరుగుతున్నది. కొత్త కొత్త ఉద్యమాలు కూడా పుట్టుకొస్తున్నాయి. ప్రజలు తమ భవిష్యత్తు తమే నిర్ణయించుకునే రోజు త్వరలో వస్తుంది.

ఆ ప్రాంతంలో విషజ్వరాలు (టైఫస్) బాగా ప్రబలాయని తెలిసి వైద్య విద్యార్థిగా తనకు చేతనైన సాయం చేయాలనుకుంటాడు బజారొవ్. తండ్రి వద్దకు వచ్చే రోగుల సంఖ్య రోజు రోజుకూ పెరిగింది. ఒకనాడు జ్వరంతో మరణించిన వ్యక్తికి పోస్ట్ మార్టం చేస్తున్నప్పుడు స్కాల్పెల్ జారి వేలు తెగుతుంది. అవన్నీ అంటువ్యాధులు. బజారొవ్ కూడా మంచాన పడతాడు. అతడి తండ్రి ఎప్పుడో ఆర్మీ డాక్టరుగా పనిచేసి రిటైరయ్యాడు. ఆధునిక వైద్య పద్ధతులతో పరిచయం లేదు. అందువల్ల తెలిసిన చికిత్స ఎంత చేసినా వ్యాధి తగ్గదు. సరికదా, మరింత ముదురుతుంది.

తనింక ఎక్కువ రోజులు బతకనని తెలుసుకుంటాడు బజారొవ్. త్వరలో కోమాలోకి వెళ్లిపోతానని కూడా తెలుసు. అన్నాకు కబురుపెట్టమని తండ్రి నడుగుతాడు. ఆమె హుటాహుటిన ఒక జర్మన్ డాక్టరును వెంటబెట్టుకుని వస్తుంది. అయితే ఆ పరిస్థితిలో ఎవ్వరూ చెయ్యగలిగిందేమీ లేదు.

అన్నా అతడి మంచం మీద కూర్చుని, లోకంలో వెలుగులు నింపాల్సిన ఒక దీపం యింత త్వరగా కొడిగట్టి పోతున్నందుకు కన్నీళ్లు కారుస్తుంది. బజారొవ్‌లో యింకా ఆత్మవిశ్వాసం తగ్గలేదు. శ్వాస ఉన్నంత వరకూ పోరాడటమే మనిషి కర్త

వ్యమంటాడు. దేశంలో ఎన్ని సమస్యలు న్నాయి? ఎన్ని లక్షల, కోట్ల మంది, ఎన్ని తరాలు నిరంతర పోరాటం చేస్తే అవి తీరేను! కళ్ళు మూతలు పడుతున్నాయి. ఇక అంతా నిద్రే.

"ఇంతవరకూ నిన్ను ముద్దు పెట్టుకో లేదు అన్నా" అంటాడు. ఆమె వంగి, అతడి నుదురు చుంబిస్తుంది.

"ఈ జీవితానికిది చాలు. ఇక అంతా చీకటే" అంటున్నప్పుడు తల పక్కకు వాలు తుంది. అవే అతని చివరి మాటలు.

ఆరు నెలల తర్వాత నికొలాయ్, ఫేనె చ్కాలకూ; అర్కాదియ్, కాత్యాలకూ వివాహం జరుగుతుంది. పావెల్ జర్మనీ లోని డ్రెస్డెన్ నగరంలో తన ఒంటరి జీవితం కొనసాగించాలనుకుంటాడు.

అందరి జీవితాలపైనా చెరగని ముద్ర వేసిన బజారొవ్ గురించి మాట్లాడటానికి మాత్రం ఎవరూ సాహసించరు.

"బజారొవ్ జ్ఞాపకార్థం" అంటూ తన గ్లాసు ఎత్తి పట్టుకుని కాత్యా టోస్ట్ ప్రపోజ్ చేస్తుంది.

కథ సుఖాంతమే. లోకంలో ఎన్ని ఉత్పాతాలు వచ్చినా, ఎన్ని మార్పులు జరిగినా, మనుషులు ఎవరి చీకటి గదుల్లో వాళ్ళు తమ జీవితాలు గడుపుతూనే ఉంటారు.

మళ్లీ వసంతం వస్తుంది. బజారొవ్ సమాధి మీద పచ్చగడ్డి మొలుస్తుంది.

ఈ నవల వెలువడినప్పుడు, బజారొవ్ వంటి విప్లవకారుడి జీవితాన్ని 'కారికేచర్' చేశాడని వేలాదిమంది పాఠకులు తుర్గెనేవ్‌ను ఘాటుగా విమర్శించారు. 'తిరుగుబాట్లు మూర్ఖుల పని' అని చెప్పినందుకు సాంప్రదాయిక వాదులు ప్రశంసించారు.

"బజారొవ్‌ను సమర్థించకపోవటమే నేను చేసిన నేరమా? వ్యక్తులలో అనేక పార్శ్వాలుంటాయి. నా పని జీవితాన్ని యథాతథంగా చిత్రించటమే"... అంటూ బదులిచ్చాడు తుర్గెనేవ్.

-ఎం.వసంత

# ఆడపిల్ల తండ్రి!

టా 4 క్ బండ్ కథలు

**ఎనిమిదో నెంబర్ బస్ ట్యాంక్‌బండ్ మీదుగా సికింద్రాబాద్ వెళ్తోంది. కిటికీ పక్కన కూర్చుని బయటకు చూస్తున్న గోపాలం ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాడు..**

**బుద్ధిమంతులు అనుకున్న పిల్లలే ఇలా చేస్తే ఇంకెవర్ని నమ్మాలి? ఇది తెలిస్తే రాఘవ దంపతులు ఎంత తల్లడిల్లిపోతారో? కూతురిపైనే పంచప్రాణాలు పెట్టుకు బతుకుతున్నారు వాళ్లు..**




ఎనిమిదో నెంబర్ సిటీబస్ ట్యాంక్ బండ్ మీదుగా సికింద్రాబాద్ వెళ్తోంది. కిటికీ పక్కన కూర్చుని బయటకు చూస్తున్న గోపాలం ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాడు..

బస్సు పక్కనే వేగంగా వెళ్తున్న మోబైక్ మీద నవ్వుతూ తుళ్లుతున్న జంటను చూసి అతను షాక్ తిన్నాడు.

ఆమె.. ఆమె.. రవళి కదూ?

ఇదేంటి? రవళిని ఆ అబ్బాయెవరో బండెక్కించుకుని తీసుకువెళ్తున్నాడు? ఏం జోకు పేల్చాడోగానీ అతని నడుం వాటేసుకుని కూర్చున్న ఆమె పడిపడి నవ్వుతోంది! ఇంతకీ అతనెవరు?

గోపాలం ఆలోచనల నుంచి తేరుకునే



లోపే- మోబైక్ సిటీబస్‌ను దాటేసి దూసుకుపోయింది.

రవళి ఎవరో కాదు.. గోపాలం కొలీగ్ రాఘవ కూతురు. రాజేంద్రనగర్ అగ్రికల్చరల్ యూనివర్సిటీలో పీజీ చేస్తోంది. ఇరుగుపొరుగు ఇళ్లే కావడంతో రెండు కుటుంబాల మధ్యా సాన్నిహిత్యమూ ఎక్కువే. రవళి గోపాలాన్ని 'అంకుల్.. అంకుల్' అని పిలుస్తుంది. చదువుల్లోనూ ఆటల్లోనూ ఫస్టుండే ఆమె అంటే అతనికి అభిమానం. అక్కలా అన్నింట్లో ముందుండాలని తనకూతురు శ్రావణికి చెబుతుంటాడు. కానీ..

**ఆటో తోటల్ని దాటుతోంది.. లైటు వెలుగు పడని ఈత పొదలు.. చెట్లు చీకట్లో భూతాల్లా కన్పిస్తున్నాయి..**

బుద్ధిమంతులు అనుకున్న పిల్లలే ఇలా చేస్తే ఇంకెవర్ని నమ్మాలి? ఇది తెలిస్తే రాఘవ దంపతులు ఎంత తల్లడిల్లిపోతారో? కూతురిపైనే పంచప్రాణాలు పెట్టుకు బతుకుతున్నారు వాళ్లు..

గోపాలం ఆలోచనలు పరిపరి విధాలుగా సాగుతున్నాయి. కళ్లముందు రకరకాల దృశ్యాలు.. ఇంట్లో చెప్పాపెట్టకుండా రవళి ఆ అబ్బాయితో లేచిపోయినట్లు.. ఆ అవమానాన్ని తట్టుకోలేక రాఘవ దంపతులు ఉరేసుకున్నట్లు.. రవళివచ్చి మృతదేహాల మీద పడి గోడుగోడున రోదిస్తున్నట్లు..

ఆలోచనలకు అడ్డుకట్టవేయాలని గట్టిగా తల విదిలించాడు గోపాలం.

సికింద్రాబాద్ రైల్వేస్టేషన్ వద్ద బస్‌దిగి లోపలకి నడిచాడు గోపాలం. తను రోజూ లోకల్ ఎక్కేది అక్కడే. లోకల్‌ప్లాట్‌ఫాం మీదకు వెళ్లేసరికి మళ్లీ అదే జంట అక్కడ దర్శనమిచ్చింది. అసలే అందమైన పిల్ల.. బ్లూజీన్స్ మీద బ్లాక్ ప్రింట్ చేసిన కనకాంబరం రంగు టీషర్ట్ వేసేసరికి మరింత ఆకర్షణీయంగా కన్పిస్తోంది. కానీ వాళ్లు అటువైపు తిరిగి కోక్‌తాగుతున్నారు. అతను బాగా నవ్విస్తాడు కాబోలు.. భుజాలు కదిలిపోయేలా తను నవ్వుతోంది.. అదిచూసి గోపాలానికి అరికాలి మంట నెత్తికెక్కింది. ఇంకెప్పుడూ శ్రావణిని అక్కలా ఉండమని చెప్పను అని తన లోతానే గొణుక్కున్నాడు.

అల్లంత దూరంలో నిలబడి వారినే గమనిస్తున్న గోపాలం లోకల్ రావడంతో చరచరా తన ఎదురుగా ఉన్న బోగీలోకి ఎక్కేశాడు. రవళి ముందు బోగీలో ఎక్కినట్లుంది.

రైలు దిగాక ఇల్లుచేరాలంటే సుమారు కిలోమీటర్‌పైనే నడవాలి. రెండు తోటలు దాటాలి. అసలే శీతాకాలం పొద్దు... ఆరింటికే చీకటి పడిపోతోంది.. ఆ తోటలవద్దకు వచ్చేసరికి నిర్మానుష్యంగా ఉంటుంది. అడపాదడపా వచ్చే ఆటోలు, సైకిళ్లు తప్ప మరేవీ కన్పించవు. ఇంతకుముందు రైలు దిగాక ఆమె కనబడితే 'హాయ్ రవళి' అని పలకరించి వెంటతీసుకు వెళ్లేవాడు గోపాలం. ఇవ్వాళ ఎందుకో అలా చేయాలని అన్పించలేదు. తనదారిన తాను ఆటో మాట్లాడుకుని ఎక్కేశాడు.

రవళి గోపాలాన్ని చూడలేదు కనుక తనబ్యాగ్ వీపుకు తగిలించుకుని గబగబముందు నడుస్తోంది.. గోపాలం ఆటో ఆమెను దాటి రయ్యిన వెళ్లిపోయింది. చీకటి కనుక ఆటోలో ఎవరున్నదీ ఆమెకు కన్పించే అవకాశమే లేదు..

ఆటో తోటల్ని దాటుతోంది.. లైటు వెలుగు పడని ఈత పొదలు.. చెట్లు చీకట్లో భూతాల్లా కన్పిస్తున్నాయి..

ఇంత చీకట్లో పాపం రవళి ఒక్కర్తీ నడు

చుకుంటూ రావాలి కదా? అన్పించింది గోపాలనికి. మళ్లీ అంతలోనే వస్తే రానీ నాకేంటి? అమ్మాఅబ్బా కన్నుగప్పి అబ్బాయిల్తో తిరిగే అమ్మాయికి చీకటైతేనేంటి? మరేమైతేనేంటి? అయినా ఎవరెలాపోతే నాకేంటి? నా కూతురా.. నా చుట్టమా అని మనసులోనే గట్టిగా అనుకున్నాడతను.

ఆటో రెండోతోట దాటుతుండగా ఓ నలుగురు కుర్రాళ్లు ఎదురయ్యారు. బాగా తాగిఉన్నారు కాబోలు.. బూతుపాటలు పాడుతూ రోడ్డుకు అడ్డదిడ్డంగా నడుస్తున్నారు. ఆటో డ్రైవర్ హారన్‌కొడితే బండబూతులు తిట్టారు. 'క్యారే హారన్ కైకూ మారా? హైరో.. హైరో' అంటూ రోడ్డుమీది రాయితీసి విసరబోతుండగా అతను తెలివిగా వారిని తప్పిస్తూ ఆటోను ముందుకు పరుగెత్తించాడు.



'ఈ తాగుబోతు నాయాళ్లతో పెద్ద పరేశానైతోంది సారూ.. ఈళ్లను అడిగేటోడు లేకండా పోయాడు' అన్నాడతను విసుగ్గా.

కానీ గోపాలం ఆలోచనలు రవళిచుట్టే తిరుగుతున్నాయి. ఈ తాగుబోతు వెధవలు పాపం ఆ పిల్లను ఏంచేస్తారోనన్న భయం అతని కళ్లలో దోబూచులాడుతోంది. అంతకు ముందు వరకూ ఆమెపై ఉన్న కోపం, తిరస్కారం మటుమాయమైంది. వీరిబారిన పడకుండా ఆమెను కాపాడు భగవంతుడా అని అతని మనసు మూగగా ప్రార్థిస్తోంది.

పాపం అమాయకురాలు.. ఈ నరమృగాల సంగతి తెలియక నడిచి వస్తోందే? ఇప్పుడెలా? అసలే పొద్దుపోయింది.. అందునా ఆడపిల్ల అదీ తన కొలీగ్ కూతురు అన్న ఆలోచన లేకుండా తనదారిన తాను ఆటో ఎక్కేశాడే? తనసలు మనిషేనా? ఒక ఆడపిల్ల తండ్రేనా? తనని తనే తిట్టుకున్నాడు.

'బాబూ ఆటో వెనక్కుతిప్పు' అని తను అనక ముందే ఆటోడ్రైవర్ బండిని రక్కున ఆపాడు.

'సార్ లోకల్‌లోంచి ఇందాక ఎవరో అమ్మాయిగారు దిగారు. కాలేజీ బ్యాగ్ వేసుకుని ఒంటరిగా నడిచొస్తున్నారు. ఈ చెత్త నాకొడుకులు తాగున్నారు.. ఒంటరి ఆడపిల్లని ఏంచేస్తారో? వెనక్కువెళ్లి ఆటో ఎక్కించుకొద్దాం సార్! ఎందుకంటే నేను ఓ ఆడపిల్ల తండ్రిని సార్.. మిమ్మల్ని ఇబ్బంది పెట్టాననుకుంటే మీరు నాకు కిరాయి కూడా ఇవ్వద్దుసార్' అంటూ తన జవాబుకోసం ఎదురుచూడకుండా సర్రున ఆటో వెనక్కుతిప్పాడు.

గోపాలం కళ్లలో నీళ్లు తిరిగాయి.

లోకంలో ఆడపిల్లల తండ్రులందరూ ఇలా ఒకేలా ఆలోచిస్తే ఎంత బాగుంటుందో అనుకున్నాతను. చీకటిని కోసుకుంటూ ఆటో పరుగుతీస్తోంది.

–చంద్రప్రతాప్

# చతుర ప్రవేశిక

## ఫిబ్రవరి 08

ఫిబ్రవరి 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. అన్నీ సరిగా రాసినవారికి ఆకర్షణీయమైన బహుమతులు లభిస్తాయి.. (ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. విజేతల ఎంపికలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. సంపాదకులదే తుదినిర్ణయం).

1. అనసూయమ్మ స్వగ్రామం పేరు?
2. విజయరామారావు ఇంటిపేరు?
3. అనసూయమ్మను అభిమానించిన క్రైస్తవ స్త్రీ?
4. సంజన, శంకరయ్య కలిసి ఎవరిని హత్యచేశారు?
5. అనసూయమ్మ ప్రారంభించిన సెంటర్?
6. అనసూయమ్మ కలుసుకున్న ముఖ్యమంత్రి?
7. దేవదానం రెండో భార్య పేరేంటి?
8. అనసూయమ్మకు భర్త తరపున ఎన్ని లక్షల డీడీ అందింది?
9. నవలలో శీలపరీక్షకు గురయ్యే పాత్ర ఏది?
10. శీల పరీక్షకు సంబంధించి నారాయణ ఓడితే కోల్పోయేదేమిటి?
11. ధర్నాలంటే ఆసక్తికల వ్యక్తి?
12. నిహిలిజం అనే పదం ఏ నవలతో ప్రాచుర్యంలోకి వచ్చింది?
13. బజరోవ్, అర్కాదియే ఎవరిని ఇష్టపడ్డారు?
14. మహర్షుల దృష్టిలో ఏ వయసుకు స్త్రీలు పూర్ణ యౌవనవతులు?
15. గోపాలం కూతురి పేరేమిటి?

---

పంపినవారి పేరు: ---------------------------------------- వయసు (   )

చిరునామా: ----------------------------------------

----------------------------------------

----------------------------------------

పిన్‌కోడ్:                    ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

✦ ప్రవేశికలు మాకు చేరాల్సిన చివరి తేదీ ఈనెల 20

# జనవరి విజేతలు వీరే!

జనవరి చతుర ప్రవేశికకు వచ్చిన అసంఖ్యాక స్పందనల్లో సరైన సమాధానాలు పంపి డ్రాలో విజేతలైన ఈ అయిదుగురికీ అభినందనలు. వీరికి త్వరలో బహుమతులు అందుతాయి.



1. **పి.విజయశ్రీ**, తణుకు
2. **సాయిప్రశాంతి**, ఆర్.కె.పురం, హైదరాబాద్
3. **టి.సాంబశివరావు**, మియాపూర్, హైదరాబాద్
4. **ఎన్. శేషఫణిశర్మ**, కర్నూలు 5. **పి.కృష్ణమూర్తి**, ఏలూరు



## అన్ని సమాధానాలు సరిగా పంపిన ఇతరులు:

1. తలకట్ల మహిపాల్ రెడ్డి, గాంధీనగర్, హైదరాబాద్ 2. సామంచి సుబ్బలక్ష్మి, లాసన్స్‌బే, విశాఖపట్నం 3. పి.శివనాగకుమారి, తెనాలి 4. ఆర్.సుధ, సైదాబాద్,. హైదరాబాద్ 5. కె.నారాయణరావు, బోరుభద్ర 6. వి.మంజుల, ఆత్మకూరు, నెల్లూరు జిల్లా 7. దామరాజు శంకరం, విజయనగరం 8. పి.సత్యవతి, గచ్చిబౌలి, హైదరాబాద్ 9. కె.ఎం.కె మూర్తి, గోపాలపురం, చెన్నై 10. వంగపల్లి అరుణ, నల్లకుంట, హైదరాబాద్ 11. బందా శ్రీనివాసరావు, కొత్తపేట, ఒంగోలు 12. ఎం. మైమూన్, వెలచేరి, చెన్నై 13. బి.రూపవతి, మధిర 14.ఎస్.కె.ఫాతిమా, తుని 15. కె.రాజశ్రీ, బ్రాడీపేట, గుంటూరు 16. పాలెపు సుధాకుమార్, చినవాల్తేర్, విశాఖపట్టణం 17. వి.వి.లక్ష్మి, నారాయణగూడ, హైదరాబాద్ 18. ఎస్. రాజరాజేశ్వరీదేవి, సరూర్‌నగర్, హైదరాబాద్ 19. కోండ్ర నాగరాజు, రఘునాథపాలెం 20. త్రిపురనేని నాగేంద్రమ్మ, ఖమ్మం 21. బి.గంగానాథ్, మౌలాలి, రంగారెడ్డి 22. బొగ్గవరపు శ్రీదేవి, చెల్లూరు 23. ఎం. కేశవనాయుడు, శ్రీహరినగర్, విశాఖపట్నం 24. ధరణికోట శ్రీలక్ష్మి శివరాంప్రసాద్, శివాజీనగర్, హైదరాబాద్ 25. తుమ్మల వసుంధరమ్మ, వాయల్పాడు 26. ఖస్పా లక్ష్మీపతిరావు, పద్మావతి నగర్, విజయనగరం 27. అంకే సునీల్‌కుమార్, గనిగెర, అనంతపురం జిల్లా 28. వి.వెంకటేశ్వరరావు, ఇంగ్లీష్‌పాలెం, మచిలీపట్నం 29. వి.దేవి, కంచరపాలెం, విశాఖపట్నం 30. వెల్చేరు సూర్యకుమారి, గుండ్లవారి స్ట్రీట్, విజయనగరం 31. కలియుగం హుమయూన్ సంఫీర్, గోపాల్‌పేట్, నిజామాబాద్ జిల్లా 32. ఎ.రాజ్యలక్ష్మీదేవి, నాచారం, హైదరాబాద్ 33. సిహెచ్.అంబాలా, దోమలగూడా, హైదరాబాద్ 34. గులుమూరు సత్యన్నారాయణ, బాలిగాం, శ్రీకాకుళం 35. జె.బి.పుష్పకుమారి, మదనపల్లి 36. కె.వి.ఆర్.ఆర్. రత్నకుమారి, ఎర్రమంజిల్ కాలనీ, హైదరాబాద్ 37. ఎస్.ఎన్.మాధవి, కోతిరాంపూర్, కరీంనగర్ 38. కాకరపర్తి పిచ్చిబాబు, చిలకలూరిపేట 39. వై.ఎస్.కిరణ్మయి, బృందావన్ నగర్, బెంగళూరు 40. కె.పద్మావతి, పార్శీగుట్ట, హైదరాబాద్ 41. పారుపల్లి వెంకటేశ్వర రావు, నల్లకుంట, హైదరాబాద్ 42 డా.అనిత, తార్నాక, సికింద్రాబాద్ 43 ఎస్.నీళాదేవి, మంచిర్యాల 44. కె.మధుసూదనరావు, నిజామాబాద్ 45. అద్దంకి శ్రీదేవి, కోదాడ 46.నెమలిదిన్నె రమణారెడ్డి, పోలవరం 47. ముమ్మిళ్ల వందన, హన్మకొండ 48. గుడిచుట్టు ప్రవీణ్, ఖమ్మం 49.కె.వి.దుర్గామోహనరావు, వనస్థలిపురం, హైదరాబాద్, 50. శిష్టా రాధాకృష్ణమూర్తి, విజయవాడ 51. నేమాన సుభాష్ చంద్రబోస్, శ్రీకాకుళం 52. అబ్దుల్ అజీజ్ పండిట్, పెద్ద మందడి, మహబూబ్‌నగర్ జిల్లా

## మధ్యతరగతి బతుకు చిత్రం

రూ. 100/- పొందిన సమీక్ష

**మ**ధ్యతరగతి అనేదాన్ని కోరలు లేని, పట్టుకున్న వారి ప్రాణం ఒకేసారి తీసి చంపేయ లేని, సరైన అవయవాల్ని చూడలేనంత వికారానికి మార్చుకున్న ఓ పెద్ద మాంసపు ముద్దలాంటి ఒళ్ళు జలదరించే రక్కసి అనుకోండి. అలాంటి రక్కసి కసికొద్దీ కౌగిలించుకుంటే అందులో పడి నలిగిపోయే మనిషి జీవితం ఎంత విలవిలలాడిపోతుందో, విడిపించుకోడానికి ప్రయత్నించి ఎంత అశక్తుడిగా మిగిలిపోతాడో, చివరికి చేతకానితనం కూడా దాడిచేసి ఆ సగటు మనిషి బతుకుని ఎందుకూ పనికిరాని 'అవశేషం'లా ఎలా మిగుల్చుతుందో ఈ నెల చతుర నవల అవశేషం కళ్ళకు కట్టినట్లు చూపించింది.




పాత్రల విషయానికొస్తే, ఇచ్చిన పాత్రకు నూరు శాతం న్యాయం చేస్తుంది కథలోని అభిమన్యు పాత్ర. నవల చివరకి కథలోని అభిమన్యు పాత్ర చిన్న పిల్లలు నిర్దాక్షిణ్యంగా నలిపి, కొరికి, పెన్సిలుతో కసితీరా పొడిచి కొత్తది కొనుక్కున్నాక విసిరి పారేసే పాత 'ఎరేజర్'లా తయారవుతాడు. ఇంకా ఏదో మిగిలివుంది అనిపించినా నచ్చని రుచించని శేషంలా మిగిలిపోతాడు. అప్పుడు ఈ పాత్రను తలుచుకుంటే బాధ, జాలి కలుగుతాయి. కథానాయకుణ్ని స్పృశిస్తూ నడిచిన మిగిలిన పాత్రలు కూడా చక్కగానే నడిచాయి. ఎంత తొందరగా ముగిసిపోయినా ప్రతి పాత్రా తనదైన అస్తిత్వాన్ని నిలుపుకుంది. బతికున్నప్పుడు వికసించకపోయినా చనిపోయినా తనేమీ చేయకుండానే చక్కని పాత్రగా మిగిలిపోతుంది చిరంజీవి పాత్ర. ఈ పిల్లాడు చనిపోవడం, వాడిని ఇంకా ఎదగని అభిమన్యు ఖననం చేయాల్సి రావడం కరుణ, ఆర్ద్రత కలిగిస్తాయి. కంటతడి పెట్టిస్తుంది. పాత్రల్లో, విభిన్నతను ఫణీంద్ర, చిదంబరం లాంటి పాత్రల ద్వారా సాధించి చూపించాడు రచయిత. అభిమన్యు కథని ఎంత నిర్వేదంగా నడిపించాడో ఫణీంద్ర పాత్రని ఉన్నంతసేపు అంత జల్సాగా నడిపించాడు.

నవల ఆద్యంతం రచయిత చెప్పకనే చెప్పిన ఎన్నో విషయాలు సునిశితంగా మనోవైజ్ఞానిక వ్యంగ్య ధోరణిలో నడిచాయి. అభిమన్యు, చిదంబరం కూతురు మధ్య నడిచే సన్నివేశాలలో అభిమన్యు మానసిక స్థితిని చాలా చక్కగా నైపుణ్యంతో వ్యక్తం చేయించాడు రచయిత.

మొత్తం చదివాక ఇది ఎవరి కథో కాదు, మన మధ్యతరగతి కథేనన్న విషయం గుర్తుకొచ్చి చెప్పలేని దిగులు, వ్యధ ముసురుకుంటాయి. అనుకోవడానికి 'అవశేషం' అనే పేరు మొదట్లో పాత వాసన కొట్టినట్లు ఏమంతగా రుచించనట్లు అనిపించినా, చివరికి సార్థకంగా మిగిలింది.

**–పి.పి. వరప్రసాదరావు,** నెల్లూరు

## ఓ అభిమన్యుడి తలపోత

రూ. 75/- పొందిన సమీక్ష

**ఓ** దిగువ మధ్యతరగతి అభిమన్యుడి తలపోత (నోస్టాల్జియా)ను వైవిధ్య భరితంగా అనేక మలుపులు తిప్పుతూ సగటు పాఠకుల్ని ఆలోచనల జడివానలోకి నెడుతుంది "అవశేషం" నవల. రచయిత నవులూరి వెంకటేశ్వరరావు తనదైన శైలిలో ప్రతీకల పరంపరతో ఒక అసమర్థ పాత్ర సందిగ్ధ అంతరంగాన్ని ఆవిష్కరించి అతనిలోని ఆత్మన్యూనతా భావాన్ని అద్భుతంగా చిత్రించారు. నవల విస్తృతి సుదీర్ఘం. చరిత్ర మాస్టారు శేషాచలం క్లాసుతో మొదలై విశాఖ సుందరి అంగాంగ వర్ణనతో, అభిమన్యు తమ్ముడు 'చిరంజీవి' అకాల మరణంతో, వయసు పైబడిన వ్యక్తితో అక్క పెళ్ళి, చిదంబరం 'చదరంగం', లలితతో పెళ్ళి తప్పిపోవడం, ఆ పెళ్ళి 'గిరీశం' లాంటి ఫణితో నిశ్చయం కావడం, చివరగా శేషాచలం చారిత్రక అవశేషపు అన్వేషణతోనే ముగియడం స్థూలంగా నవల ఇతివృత్తం.

అభిమన్యు గది చేరాడు. "లోపలికెళ్లి చేసేదే ముంది? " ప్రశ్న? "లోపలి కెళ్ళక చేసేదేముంది" ప్రతి ప్రశ్న!! "అసలు తాళం ఎందుకు వేశాను? చీకట్లో నిశ్శబ్దం, ఏకాంతం పారిపోతాయనా? " ఇదీ అతని అతీత మానసిక చైతన్య స్థితి! కథా నాయకుని అంతరంగంలో జరిగే మథనానికి సంఘర్షణ కేవలం అనుబంధమైనది మాత్రమే! అందుచేతనే ఈ నవలలో అస్తిత్వవాద ధోరణులూ, ఆధునిక మనస్తత్వ విశ్లేషణారీతులూ జమిలిగా చోటు చేసుకున్నాయి.

"ఈ నేలలో నాటుతున్న ఈ పసిడివిత్తనం మరోచోట మొక్కగా మొలుస్తుందా? మొలిచినా ఎక్కడో? ", "భూమి గుండెలలో దాచుకుంది వాడి శరీరాన్ని, జ్ఞాపకాలను మీ గుండెలకే వదిలి పెడుతున్నానని"...ఇలా ఈ నవలలో తండ్రి, తదితర అప్రధాన పాత్రల విషయంలో కూడా అంతరంగం, సంక్షోభాలు అగుపడతాయి.

వ్యక్తికీ, సంఘానికీ అందునా- వ్యక్తికి సంబంధించిన శరీరానికి, మనస్సుకూ మధ్య సంఘర్షణ ఎప్పుడూ జరుగుతూనే ఉంటుంది. అందులోంచి బయటపడదామని వ్యక్తి ప్రయత్నిస్తూనే ఉంటాడు. సమర్థవంతంగా ఎవరిచ్చినా వెలుగు ఆహ్వానించదగిందే! చీకటిని పారదోలాల్సిందే!! అయితే చివరకు మిగిలేది (అ)సమర్థ అవశేషం గానే? !! **ప్రాణహిత**, ఖానాపూర్,ఆదిలాబాద్ జిల్లా.

## ఆకట్టుకునే శైలి

రూ. 50/–
పొందిన సమీక్ష

డిసెంబరు 'చతుర' మాసపత్రికలో ప్రచురించిన నవులూరి వెంకటేశ్వరరావుగారి 'అవశేషం' నేటి రచనలకు భిన్నంగా, వినూత్న శైలిలో సాగిపోయింది. ఇలాంటి రచనలకు పుట్టినిల్లు 'చతుర' అనటంలో అతిశయోక్తిలేదు. అయితే రచయిత కేవలం శైలి కథనమే కాకుండా 'కథా ప్రయోజనం' కూడా దృష్టిలోకి ఉంచుకోవాలి.

కథ మొత్తం ఒకే పాత్ర చుట్టూ తిరుగుతుంది. దిగువ మధ్యతరగతి కుటుంబాలలో జరిగే సంఘటనలు, పరిస్థితులు, వాటి పరిణామాలు ఆ మనిషిలో ఎంత అలజడిని సృష్టిస్తాయో స్పష్టంగా చూడగలం ఈ రచనలో. అతని చుట్టూ జరుగుతున్న సంఘటనలు, తన ఆత్మీయుల మరణం అతన్ని అంతర్ముఖుడిగా చేస్తాయి. విపరీత ధోరణిలో ఆలోచనలు, విశ్లేషణలు అతన్ని వేదాంతిగా చేసి, జీవితం పట్ల విరక్తిని పెంచాయి. కానీ అది సరి అయిన పద్ధతి కాదు. మనిషికి మరే ప్రాణికి లేని ఆలోచన, తెలివి, మేధస్సు ఉన్నాయి. దాన్ని అతడు ఉపయోగించుకోవాలి. ఛేదించాలి, కష్టపడాలి. జీవితం సుందరమయంగా చేసుకోవాలి. "నేను ఏమి చేయగలను? చేసి ప్రయోజనం ఏముంది? " అనుకోవడం అవివేకం. అసమర్థులు చేసే ఆలోచన అది. కష్టాలు తనని పాతాళానికి లాగుతున్నపుడు, పైకి రావడానికి 'గడ్డిపోచ' అయినా దొరుకుతుందేమో" అని శోధించాలి. ప్రయత్నం ఇక్కడ తప్పనిసరి. ఒక రచన, "మనిషిని ఆలోచింపచేసి, తనకితాను పరిశీలించుకుని ఒక లక్ష్యాన్ని అలవర్చుకుని పైకి ఎదగడానికి" తోడ్పడాలి. కానీ ఈ రచన మనల్ని భయపెడ్తుంది. కర్తవ్యాన్ని మరిపిస్తుంది. వేదాంత ధోరణిలోకి పంపుతుంది. ఆత్మీయుల మరణాలు ప్రతి మనిషికి తప్పవు. దాన్ని విజ్ఞతతో మరో మంచి వ్యాపకంవైపు మరలించుకుని ముందుకు సాగిపోవాలి. రచయిత గమనించగలరు.

–**జీడిగుంట ఉషారాణి**, సిరిపూర్‌కాగజ్‌నగర్

## ఆద్యంతం ఆసక్తికరం

రూ. 50/–
పొందిన సమీక్ష

'అభిమన్యు' పేరు చదవగానే ఏదో అర్థం అయినట్లు అన్పిస్తుంది. మహా భారత యుద్ధంలో పద్మవ్యూహంలో చిక్కుకున్నాడు పురాణాల అభిమన్యుడు. జీవన సమరమనే పద్మవ్యూహంలో చిక్కుకున్నాడు ఈ 'అవశేషం' నాయకుడు అభిమన్యు. సమస్యల వలయాలలో, ఆర్థిక ఇబ్బందులలో ఒంటరి పోరాటం చేస్తున్న సగటు మధ్య తరగతి మనిషికి ప్రతీకైన అభిమన్యు, చివరకు ఆ సమరంలో విజయుడయ్యాడా అనే ఉత్కంఠతో చివరివరకూ చదివిస్తుంది, నవులూరి వెంకటేశ్వరరావు నవల 'అవశేషం'.

సగటు మనిషి మనస్తత్వాన్ని ఎంతగానో అర్థం చేసుకున్నారు రచయిత. అందుకే ఏ పాత్రని ఎక్కడా తప్పు పట్టరు. వాళ్ళ ప్రవర్తనను విమర్శించరు. ప్రతి మనిషికి, తన జీవితం తనదైన శైలిలో జీవించే హక్కు ఉంటుంది కదా!

ఫణీంద్ర దేహబాధ గురించి తెలుసుకుని ఏవగించుకోలేము. మానవ మాత్రుడు, సహజమైన

కోరిక అనుకుంటాం. అలాగే అతని దేహబాధను తీర్చే మహిళలను అసహ్యించుకోలేము. 'కూటి కోసం కోటి విద్యలు' అనుకోలేకపోయినా అవసరం, లేమి మనుష్యులను ఎలాంటి పనికైనా ప్రేరేపిస్తాయి అన్పిస్తుంది.

ఎంతో ప్రపంచ జ్ఞానం, పరిస్థితులపై అవగాహన, తత్వ విశ్లేషణ. ప్రతి చిన్న విషయాన్ని సునిశితంగా పరిశీలించే దృష్టి, సున్నితంగా స్పందించే హృదయం ఉన్న అభిమన్యు, తన జీవితాన్ని ముందుకు ఎలా నడిపించుకోవాలో తెలియని డోలాయమానస్థితిలో ఇరుక్కోవడం, ద్వైదీభావనతో అవకాశాలను జారవిడుచుకోవడం ఒకింత ఆశ్చర్యాన్ని కలగజేస్తుంది. చుట్టూ ఉన్న ప్రపంచాన్ని చూసి, చొచ్చుకునిపోయే స్వభావ అలవర్చుకుని ఉంటే లలితను పోగొట్టుకోకుం ఉండే వాడేమో! కానీ చిన్నతనం నుంచి, అత పెరిగిన వాతావరణం సహజంగానే అత మృదుస్వభావుణ్ణి చేసి ఉంటుంది. ఏదైతేనే అన్ని జీవితాలూ సుఖాంతాలు కావు. కానీ ఈ నవల 'అవశేషమే' కదా! అలనాటి అభిమన డిలా కాక, జీవితమనే పద్మవ్యూహంలో చిక్కుకున్న ఈ అభిమన్యు, దాన్ని ఛేదించి, విజేతగ నిలవాలని ప్రతి పాఠకుడూ కోరుకుంటాడు.

*–శశిసారధి, సికింద్రాబాద్*

## అసమర్థుని జీవయాత్ర ఇది

రూ. 50/- పొందిన సమీక్ష

**కొం**దరి జీవితాలు విధిగా జరగవలసినది, సాధించవలసినవి యేమీ లేకుండానే అవశేషాలుగా మిగిలిపోతాయి. 'అవశేషం' నవలలో అభిమన్యుడి పాత్ర అసమర్థ జీవితయాత్ర లాంటిదే!

పతితులు, భ్రష్టులు, బాధాసర్పదష్టులు, వ్యసనాలకు బానిసలు, శిథిలగృహాలు, చితికిన బతుకుల మురికి వాడల మధ్య అడుగడుగునా రకరకాల ఊహాగానాలు ఆలోచనలతో -విరాగిలాగా అభిమన్యు జీవితం సాగింది. తమ్ముడు, తల్లి, తండ్రి, కానరాని, తిరిగిరాని లోకానికి, అక్క తనకు అనువైనచోటుకి తనను వదిలివెళ్ళిపోగా, ఏకాకిగా వున్న వేదాంతిలాగా అభిమన్యు మిగిలాడు.

పెళ్లి చేసుకోవటానికి విముఖుడుగా వున్న అభిమన్యుని పెళ్లికి ప్రోత్సహించుతూ అతని బంధువు వెంకటాచలపతి "అభిమన్యూ! నీకు భార్య తోడుగా వుంటే, సపర్యలు చేయటానికి మరో వ్యక్తి తోడుగా వుంటుంది. పిలిస్తే పలుకుతుంది. ధైర్యంగా, ఉపశమనంగా వుంటుంది" అన్నాడు.

"ఇప్పుడు నారోగం రొష్టులతో నేనే ఏడ్చటే సరిపోతుంది. పెళ్లిచేసుకుంటే, కుటుంబ ఏర్పడితే, కనీసం మరో ముగ్గురి ఏడుపు కూడ నేనే ఏడవాలిగా బాబాయ్! " అన్నాడు అభిమన్యు. ఈ దేశంలో సామాన్యుని జీవిత భద్రత యెలా అనిశ్చితంగా ఉందో ఈ మాటలు తెలుపుతున్నాయి.

నాటి తెల్లదొరల దోపిడీని మించి నేటి పాలకులు, నేతలు, స్వాతంత్ర్య ఫలాన్ని, సాధించిన అభివృద్ధిని, సహజ సంపదల్ని, 60 యేండ్లనుండి ఒకరి తరువాత ఒకరు అధికారంలోకి వచ్చి వంతులవారీగా కొల్లగొడుతూ స్వంతం చేసుకున్నారు. ప్రజలందరికి చెందాల్సిన దేశ సంపద కొందరికే స్వంతం అవుతున్నది.

తత్ఫలితంగా పేదలు మరింత పేదలుగా మిగిలిపోతున్నారు. మహాకవి శ్రీశ్రీ అన్నట్లు పతితుల, భ్రష్టుల, బాధాసర్పద్రష్టుల, జీవితాలకు దర్పణం పట్టిన నవల అవశేషం. అందించిన "చతుర"కు అభినందనలు

*– పారుపల్లి వెంకటేశ్వరరావు, హైదరాబాద్*

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

## మత్స్య'రాశు'లు

మొలస్కా జాతికి చెందిన రకరకాల ఆల్చిప్పలు, చిరు చేపలు, నత్తలు లాంటివి సముద్రంలో సూర్యకాంతి సోకే లోతులేని చోటే బతుకుతుంటాయి. ఏడాది పొడవునా ఆహారం దొరకడంవల్ల అక్కడ నివసించేందుకు జీవుల మధ్య పోటీ కూడా ఎక్కువే. అందుకే ఇలా దట్టంగా ఒకేచోట రాశులు రాశులుగా కనిపిస్తాయవి.



